# ప్రతిభ

## నవ్యసాహిత్య పరిషత్పత్రిక

సంపాదకవర్గము:

తెలికిచర్ల వెంకటరత్నం, ఎం. ఏ., ఎల్. టి.
విశ్వనాథ సత్యనారాయణ, ఎం. ఏ.
అడివి బాపిరాజు, బి. ఏ., బి. ఎల్.
తల్లావజ్ఝల శివశంకర శాస్త్రి



గ్రంథనిర్ణాయక సంఘము:

నోరి నరసింహ శాస్త్రి, బి. ఏ., బి. ఎల్.
మల్లాది రామకృష్ణ శాస్త్రి, ఎం. ఏ.
తల్లావజ్ఝల శివశంకర శాస్త్రి

# విషయానుక్రమణిక



| సంపుటి ౨ | జూలై ౧౯౩౮ | సంచిక ౧ |
|---|---|---|




జులై. అక్టోబరు. జనవరి. ఏప్రిల్ మాసాలలో ప్రకటన.
ప్రతిభ సంవత్సరపుచందా రూ 2. విడిసంచిక రూ 0.8.0.


**కార్యదర్శి. నవ్య సాహిత్య పరిషత్తు. గుంటూరు**

# మొగసాల

దేవులపల్లి కృష్ణశాస్త్రి

౧

వేఁబోక విరియు, నెచ్చెలులార, యినుఁ డెగయు;
లజ్జావతి యుషస్సు రజత నీహారాంశు
కాంచలమ్ముల మౌక్తికాంసమ్ము గప్పికొను;
ప్రాభాత కలధౌత పాత్ర కెం దో వెలులు!

౨

హిమపాండుర మ్మయ్యె సుమలత కపోలమ్ము;
ఉదయవాసిత మయ్యె వసుధాసుధాననము;
అమరసీమా కోమలానిలమ్ములు వీచె;
త్రాగుఁడా మరల నూతనదినోదయవేళ.

౩

మరకతాసనమ్మునై కొలువున్నది గులాబి!
పరచి రుజ్జ్వల విపుల శాద్వలంపు తివాసి!
అరుణమందారమో! అనలప్రవాళమో!
మధువు, సాకీ, మధువు! మసల దీతొలిప్రొద్దు.

౪

ఏల యీ మధుశాల ఏరు మూసినవారు!
చాలు, నీ ప్రొద్దునా సాల మూయఁగలారు?
హే కవాటవిపాటకా! కృపాళూ, వేడు
వార మీద్వార మీవే తీయుమీ నేఁడు!

౫

అద్భుత, మ్మన్యాయు, మక్కటా, మార్ద్వీక
మందిర ద్వార బంధన మేల శుభవేళ?
త్రాగుఁడా యిట నీగులాబి పొదరింటిలో!
సాగు జీవన జీవనమ్మె యీయూటలో!

౬

ఈగారదీపాత్ర యిది సికందరు ముకుర,
మిందు ప్రతిబింబిత మ్మి విశ్వవలయమ్ము;
ఈ మంత్రికాక్షులకు నిది విచిత్రమయమ్ము.
ఇందు గ్రోలగ దొరకు విశ్వవిజ్ఞానమ్ము.

౭

అరుణ సుమవల్లిలో అరుణమాధ్వీపాన,
మరుణోదయమ్ములో అరుణాధరస్వదన,
మిట్టి పూవుల నంటి యేమధువ్రత మూను ?
ఇట్టి జీవిక లంటి యేచక్రవర్తి మను ?

౮

మరల హాఫీజ్, మరల, మధుపాత్ర, మధుపాత్ర !
మఱిమఱి ప్రియాననాన్వేషణోత్సవయాత్ర !
ఏనాఁడొ యేవింత సీమలోనొ తొలంగు
సీక్షమా దృఢహస్తములనే సఖి ముసుంగు !

[ హాఫీజ్ పద్యాలు చదివి ]

# కృష్ణశాస్త్రి మామయ్యా!

వింజమూరి శివరామం

ఇరులతెర లొత్తిగిల
మెరపించుతూ - కైత
పొదువువుల సానువుల
నడచి వచ్చిం దయ్యా!

నరకమూ నాకమూ
మరపించుతూ - మంచి
కల నీ ప్రవాసాన
పులకించి పూచింది.

ఊర్వశీగతులు, సౌ
పర్వ మహతీశ్రుతులు
కార్తికపూర్ణిమా
కౌముదీహారతులు
పరచినవి దిక్కుది
క్కులకు - చుక్కలకు....

నీలోతుగుండెలో
నిండి పొరలేపాట
కావాలి - ఆకలే
పోవాలి - బదరికా
నిర్మలామృతశాంతి
రావాలి - ఓకవీ!

[మహాకవి దేవులపల్లి కృష్ణశాస్త్రి పుట్టినరోజున : కాకినాడ]

# గురుదక్షిణ

## చింతా దీక్షితులు

వందలకొద్ది సంవత్సరములబట్టీ ఆ వంశములో చదువు లేదు; వందలకొద్ది సంవత్సరములబట్టీ ఆవంశములో ఉన్నది కూలిపని; బానిసత్వానికి సరిసమానమైన కూలిపని. ఆకూలిపనిలో విధేయతా, ఆకూలిపనిలో దాగిఉన్న సంఘముమీాది కోపమూ, ఆకూలిపనిలో స్వామిభక్తీ, ఆకూలిపనిలో ఒదిగి ఉన్న ముష్కరత్వమూ ఆవంశములో వందలకొద్ది సంవత్సరములబట్టీ జీర్ణమైనవి. చదువుకు సంబంధించిన సంప్రదాయాలూ వంశానికి తెలియవు.

అతడు ఆవంశములో పుట్టాడు. కులక్రమాగతవృత్తి కొంతకాలం సాగించాడు. చదువుకొన్నవాళ్లతో సహవాసం చెయ్యడం వల్ల కాబోలు చదువుకొందామని బుద్ధి పుట్టింది అతనికి.

ప్రయత్నించగా ప్రయత్నించగా అతనికి కూలిపని లేకుండా ఖాళీగాఉన్న సమయాలలో పాఠము చెప్పడముకు ఒక విద్వాంసుడు ఒప్పుకొన్నాడు.

విద్వాంసుడు గురువు;కూలివాడు శిష్యుడు; రాత్రిభాగము విద్య నభ్యసించేవేళ; అభ్యసించే విద్య ప్రాణవిద్య.ప్రాణవిద్య తదుపాసకులను కూలిపనిలోకిదింపి ఆకూలిపనికి ఉన్నతోద్యోగ గౌరవం ఇప్పిస్తుంది. ధనసంపాదన దానిపరమావధి.

కూలివాని తలలో విద్యాబీజములు వెదజల్లుతున్నాడు విద్వాంసుడు.

కొన్నిబీజములు మొలకలెత్తడములేదు. మొలకలు కొన్ని పాలిపోతున్నవి. ఒకటి రెండు మొలకలు బలహీనంగా బదికి ఉన్నవి.

ఒకటి రెండు సంవత్సరములలో విద్య పరిపూర్ణస్థితికి వచ్చింది. నేర్చుకొన్న విద్యాపరిమితి వ్రాత, కూడికతీసివేత లెక్కలు. అతడు గురువువద్ద సెలవు పుచ్చుకొన్నాడు. "గురుదక్షిణ ఏమియ్యామని సెలవు" అన్నాడు శిష్యుడు.

"ఇప్పుడుకాదు" అన్నాడు గురువు.

చదువు,వ్రాత, లెక్కలు వచ్చుననే కారణం చేతనూ, పుట్టుకవల్ల కూలివాడనే కారణంవల్లనూ అతనికి ఉద్యోగం దొరికింది : పోలీసుకనిష్టీబు ఉద్యోగం !

తన అధికారుల మెప్పు పొంది అతడు క్రమంగా వృద్ధిలోకి వస్తున్నాడు.

అవి తొందరరోజులు; ప్రజలు దొరతనము వారిపై తిరగబడ్డరోజులు;దొరతనమువారు

ప్రజలకు ఏవిధముగానైనా తమ శక్తిచూపి బుద్ధిచెప్పవలెనని సంకల్పించుకున్న రోజులు. దోషి, నిర్దోషి; తనవాడు, ఇతరుడు; సజ్జనుడు, దుర్జనుడు; అనే విచక్షణలేకుండా దొరతనమువారు తమ బలమును ప్రజలకు ప్రదర్శిస్తున్నారు.

అతడు దొరతనమే తాననుకొని భక్తితో పనిచేస్తున్నాడు. అతనికి కూడుగుడ్డ దొరతనమేగదా ఇస్తూంట! కూడు - అతని జీతము; గుడ్డ - వారిచ్చేలాగూ, చొక్కా, టోపీ, తోలుపటకాలు, లాటి, తుపాకీ, తూటాలు. కూడూగుడ్డా ఇచ్చేవారియెడల భక్తికలిగి ఉండడం సహజమని అతనిఊహ.

విద్వాంసుడు ప్రజలలో ఒకడు.

కూలివాడు దొరతనములో ఒకడు.

గురువు ప్రజాపక్షము.

శిష్యుడు స్వామిపక్షము.

అతడు ప్రతీరోజూ చాకచక్యముతో తన లాటీ ప్రజలశరీరముమీద ప్రయోగించడం నేర్చుకొన్నాడు. మద్యపానముతో పని లేకుండానే అతడు నైపుణ్యముతో లాటీ ఉపయోగించగలడు. ప్రతీరోజూ అతడు తన కూడూ గుడ్డా సంగతి తలుచుకొంటు న్నాడు. ప్రతీరోజూ తనను తన అధికారులు మెచ్చుకొని కూడూ గుడ్డా వృద్ధి చేస్తారని అనుకొంటున్నాడు.

ఒకనాడు లాటీలు ప్రజల శరీరములమీద ఈగలవలె వాలుతున్నవి. ప్రజల శరీరములు వాటివల్ల ఉప్పొంగుతున్నవి. అందరి లాటీలకంటె చురుకుగా అతని లాటీ ఆడుతున్నది. ఆసమయాన అతడు ప్రజలలో తన గురువును చూచాడు. అలవాటు చొప్పున తన లాటీ ఎత్తి గురువుశరీరము మీద వాల్చాడు. గురువు చిరునవ్వునవ్వి "ఈరోజున నాకు గురుదక్షిణ ముట్టింది" అన్నాడు.

శిష్యుడు లాటీచేతులతో అతనికి నమస్కరించాడు. యథాప్రకారం తన విధ్యుక్త కార్యము చేస్తున్నాడు.

*

కొన్నాళ్లు గడచింది.

అతడు ప్రజలతో లాలూచీ అవుతున్నాడని అతనిమీద కిట్టనివాళ్లు - సాటి ఉద్యోగులే - అర్జీఇచ్చారు. పోలీసు అధికారి విచారణ చేశాడు.

"నువ్వు రాజద్రోహికి నమస్కారము చేశావా?"

"ఆతడు రాజద్రోహిఅయినా నాకు——"

"అదంతావద్దు; నమస్కారం చేశావా?"

"రాజద్రోహిని కొట్టాను. గురువుకు——"

"అనవసర ప్రసంగం వద్దు. రాజద్రోహికి నమస్కరించావా లేదా?"

"నమస్కరించాను. కాని——"

"సరి, నీవు వెళ్లు."

అతనికి ఉద్యోగం పోయింది.

కూడూగుడ్డా పోయింది.

బాగా ఆలోచించి అతడు సలహాకోసం గురువుదగ్గిరికి వెళ్ళాడు. గురువు "ఎందుకు వచ్చావ"న్నాడు.

"నాచదువు పూర్తిచేసుకోడానికి" అన్నాడు శిష్యుడు.

"ఇంతవరకూ చదివినందువల్ల నీకు కలిగిన లాభం ఏమిటి ?"

"కూడూ గుడ్డా."

"ఆలాభం నిలిచిందా ?"

"పోయింది."

"ఇప్పుడు ఏమికావలె మరి ?"

"ఇంకా ఎక్కువ చదువుతా."

"ఎందుకు ?"

"కూడూ గుడ్డా పోకుండా నిలిచే మార్గం కోసం."

"కానీ"

శిష్యుడిచేతిలో పోతన్నగారి భాగవతంపెట్టి ప్రతీరోజూ చదవమన్నాడు గురువు. నెల దాటినతరువాత రమ్మన్నాడు.

నెలగడిచింది. శిష్యుడు వచ్చాడు.

"ఏమి నేర్చుకొన్నావు ?"

"వాచకం బాగావచ్చింది."

"అంతేనా ?"

"కథ కొంతకొంత తెలుస్తోంది."

శిష్యుడు వెళ్లి నెలపోయినతరువాత మళ్లీ వచ్చాడు.

"ఎందుకు చదువుతున్నావు?"

"కూడూ గుడ్డా కోసం"

కొన్ని నెలలపాటు శిష్యుడు భాగవతమే చదువుతున్నాడు. ఎప్పటికైనా గురువును తృప్తిపరచాలని.

ఒక ఆవృత్తి అయింది.

విద్యకు పరమావధి కూడూగుడ్డా కాదేమో అనుకొన్నాడు శిష్యుడు.

రెండవ ఆవృత్తి అయింది.

విద్యకూ కూడూ గుడ్డలకూ సంబంధము లేదేమో ననిపించింది శిష్యుడికి.

గురువు దగ్గిరికి వెళ్ళాడు.

"ఉద్యోగంపోయిందిగదానీకెలాగడుస్తోంది?"

"పుట్టుక ఇచ్చినవాడే పెట్టుతున్నాడు బాబయ్యా" అన్నాడు శిష్యుడు.

"నీకు లోటులేకుండా ఉంటుంది. ఉద్యోగం ఒకటి ఖాళీగావుంది. వెడతావా ?"

"నాకెందుకండీ ? కాడెద్దులను పెట్టుకొని భాగవతం చదువుకొంటూ కాలక్షేపము చేస్తాను.''

"విద్యకు పరమావధి ఇప్పుడు తెలిసిందా?"

"చిత్తం."

"ఏమిటి ?"

"ధర్మం, మోక్షం."

"సరే, వెళ్లు."

"చిత్తం. తమకు ఏమి గురుదక్షిణ ఇచ్చుకోమని సెలవు ?"

“ఇప్పుడుకాదు” అన్నాడు గురువు.

రెండవమారు దేశంలో తొందర రోజులు వచ్చాయి. పూర్వముకన్న ఎక్కువగా దొరతనమువారు తమశక్తి ప్రదర్శిస్తున్నారు. మళ్లీ గురువు ప్రజాపక్షాన్ని నిలిచాడు.

శిష్యుడు గురువుకు నీడ అయినాడు.

ఒకనాటి అల్లరిలో ఆ గురువును లాఠీలతో దొరతనపు సేవకులు కొట్టదలచుకొన్నారు.

శిష్యుడు గురువే ధర్మమని మనస్సులో అనుకొన్నాడు. ఆరోజున గురువు శరీరము మీద పడవలసిన దెబ్బలన్నీ శిష్యుడి దేహాన్ని అలంకరించాయి.

శిష్యుడు ఒళ్లు తెలియక పడిపోయాడు. గురువు శిష్యునిపక్క కూచుని ఒళ్ళు నిమురుతున్నాడు.

గురువుచేయితగిలిన కొంత సేపటికి శిష్యుడు కళ్లు తెరిచి గురువు కేసి చూచాడు.

గురువు వంగి అతని చెవిలో “నిజమైన గురు దక్షిణ యీరోజున నాకు ముట్టింది” అన్నాడు.

శిష్యుడు చిరునవ్వు నవ్వి మళ్ళీ నీరసంవల్ల కళ్ళుమూశాడు.

# ఆమె

## దేశిరాజు కృష్ణశర్మ

ఆమె మనోజ్ఞమూర్తి; హృదయంబొక లేతశిరీషపుష్పరే
ఖామృదులంబు; నిండి తొలుకాడును సర్వపవిత్ర భావనా
శ్రీ మహిమంబు లావదనసీమ; ప్రశాంత నభస్తరంగిణీ
కోమలఫేనపంక్తి వినిగూహము లామె ప్రగాఢహాసముల్.

ఆమె నడయాడుపట్ల నీలాంబుదాల
యోరపు మెరవులు పవమాన యోగగరిమ
కలిసి విహరించునట్లు, లగాధమైన
పుణ్యతటినీ ప్రవాహంబుపూరమట్లు,
వ్రాలు వినువీథి వెన్నల చాలులందు
చలువరాయడు భువనాలు చల్లబడగ
మెల్లగా నేగురీతి కామ్రేడితంబు.

ఒక చిరునవ్వె దివ్యసుధ లోడికగట్టు; ఒకొక్కమాట జ
న్మకు పరిలబ్ధపుణ్యపరిణామము; శాంతవిముగ్ధరోచులన్
వికసితపుష్పభావ మొలపించును; ఆమె ముఖావలోకనా
త్మక పరితృప్తి నాయెద కదల్చును దివ్యపవిత్రభావముల్.

ఉదయసంధ్యల నిలువెల్ల నుదితరమ్య
రాగపరిపూర్ణయై పవిత్రానుభూతి
ఆమె రచియించు దివ్యపూజాప్రసూన
మాలికలయందు, జీవిత మార్దవంబు,
వలపుటాశలు, ప్రేమకైవసమురీతి,
నోముఫలములు, కలిసి మనోహరములు.

ఓయి కరువలి, జగమెల్ల యాసరిలుచు
ఆకటికి మాడి తిరుగు భిక్షార్థివోలె
నేము వేసారుచుండెద వెపుడు - ఆమె
పలుకు పలుకున అమృతంపుచిలుపలెల్ల
ఏరికొనుమోయి! మరియు, ఆహృదయ నిబిడ
వేదనామ్నాయమానమై విదితమైన
దివ్యభావాలనెల్ల నర్థించుచుండు
మపుడపుడు - ఆమె భావసంపదలనెల్ల
మేళవించుచు వీణియ మీటునపుడు
దివ్యతంత్రుల పైపైన తేలివచ్చి
నాకు వినిపించుచుండుము......

# మా బాపిరాజు

శ్రీ రుక్మిణీనాథశాస్త్రి

తెలుగువనముకు దోహదములన్
దీప్తి నిచ్చిన ఘనుడ వయ్యా....
పొసగగా కవనమ్ము శిల్పము
పోహళించితివి!

....

అందాలు చిందినవి పొంకాలు కుదిరినవి
కాళ్లగజ్జలు ఘల్లుఘల్లు మంటున్నాయి
లాస్యాలు ఆగినవి ఆస్యప్రభలు విచ్చ
ఆనంద మందుతూన్నది సరస్వతిదేవి!

మాకు....
అలరవీంద్రుడ వీవె అవనీంద్రుడవు నీవె
పట్టినదెల్ల బంగారమ్ము చేయగా
నీ బొనవ్రేలిచ్చు నెరచూర లందుకొని
కవనమూ శిల్పమూ గజ్జకట్టినవి!

మీరు
ఒరులగొప్పను మెచ్చుకోలేని తెలుగుల్లో
చెయిజారి పడ్డారు శీర్షమకు టైనారు!
నాబాపిరాజ! ఓహెూ పాపజేద!
నాబాపిరాజ! ఓహెూ పాపజేద!!

వేయితల లందుకోరాని భావమరీచి
క్షణములోపల మీకు కరతలామలకమే!
పాటల్లో కథలలో చిత్రాల్లో గోష్ఠిలో
నాగనర మూది నాతలపాము నాడించి

ఏదో మచ్చుజల్లి నా డెందమ్మును హరించి
దానితో నొకకొత్త సృష్టి చేతురు మీరు !

మీ హృదంతర మొక్క 'ఏథీసనే' యగాను
జ్ఞానప్రసూనాంబ మీఉపాస్యమ్ముకా!

రసస్రష్టలు మీరు రసపిపాసిని నేను
నాబాపిరాజ ! ఓహో పాపతేద !

తెలుగువనముకు దోహదములగా
దీప్తి నిచ్చిన ఘనుడ వయ్యా....
పొసగగా కవనమ్ము శిల్పము
పోహళించితివి!

# కావ్య ప్రయోజనము:

## కావ్యాలు ఎందుకు?

నోరి నరసింహ శాస్త్రి

౧

ఈ వ్యాసంలో వివాదలు పెంచదగిన విషయా లెన్నో ఉన్నవి. కాని అవి ఇక్కడ వృథావివాదలకోసము వ్రాయలేదు.

ఇందులో ప్రతిఅంశమూ నా అంతరంగములో కలిగిన మథనవల్లనే ఇందులోకి ఎక్కించినాను. కాని పూర్వ మెవరూ చెప్పనిది నేను కొత్తగా పుట్టించుకొని వచ్చి చెప్పడంలేదు.

౨

ఈమధ్య నేను ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారి గ్రంథాలయంలోకి వెళ్లడము తటస్థించినది. వరసలువరసలుగాతీర్చి వేలకొలదిగా ఉన్న ఆ గ్రంథాలు చూడగానే పుస్తక ప్రేమికల నాకు బ్రహ్మానందమైనది. అప్పుడు నాకు సాక్షాత్తు స్వజనంలో ఉన్నట్లుగా తోచింది. అక్కడి పుస్తకాలపేర్లు చదువుకుంటూ ఆ సంపుటాలు చూచుకొంటూ కొంతసేపు ఆ గ్రంథసముద్రములో తేలిపోయినాను.

అంతలో అకస్మాత్తుగా నా హృదయంలో ఒకవిధమైన ఆవేదన ప్రారంభించింది. ఇంతకంటే ఎంతో పెద్ద గ్రంథాలయాలు లోకంలో ఎన్నో ఉన్నవే! లోకంలో అసలు పుస్తకాలన్నీ ఎన్ని ఉన్నవో! జ్ఞానతృష్ణ కలవాడికి చదువుకు ఏమన్నా అంతమున్నదా? పోని చదువుకు అంతము లేకపోవచ్చుగాని, చివరకు అందులో ఏదైనా దారివినా ఉన్నదా? ఇవన్నీ ఎందుకు? ఈవిధంగా ఊహాపరంపర రాగా, చిన్నపిల్ల కనపడితే ముసలివాడికి కలిగేముచ్చట కొత్త పుస్తకంచూస్తే కలిగే నాకు ఏమీ దారితోచలేదు. అగమ్యగోచరంగా ఉండి ఒకబల్ల ముందు కూలబడ్డాను. ఇంతకూ మహావీరునిచరిత్ర తెలుసుకోవలెనని జైనమతంమీద ఏమి పుస్తకాలు ఉన్నవో చూతామని వెళ్ళిన నాకు, అందులో నాలుగైదు పుస్తకాలకంటే ఎక్కువ కనపడలేదు; ఆకనపడ్డవి నాకు ఉపయోగించనూలేదు. ఆగ్రంథాలయంలో ఈవిధంగా కలిగిన ప్రశ్న అంతటితో ఆగలేదు. అప్పటినుంచి మాటిమాటికీ ఆప్రశ్నే నన్ను వెంటబడి వేధిస్తూ ఉన్నది. ఈ గ్రంథ మహాసముద్రాన్ని సులభముగా రెండురకాలుగా విభజించవచ్చును. అందులో మొదటిరకము

శాస్త్రగ్రంథాలు. ఈరకం గ్రంథాలకు ప్రత్యక్షముగా ప్రయోజనము కనబడుతుంది. వాటిని నాప్రశ్న ఎక్కువగా బాధించదు. అయితే మనము సామాన్యముగా కావ్యా లంటున్నామే ఆపుస్తకాలగతి ఏమిటి? ఇక్కడ కావ్యాలంటే అన్నివిధములైన పద్యకావ్యాలు నాటకాలు కథలు నవలలు ఇత్యాదులన్నీ ఏవైనాసరే రసవంతమైన రచనలన్నింటినీ ఉద్దేశించి నేనీ ప్రశ్న వేస్తున్నాను. ఈపరిమితమైన అర్థములోనే కావ్యశబ్దము ఈవ్యాసములో ప్రయోగిస్తున్నాను. లోకసామాన్యానికి ప్రయోజనము లేనివీ నాకు అభిమానమైనవీ ఆకావ్యాలనే గ్రంథాలే. వాటినే పైనచేసిన విభజనలో రెండోరకము గ్రంథాలని ఉద్దేశించినాను. వాటిసంగతే ఎందు కివన్నీ, అని ఇప్పుడు ప్రశ్నిస్తున్నాను.

ఈ కావ్యాలు లోకాని కెందుకు? మనమెందుకు కావ్యాలు వ్రాయవలె? ఇతరులు వ్రాసినవి ఎందుకు చదువవలె? అట్లాచదివినందువల్లగాని వ్రాసినందువల్లగాని ప్రయోజన మేమిటి? పుణ్యామా, పురుషార్థమా? రైళ్లలో ప్రయాణం చేసేవారికి పొద్దు పోదు; అందుకని ఏపుస్తకం ఎక్కువ చవకగా దొరికితే, అదికొని దాన్ని చదువుతూ ఎట్లాగో తమ ప్రయాణకాలం వెళ్లబుచ్చుతారు. ఆవిధంగానే ఈలోకయాత్రలో కాలహరణం కోసమే ఈవ్రాతా చదువూ పుట్టినవా? అవికూడా చీట్లపేకా చదరంగమూ మొదలైన ఆటలవలె వినోదార్థము పుట్టినవేనా? అంతకంటే ఎక్కువ ప్రయోజనము కవికీ పాఠకుడికీ ఇంకా ఏమైనా ఉన్నదా?

ఈప్రశ్న వినగానే కళోపాసకులైన నామిత్రులు తమ ఉన్నతస్థానమునుంచి నేనడిగిన పిచ్చిప్రశ్నకు నావైపు క్రీగంటితో తమ అపహాస్యపు చూపులు ప్రసరింపచేస్తారు. కళకు ప్రయోజన మేమిటి? 'కళకు ప్రయోజనముకళే. Art for art's sake!'-అనిఅంటారు. లేకపోతే, అందులో కవులైనవారు,

"సౌరభము లేల జిమ్ము పుష్పవ్రజమ్ము?
చంద్రికల నేల వెదజల్లు చందమామ?"

అని నన్ను మళ్లీ బదులు ప్రశ్న వేస్తారు. వారికి నా జవాబు ఇది! ప్రశ్నకు ఎదురు ప్రశ్న వేయడము ఎన్నటికీ జవాబు కానేరదు. ఎవరెంత నన్ను అపహసించినా నా ప్రశ్న నేను మానను.

ఎందుకంటే, కళకు ప్రయోజనము కళే అనే మాటను సూక్ష్మదృష్టితో యోచిస్తే దానికి అర్థములేదని స్పష్టపడుతుంది. వస్తువూ దాని ప్రయోజనమూ ఎప్పటికీ ఒక్కటే కానేరవు. అద్వైతంలోపడి వేదాంతంలోకి పోతే ఏమో తెలియదుకాని, ఈలోకప్రపంచంలోమాత్రము వస్తువూ దాని ప్రయోజనమూ తప్పక భిన్నముగా ఉంటవి. ఏదో ఒక ప్రయోజనము ఉద్దేశించకుండా చివరకు మందబుద్ధికూడా ఎందు

లోనూ ప్రవర్తించచదని పెద్ద లంటారు. అయితే కవులూ కావ్యపఠితలూ మంద బుద్ధులకంటే నికృష్టులా? అది కానేరదు. కావ్యాలు వ్రాయడానికీ చదవడానికీకూడా ఏదో వేరే ప్రయోజన ముండితీరవలె.

ఈమాటలు వినగానే ముందు మా 'భావ కవులు' నామీద విరుచుకొని పడతారు. మా హృదయాలల్లో పాల పొంగువలే, బ్రహ్మాండంలో గాలివానవలే, భావోద్రేకము వెల్లువ లవుతూవుంటే, అది భరించ లేక మా కావ్యాలు వ్రాస్తాము. అంతే కాని మే మేమీ వేరే ప్రయోజన ముద్దేశించి వ్రాయము. మాహృదయశాంతే ప్రయోజనము అంటారు.

భావోద్రేకములేకుండా బలవంతాన కావ్య రచన చేయగూడదనడంలో వారితో నేను పూర్తిగా ఏకీభవిస్తాను. అయితే ఏదో భావోద్రేకముకలిగి పట్టలేక వ్రాసినారు. బాగానేఉన్నది. అయితే నిజంగా మీఉద్దేశము అంతమాత్రమే అయితే వ్రాసి అంతటితో ఊరుకోక అవన్నీ అచ్చువేయించి మాప్రాణము తీయడ మెందుకు? పదిమందికీ వినిపించి బాధపెట్టడ మెందుకు? కవి కొక దుఃఖము కలిగిం దనుకుందాము. వాడిఏడుపు వాడు ఏడ్చుకోక లోకాన్నంతా ఏడిపించ వలెనని ప్రయత్నించచడ మెందుకు? పోనీ, కవి తా నొకకన్యనువలచి ప్రేమ భరించ లేక ప్రేమగీతాలు పాడినా డనుకుందాము. మన కందరికీ ఆప్రేమగీతాలుచదివి వినిపిస్తే అతని కేమి జరుగుతుంది? అంతమాత్రం చేత అతనికిగాని, శ్రమపడి వినేవాళ్ళకు గాని ఆపిల్ల లభ్య మవుతుందా? కానేకాదు! కాబట్టి కవులు తమ మనశ్శాంతి కోసమే ఒకవేళ వ్రాసినా కావ్యప్రకటనమైనా అందుకు కానేరదని తేలుతుంది.

అదిగాక భావోద్రేకము పట్టలేక దాని విసృష్టికోసమే కవులు వ్రాస్తూఉన్నారంటే కావ్యములో కల్పనకు, శిల్పముకు, కళకు స్థానంలేకుండా పోతుంది. లోకంలో శోకించే వాళ్ళు చాలామంది ఉన్నారు. ప్రేమించే వాళ్ళూ చాలామంది ఉన్నారు. వాళ్ళందరి ప్రేమా శోకమూ గ్రంథరూపంగా చేట భారతమల్లే వ్రాసుకు పోతే అది మంచి కావ్య మనిపించుకుంటుందా? అనిపించు కోదు. కాబట్టి వట్టి విసృష్టిసుఖంకంటే భిన్నమైన ప్రయోజనము కావ్యానికి ఉండవలె.

ఈ విసృష్టి సుఖసిద్ధాంతానికి ఇంకా చాలా బాధకాలున్నవి. ఈ సిద్ధాంతము బలవంతాన అయినా, ఆత్మానుభవం వర్ణించే పరిమితమైన కావ్యాలకే పట్టించగలముకాని ఇది దృశ్యప్రబంధాలకూ ఆత్మేతరకథలు చెప్పే కావ్యాలకూ ఏమాత్రమూ అన్వయించదు. కాబట్టి ఈసిద్ధాంతము మిక్కిలి అసమగ్రమైనది.

అయితే కావ్యప్రయోజనము కవికియశస్సు రావడమే అనవచ్చును. ఇది కాదనేందుకు

వీలులేదు. మాకేమీ కీర్తికాముకత్వము లేదని చాలామంది అంటారు; కాని వారి మాటలు నమ్మదగ్గవి కావు. అందులో కాస్త హెచ్చుతగ్గులుంటే ఉండవచ్చును గాని యశస్సు సుతరాం అక్కరలేదనుకునే కవి ఉండడము పట్టికల్ల. సత్కీర్తి కావలెనని కోరుకోవడము దోషముకూడా కాదు. ఈకోరిక కవికి కావ్యసృష్టి చేయడంలో శ్రద్ధ కలగడానికి ముఖ్యకారణంగా ఉంటూ ఉంటుంది. సత్కావ్యము వ్రాసిన కవికి అట్టి కీర్తి తరుచుగా ప్రాప్తమవుతూనూ ఉంటుంది. ఐతే ఈ ప్రయోజనము కవికే కాని పాఠకులకు కాదు.

యశస్సులాంటిదే ధనమూను. కావ్యమువల్ల అదృష్టశాలిఐనకవికి ధనముకూడా లభిస్తుంది. ధనము కోసమే ఎందరో గొప్ప కవులు కావ్యాలు వ్రాసిన సంగతి మన మెరుగుదుము. ఐతే ఇదికూడా కావ్యకర్తకు కలిగే ప్రయోజనమే, కాని పాఠకులకు కలిగేదికాదు. కాబట్టి యశస్సూ అర్థమూ సమగ్రమైన కావ్యప్రయోజనములుగా అంగీకరించలేము.

దీన్నిబట్టి ఒక్కవిషయము వెంటనే నిర్ధారణ అవుతుంది. కావ్యప్రయోజనమేదైనా అది పాఠకలోకానికి ఉపయోగకారి ఐనదిగా ఉండవలె. ఆ ప్రయోజనము ఏదో ఒక విధమైన లోకసంగ్రహము. కవి ఎంత భావోద్రేకము అణచుకోడానికి వ్రాసినా, కావ్యమెంత బాగున్నా, అందువల్ల లోకసంగ్రహము కలగకపోతే, లోకానికి దానితో పనిలేదు. లోకోపకారకమైన కావ్యాన్నే లోకముస్వీకరించి గౌరవిస్తుంది. ఏదోఉపదేశించి లోకోద్ధరణ చేయడానికి ఉపయోగించనికావ్యమును అదిఎంతచక్కనిదైనా సరే - లోకము ఆదరించదు.

౯

కావ్యము లోకోద్ధరణ ప్రయోజన మన్నదానిలో విపరీత మేమీలేదు. కాని ఈ మాట అనేదేవ్యవధానంగా నా మీదికి రెండువైపులనుంచి ఒక్కసారిగా బాణాలు పడతవి.

"లోకోద్ధరణమంతా మేమే గుత్తకు తీసుకున్నాము. అందులో కవుల కేమి పని!" అంటూ మతాధిపులూ, వేదాంతులూ, ధర్మశాస్త్రకారులూ ఒకవైపునుంచి నన్ను బాధిస్తారు. పెద్దలైనవారి ఎదటనిలబడి వాదించడము అపరాధము. "మీరుచెప్పిన అన్ని ఉపదేశాలకంటే రామాయణమూ, మహాభారతమూ, భాగవతమూ ఇలాంటి కావ్యాలు లోకాన్ని ఎక్కువ ఉద్ధారంచేసినవి" అని మాత్రము వారికి మనవిచేసి వారిమీద ఒక్క నమస్కారబాణమే ప్రయోగిస్తాను. సాత్వికులైనవారు శాంతించి నన్ను క్షమిస్తారు.

కాని రెండవవైపునుంచి నామీదికి కయ్యానికి దూకేవాళ్ళు అంత సులభంగా పోరు.

వాళ్లు "ఉపదేశము కావ్యంలో నీరసంగా ఉంటుంది. 'వెన్నముద్ద నోట గరచుకొన్న కాకీ నక్కా కథ చెప్పి చివర ముఖస్తుతికి మోసపోరాదు' అనీ, 'పాపచూసి మొరిగి నోట్లో రొట్టెముక్క పోగొట్టుకున్న కుక్క కథ చెప్పి చివర పేరాశపనికిరాదు' అనీ ఈవిధంగా కథవ్రాసి నీతి వ్రాయవలెననే నీ అభిప్రాయమా? లోకులంతా నీతులు తెలియని పసిపిల్లలూనూ, ఈకవులే మహా నీతిబోధ తెలిసినవారునా?" అని వారు నన్ను ఆక్షేపిస్తారు.

అందుకు నా సమాధాన మిది. మీరుచెప్పిన విధంగా నీతిబోధించే కథలు అంత హేయమయినవికావు. పసిపిల్లలకుకథలు వ్రాయడమంత చులకనపనీకాదు. అట్టి కథలెన్నో లోకంలో ఉత్తమకావ్యాలుగా రసికులందరూ పరిగణిస్తున్నారు. అయితే ఆవిధంగా స్పష్టంగా వాచ్యంగా ప్రతికావ్యంలోనూ నీతిబోధచేసితీరవలెననికూడా నేను కోరడంలేదు.

ఉపదేశించేందుకు మార్గాలు ఎన్నో ఉన్నవి. అయితే ఆఉపదేశము వాచ్యముగాచేయక వ్యంగ్యముగా ధ్వనిప్రధానముగా, సూచనచేస్తూ చేస్తే, ఆఉపదేశము ఉత్తమమైనది. అటువంటి ఉపదేశము మన హృదయంలో సుఖంగానూ, గాఢంగానూ, దృఢంగానూ నాటుకుంటుంది. కావ్యాలలో ఉపదేశము ఈ విధంగా చేయవలెననే పెద్దలమతము. అందుకనే వారు కావ్యాలు కాంతాసమ్మితంగా ఉపదేశిస్తవని చెబుతారు.

ఉపదేశముచేయని కావ్యము నిష్ప్రయోజనము. సంపెంగ ఎంత సువాసన కలదైనా దానితో తేనెటీగకు ఏమిపని! వరూధిని బహుచక్కని అప్సరస; విద్యావతి; ప్రేమోన్మత్త. అయితే వాటితో ప్రవరుడికి ఏమి ప్రయోజనము? ఇక్కడ పెద్దన్న ఉపమానము తారుమారు చేసినందుకు నేను క్షంతవ్యుడను.

ఇంద్రియ లౌల్యమువల్ల ప్రతి జీవికీ ఒకవిధమైన సుఖానుభూతి కలుగుతున్నది. అది ఆనంద మనడానికి నాకు మనస్కరించడము లేదు కాని కొంద రది ఆనందమే అనుకోవచ్చును. ఎంత 'ఇనపకచ్చడాలు కట్టుకున్న మునిముచ్చు' లైనా ఈ ఇంద్రియ సుఖము అనుభవించే ఉంటారు. ఆ సుఖ మనుభవించేప్పుడు ఒళ్లు పరవశమవుతుంది, ఇంకా అనుభవించవలెననే ఇచ్ఛఉంటుంది. ఇప్పుడు ఎందువల్లనో, ముఖ్యముగా ఐరోపా మహాసంగ్రామానంతరము, కవులకందరికీ ప్రత్యేకముగా మైథున ప్రసంగముమీద అభిమానము ఎక్కువయినది. అది మన తెలుగు కవుల వ్రాతలలోకూడా మరీ మితిమీరిపోతున్నది. ఆ అభిలాషా దాని అనుభవములోని పారవశ్యమూ ఎరగనిజీవిఅంటూ ఉండదు. కాని అదేవిధంగా అన్ని ఇంద్రియముల వ్యాపారాలలోనూ కొంచెము

హెచ్చుతగ్గుగా సుఖము ఉంటుంది. కొందరికి కమ్మని పదార్థాలు తినడంలోనూ సమ్మతమైన పానీయాలు తాగడంలోనూ కలిగే పారవశ్యము పైన చెప్పినవారికి ప్రత్యేకాభిమానముగల కర్మలోకూడా ఉండదు. మరికొందరికి కమ్మని పరిమళములమీద అటువంటి అభిలాషే ఉండవచ్చును. వారికా పరిమళానుభవమే జీవితావధి. ఇట్లాగే అన్ని ఇంద్రియముల వ్యాపారాలున్నూ! అనేకమైన నేరములు చేసినవాడొక డీమధ్య తనకథ చెప్పుతూ ఎంతోమంది పిల్లలపీకెలునొక్కి వృథాగా చంపినానని ఒప్పుకున్నాడు. అట్లాఎందుకు చంపినావంటే, "ఆపిల్లలు పీక నొక్కినప్పుడు కెవ్వుమని కేకవేసేవారు. ఆ కేక వింటే నా దేహమంతా ఒక్కసారి గగుర్పొడిచి వర్ణించలేని మైథున సుఖానుభూతి కలిగేది. ఆ సుఖంకోసము పసిపిల్లలపీకెలు పిసికి చంపేవాణ్ణి" అన్నాడు. లౌకికమయిన సుఖము ఈవిధముగా పరిపరివిధాలుగా ఉంటుంది.

ఈ ఇంద్రియసుఖానుభూతివల్ల కలిగే సంతృప్తి కలిగించడమే కావ్యప్రయోజన మంటారా? ఇంకా అదే వివరించి ఇంకొకవిధంగా చెబితే ఇంద్రియ సుఖాల ప్రత్యక్షానుభూతి చేతకానివాళ్ళకు కావ్యరూపంగా పరోక్షానుభూతి కలిగిస్తామంటారా? అట్లా అంటే చదువరులంతా అసమర్థులని వారిని అగౌరవించిన ట్లవుతుంది. ఈమతములో కావ్యపాఠముకూడా ఒకానొక క్రీడావిశేష మాత్రమే అవుతుంది. అట్టిభావము నాకు సమ్మతముకాదు. అంతమాత్రముచేత కావ్యపాఠము విసుగుగా ఉండేట్లు చేయడమే కవిగొప్పదనమని నాఆశయముకాదు. కావ్యపాఠము క్రీడాప్రాయంగానే ఉండవలె. అయితే అందులో ప్రయోజనముకూడా ఉండవలె. అది క్రీడఅయితే ఉపాధ్యాయులు కిండరు గార్టెను పద్ధతిలో పిల్లలను ఆడిస్తూ ఆఆటతోనే పాఠము చెప్పినట్లుగా కొంతవరకూ ఉపదేశించవలె. ఇట్టి ఉపదేశాలు ఉన్న కావ్యాలనే లోకము ఉత్తమోత్తమమైనవిగా అంగీకరించి గౌరవిస్తుంది.

౪

కావ్యములో ఉపదేశము లేకపోతే అది నిరర్థకము. అదే ఇంకోవిధంగా చెబితే ఉపదేశాధికారము లేనివాడు కవి కానేరడని కూడా తేలుతుంది. ఇది వింటే కవుల మనుకునేవారికి చాలామందికి విభ్రాంతి కలగవచ్చును. కాని కొంచెము ఆలోచిస్తే ఇది సమంజసముగానే కనబడుతుందని నా మనవి.

దీనిని బాగా తెలుసుకోడానికి ముందు ఏ దేశములోనైనా ప్రథమములో కవిత్వము ఎక్కడ ప్రారంభించినది? ఎటువంటివాళ్లు కవులుగా ఉన్నారు?—ఈసంగతులు స్మృతిలోకి తెచ్చుకుందాము.

ఈ భరతఖండమే లోకానికి మొదలూ తుదా అనుకునే ఛాందసకోటిలోవాణ్ణిగనుక

మన దేశములోని కవిత్వముతోనూ కవుల తోనూ ముందు ప్రారంభిస్తాను. ఈ పుణ్య భూమిలో కవిత్వము వేదముతో ప్రారంభము. వేదము పౌరుషేయమన్నా అపౌరుషేయమన్నా నాకు బాధలేదు. వేదములు పౌరుషేయాలయితే వాటికవులు, ద్రష్టలు ఋషు లంటాను. కాక అవి అపౌరుషేయములే అంటే వాటికర్త సాక్షాత్తు పరమేశ్వరుడే అంటాను. ఏ పక్షములోఐనా ఉభయులూ నిస్సందేహముగా ఉపదేశాధికారము కలిగిఉండి దాన్ని లోకసంగ్రహార్థము సద్వినియోగముచేసినవారే అవుతారు. అయితే వేదమంటే నేటి నవనాగరకులకు తలనొప్పి. కనుక ఆ తర్వాత మనుష్యప్రపంచములోకి వద్దాము.

ఈప్రపంచములో మన మెరిగిన ఆదికావ్యము రామాయణము. దానికవి వాల్మీకి మహర్షి. ఆయన మహాతపస్వి, ధర్మవేత్త. అయితే లోకసంబంధము లేక హృదయము ఎండుకుపోయినవాడు కాడు. ఆయన పరమ కారుణికుడు, కరుణవేది. ధర్మహాని కలిగితే చూచి సహించడు. ఆయన ఏరిపరి లోకంలోకల్లా ఉత్తమోత్తముడైన మహాపురుషునికథ కావ్యంగా చెప్పి దానివల్ల లోకమంతాపవిత్రముచేసినాడు. ఆతర్వాత వ్యాసుడు మహాభారతము అట్లాగే ఉపదేశ బుద్ధితోనే వ్రాసినాడు. వ్యాసుడు గొప్ప విద్వాంసుడు, ధర్మనిష్ఠకలవాడు. ఆయన సాక్షాత్తుగా నారాయణాంశసంభూతుడు. ఈ విధంగా మన దేశంలో కావ్యసృష్టి సాక్షాత్తు పరమేశ్వరునితోనో ఈశ్వరతుల్యులయిన మహర్షులతోనో ఆరంభించింది.

అయితే మన దేశపు ఉదాహరణ చాలదన వచ్చును. ఇది పుణ్యభూమిఅనీ కర్మభూమి అనీ ఏదో ఏదో చాదస్తమున చెప్పుడూ ఆస్పదమైన వెఱ్ఱిభూమి కాబట్టి అటువంటివి కాని దేశాల ఉదహారణలు కావలె నన వచ్చును.

పాశ్చాత్య ప్రపంచములో అగ్రస్థానము అలంకరించే గ్రీకుజాతిసంగతి కొంచెము స్మృతికి తెచ్చుకుందాము. నేటికికూడా పూర్వపుగ్రీకులే పాశ్చాత్య ప్రపంచానికి సమస్తవిద్యలలో మార్గదర్శకులు. కళలకూ కావ్యాలకూ సిద్ధాంతాలకూ వారు వేసిన పునాదిమీదనే నేటివారు నిలిచి ఉన్నారు. అది 'చాదస్తపు' దేశముకాదు. అటువంటి గ్రీసు దేశంలో కూడా మన దేశములో సంభవించినదే హెచ్చుతగ్గుగా జరిగినది. వారిలో ప్రథమకవి 'హోమరు'. అతడు గుడ్డివాడైనా అతనికి ఆకాలపు ప్రభువుల ఆస్థానాలలో మన దేశంలో మహర్షులకుండే స్థానానికి తుల్యమైన గౌరవస్థానమే ఉండేది. ఆయన తర్వాత కూడా చాలాకాలము వరకూ ఆదేశంలో కవులను అతిలోకులైన మహర్షులనుగా భావించి వారిని **Sages** అనీ **Prophets** అనీ **Seers** అనీ గౌరవించే వారు.

ప్రసిద్ధమైన ఇంకా ఏ ఇతర దేశాలలో చూచినా ఆ దేశాలలో మహర్షు లని గౌరవము పొందినవాళ్ళే అక్కడి ప్రథమకావ్యాలకు కర్తలని విశదమవుతుంది.

అయితే దీనినిబట్టి లోకంలో సారస్వతము ప్రథమదశలో ఉపదేశము చేసేదిగా ఉంటుంది అని అంగీకరించవచ్చునేమో గాని అంతమాత్రముచేత వాఙ్మయమంతా అటువంటిదిగానే ఉండవలెనని తేలలేదని కొందరు అనవచ్చును. నిజమే! అయితే ఆ ఉదహారణలవల్ల కవిత్వము మూలమేదో, దాని ప్రధాన సూత్రమేదో, దానిపునాది స్వరూపమేదో తెలుపవలెనని ఉద్దేశించినాను గాని వేరుకాదు.

కాని ఇప్పటి నవనాగరకులైన విమర్శకులు కూడా, ఎవరన్నా గొప్పకవి ఒకడు ఉన్నాడంటే "అతనికి సందేశము (message) ఏమిటి?" అని ప్రశ్నిస్తారు. కాబట్టి అట్టివారి దృష్టిలోకూడా నిజమైన గొప్ప కవికి ఏదో ఒక సందేశ ముండవలెనని; అంటే ప్రతికవీ ఏదో ఉపదేశించవలెనని. అనగా నిజమైన కవి ఒక మహర్షి, (sage,seer, prophet) వంటివాడని స్పష్ట మవుతున్నది గదా!

కావ్యములో ఉపదేశ ముండవలెనని లోకము కోరుకొంటుం దనే విషయము ఇప్పుడు సామాన్యముగా దూరదృష్టిలేని జనుల విమర్శనలవల్లకూడా చూపవచ్చును. రాజకీయరంగములో ఆందోళన చేసేవారు "ఇప్పుడు ప్రణయగాథలెందుకు? జనమంతా దేశభక్తితో ఉద్రేకించేట్లు చేసేకావ్యాలు వ్రాయవలెనేగాని!" అని తరుచుగా అంటూ ఉంటారు. ఇక సంఘ సంస్కర్తల మనుకునే వారు "పుక్కిటిపురాణాలన్నీ మనకెందుకు మన సంఘంలోఉన్న అక్రమాలు చూపి మనస్సులు మార్పులు చేసే కావ్యాలు కవులు వ్రాయవలె" అంటారు. అందరికంటే ప్రముఖులమనుకునే సామ్యవాదులు "ఇప్పటివరకూ కావ్యాలన్నీ 'బూర్జువా' బుద్ధిని పెంచినవి. దాన్ని నిర్మూలించేట్లు చేసే కావ్యాలే తప్ప మరి ఇతరకావ్యాలు ఇకమీదట వ్రాయరాదు" అని శాసిస్తారు. ఈ విధంగా అందరూ అన్నిరకములా ఏదో ప్రయోజనము ఉద్దేశించే కావ్యము సృష్టి చేయవలెనని అభిప్రాయపడుతున్నారు. వారు కోరుకునే కోరికలన్నీ పూర్తిగా సరియైనవి కావు. అట్టివారు కోరేకోరికలు చాలా భాగము పసిపిల్లలు తమకిష్టమైన మధుర పదార్థమే తమకెప్పుడూ కావలెనని కోరే కోరికలవంటివే. అయినప్పటికీ వారి కోరికలలో కావ్యమువల్ల లోకానికి ఉపదేశము జరగవలెనని వారు కోరినంతవరకూ అవి సమంజసమైనవే.

౫

ఉపదేశాధికారము ఎట్టివారికున్నది? వారు ఎటువంటి ఉపదేశములు చేయవలెను? ఉపదేశము లోకోపకారకమైనదిగానూ లోకస్థైర్యానికి ప్రయోజనకారిగా ఉండేదిగానూ

ఉండవలెనని అంటే, సామాన్యముగా అందరూ ఒప్పుకుంటారు. అయితే ఏ ఉపదేశాలు ఆవిధంగా లోకోపకారకమైనవంటే, పలువురికీ పలువిధాలుగా ఉద్దేశభేదాలు ఉంటవి.

నా మతములో వేదశాస్త్రములు తెలిసి, పరిమాణబుద్ధి కలిగి, అనుష్ఠాతలూ ఉపాసకులూ ఐనవారే ఉపదేశాధికారము కలవారు. అట్టివారే మహాకవులనదగినవారు. వారి కావ్యములే అపరిమిత ప్రయోజనము కలవి. వారల దృష్టి స్థూలమైనదీ అల్పమైనదీ కాదు. వారే, ఈ జన్మమేకాక అతీతానాగతజన్మకోటులున్నూ, ఈ లోకమేకాక అనేకకోటి బ్రహ్మాండములున్నూ, మనస్సులో ఎప్పుడూ ఉంచుకొని, స్వల్పమైన ఆత్మప్రమాణము మీద నేకాక అనంతమైన శాస్త్రప్రమాణముమీద ప్రధానముగా ఆధారపడి, ధర్మాధర్మములు యోజించి లోకుల శాశ్వత నిర్వృతికి తోడ్పడగలవారు. వారే ఉత్తమకావ్యసృష్టికి అధికారముగల మహాకవులు, మహర్షులు! మన పూర్వులకూ ఇటువంటి ఊహలు ఉన్నందువల్లనే, ఉత్తమ కావ్యాలకు కథానాయకులుగా ఉత్తమపురుషులే ఉండవలెననీ, ఆదిమధ్యాంతములు మంగళయుక్తములుగా ఉండవలెననీ, ఇత్యాది విధంగా అభిప్రాయపడ్డారని నా విశ్వాసము.

అయితే ప్రస్తుతానికి అంతదూరము పోను. మహర్షిత్వము ఉన్నకవి ఎవరు, అని ప్రశ్నవేయను. "ఏదో ఒకటి ఉపదేశించడానికి నాకు అధికారమున్నది; ఇది ఉపదేశిస్తున్నాను. ఈ ఉపదేశానికి నన్ను సంస్కృతమైన నా అంతరాత్మ ప్రేరేపిస్తున్నది; అందువల్ల ఈ విధంగా లోకసంగ్రహము జరుగుతుంది,'' అని ఐనా పోనీ చెప్పగలకవు లెంతమంది దేశములో ఉన్నారు? కవులైనవారిని తమ్ము తాము ఒక్కసారి ఈ ప్రశ్నలు వేసుకోమని నా మనవి.

పుస్తకము మొదలుపెడితే చివరవరకూ చదివించేట్లు చేసే రచయిత లెందరో ఉన్నారు. ఇటువంటివారికే బజారులో అమ్మక మెక్కువ! అయితే వారిక వారవనితలకూ ఏమాత్రమైనా భేదమున్నదా? మరి కొందరి కావ్యాలు చదువుతుంటే వారి శిల్పము చమత్కారముగా ఉంటుంది. వారిభావము తెలియకపోతే పనిలేనివారిని చదరంగపు చిక్కు (Puzzle) విడదీసినట్లు విడదీయడానికి పురికొలుపుతుంది. ఇంకా కొంతమంది తమ కావ్యాలవల్ల చదువరుల మనస్సులో కోపమో, అసహ్యమో, ఏదో ఒక ఉద్రేకము కలిగిస్తారు. అయితె మనకళ్ళ ఎదుట ఏదైనా పనికిమాలినపని చేసినవారూ అసహ్యపుపని చేసినవారూ కూడా అటువంటిభావాలు కలిగించగలరే! తాముఅనుభవించిన దుఃఖమో ప్రణయమో చిత్రించి ఇతరులను బాధ పెట్టగలవారుకూడా కొందరున్నారు. అయితే, లోకంలో అంతకంటే ఎక్కువ దుఃఖమూ ఎక్కువ ప్రణయమూ

చూస్తూనే ఉన్నామే! మనస్సును భయాదులవల్ల ఆందోళన పెట్టగల కవులున్నారు. అయితే ఏ అపాయకరమైన క్రియకు ఉద్యోగించినా ఆ ఆందోళన కలుగుతుందే! కొన్ని కావ్యాలు చదివితే చక్కిలిగింత కలిగినట్లవుతుంది. అయితే చక్కిలిగింత కలగడానికి కావ్యాలే కావలెనా?

ఇక సంస్కారులైనవారికి తమ కావ్యమువల్ల ఆనందము కలిగిస్తూ ధ్వనిప్రధానంగా ఉత్తమమైన ఉపదేశము చేయగల కవులు ఎందరున్నారు? పోనీ అంతపని చేయలేకపోయినా, అట్టిదానికి ప్రయత్నించేవారు ఎందరున్నారు? ఈ ప్రశ్న నేను ఒక్క ఆంధ్రకవి ప్రపంచానికే వేయడంలేదు. ఈ ప్రశ్న అఖిలప్రపంచాన్ని అడుగుతున్నాను.

ఈ ప్రశ్నకు మేమంటే మేమని కవులు గుండె నిబ్బరముతో ముందుకువచ్చి సమాధానము చెప్పలేనంతవరకూ, ప్రతిదినము టన్నులకు టన్నులుగా అచ్చవుతున్న ఈ కావ్యాలన్నీ ఎందుకు? ఏమిచేయను? ఈ గ్రంథాలయాలన్నీ ఎందుకు? చిత్తుకాగితాలు పడేసేందుకు ఉపయోగించే అఖండ పరిణామముగల బుట్టలకంటే వాటివల్ల ఎక్కువ ప్రయోజనమున్నదా? ఇప్పుడు పుడుతున్న వేగంతో కావ్యాలు కొంతకాలము పుట్టుకుపోతే, ఈ బ్రహ్మాండమంతా ఒక పెద్ద చిత్తుకాగితాల బుట్టగా తయారుకాదా? అప్పుడు చిత్తుకాగితాలూ మంచి కాగితాలూ వేరుచేయగలమా? దానికి మళ్లీ 'Experts' సహాయము కావలసి రాదుగదా!

# వరపరీక్ష

## శ్రీ శివశంకర శాస్త్రి

### రెండవ రంగము - పర్వత మార్గము

≡ అమాత్యుడు ≡

అధికశ్రమ చెందకుండ
ఆలయమ్ము వధూవరులు
చేరదగిన త్రోవగాక
చిత్రముగా నెందులకో
ఇట్టి విషమమైన మార్గ
మేర్పరించినారు ప్రభువు !

≡ గంభీరసింగు ≡

అడుగ దగినదే అమాత్య !
అందు కొంత గూఢముగా
రాజనీతి యున్నది. గత
రాత్రమందు నాసన్నిధి
మీరలున్న పక్షములో
మిగుల నేర్పుతోడ కార్య
మమరియుండు. లాభమేమి
అయినదాని కింకచింత ?

≡ అమాత్యుడు ≡

ఇంచుకైన తెలియకున్న
దేలికమది నేమిగలదో
అలక నితడె పెండ్లియాడు
టాశయంబయేని, తమరు
కఠినమైన పణము పెట్టి
గహనమైన మార్గమిట్లు
చూపరని తలంచువాడ
జ్యోతిగెలువ కుండునట్లు.

ఇతని యపజయంబె తమ య
భీష్టమేని, రాకుమారి
నప్పగించి వయసుకాని
హస్తములకు, పురజనంబు
కనుగొనంగ బహిరంగము
గా నగారోహణంబు
క్షణమాత్రముకూడ ప్రభువు
సమ్మతింప రనితలంతు.

≡ గంభీరసింగు ≡

తోచలేదు మరి త్రోవ నాకపుడు
తూష్ణీం భావముతోనె యీసరణిని
నవలంబించితి నమాత్యశేఖర !
ఎరుగక అలకా హృదయము నే నా
దుర్జయసింగుకు దొలుత నిచ్చితిని
మాట, జ్యోతిపయి మమత కుమారికి
అతిగాఢం బని అవగత మైనది,
ఏమి చేయవలె నీక్లిష్టస్థితి !
మాటపోవునెడ మానవనాథుని
నిందింతురుగద నిఖిలజనంబులు.

బలవంతముగా పరిణయ మేగతి
చేయగల్గుదుము ! చెప్పి చూచితిని
ఇరువురు వరులకు నేకవిధముగా
పణముపెట్టి నే ప్రతిజ్ఞ చేసితి.

== అమాత్యుడు ==

దోషమేమియు లేదు దుర్జయసింగు
నేలినవా రప్పుడే విసర్జింప
అలకకు నతనిపై ననురక్తి లేదు,
అంగీకరింప లే దతడు పరీక్ష.

== గంభీరసింగు ==

సత్వరంబ మాట విడువ
జాల కట్లు చేసినాను.

.. ..

నిశ్చయమ్ముగాను జ్యోతి
నెగ్గు నీ పరీక్షలోన.
ఒక్కవేళ బలహీనత
నోడిపోవు పక్షమందు
అనురాగము కలది గాన
అలక యతనినే వరించు.
దుర్జయుండు నోరు విప్పి
దోష మారోపింప లేడు.
మాట తప్పి పోయినట్లు
మనల నెవ్వ రనజాలరు.

== అమాత్యుడు ==

ప్రభు వాన తిచ్చిన పద్ధతి యెల్ల
యుక్తి యుక్తమ్ముగా నున్నది, కాని
ఉపవాసము విధించి యుండుట యొకటి
జ్యోతికి ఈదారి చూపుట యొకటి
పరిణమించునో యేమొ ప్రతిబంధకముగ
ఫలితము సంశయాస్పదముగ దోచు.

[గండ శిలల తెరుగ]

== సమీపములో సైనికులు ==

మంగళం బలకా కుమారికి
మంగళము జ్యోతిః కుమారున
కచల దుర్గ ప్రభువరేణ్యున
కభ్యుదయ మగుత్క !

== అమాత్యుడు ==

జ్యోతిః కుమారుని యోధవర్గంపు
మంగళధ్వనులతో మార్మ్రోగిపోవు
పర్వత పార్శ్వంబు; పౌరు లెవ్వార
లెక్కకుండగ కొండ కిరుప్రక్కలందు
మార్గంబు లన్నింటి మన వీరభటులు
ఖడ్గ హస్తాలతో కాచుచున్నారు.

== గంభీరసింగు ==

మంచిది. కళ్యాణి మందిరమ్మునకు
మనము పోవుద, మదే మందమందముగ
వామభాగమునుండి వచ్చుచున్నాడు;
తోడ్కొని పోదము దుర్జయసింగు.

[ అంతా దానిని ఎత్తుగాని పరిశీలించి ]

== జ్యోతిస్సింగు ==

అలకా, ఇంచుక ఆయాసముచే
సన్నగిల్లినది జవము నడకలో
అనుకొందునా అశ్మఖండమున
కపనయించుకొన నధ్వశ్రమమును ?

== అలకాదేవి ==

ఆయాసమ ప్రాణేశా !
అనుకొనుడు పాషాణము.
ఉపవిష్టులు కాకుండిన
ఓడిపోయినట్లు కాదు.

నాకయి మీ రక టకటా
నాథా, నా జనకువలన
విషమమా పరీక్షలోన
వెత నొందుచు నున్నవారు !

అవలోకింపుడు నాథా,
అదిగో చిత్రావతి నది
నిమ్నస్థలి ప్రవహించును
నేత్రోత్సవదాయకముగ.

అర్ధభాగ మయినది యీ
యధ్వానమునందు, దేవి
కల్యాణీమందిరమ్ము
కానవచ్చు శృంగమందు.

== జ్యోతిస్సింగు ==

పోవుద మలకా! పోయెను బడలిక
ప్రాభాతిక మృదు పవనముచే, నీ
పలుకు తేనెచే. ప్రాపించినచో
గమ్యస్థానము కల్యాణమెగా !

[బయలుదేరుదురు]

== సైనికులు ==

[వృక్షముల మాటున]

జయము జయము జ్యోతిస్సింహా
జననేతకు మా రేనికి !
జయము జయము జయ మలకా
జనయిత్రికి మా రాణికి !

[మార్గమున వేరొక మలుపులో
గంభీర దుర్జయసింహులు, అమాత్యుడు]

== దుర్జయసింగు ==

విపరీత మైన దీవిధము ! పూర్వమ్ము
భూజాను లెవ్వరు పుత్రికా పరిణ
యార్థమై వీరుల కనుచిత మైన
విధి విధించిన యట్లు వినలేదు నేను !

.. ..

అదిగో జ్యోతిస్సింహు డాయాసపడుచు
పై కెక్కుచున్నాడు భారమ్ముతోడ.
వారించు వాడ నే వక్రమార్గాను
సరణమ్ము, తెలియుచో సత్యమ్ము తొలుత.
గాఢానురాగమ్ము కలవారి కేను
నడుమగా నిలచుట న్యాయమ్ముగాదు !
వెంటనే మానిపి విషమపరీక్ష
నర్పింప దగు కన్నె నతనికే దేవ !

== అమాత్యుడు ==

ప్రభువు పరీక్ష సద్భావమ్ము తోన
నిర్ణయించినవారు - నీ వెరుంగుదువు.
పయనమ్ములో మూడు భాగాలు ముగియ
వచ్చుచున్నవి : ఆపవలదు కుమార !

దుర్జయసింగు =

ధరియించి క్రీడాన తారుణ్యమూర్తి
నవివాహితను వీరు డగు వయస్థుండు
కష్టాన నడచుచో కనుగొన జాల !
అరిగెద క్షమియింపు డన్యదిక్కునకు !

[ఒకవైపు దుర్జయసింగు, మరియొకవైపు తక్కినవా రిద్దరు వెడలిపోవుదురు]

.. ..

[ మార్గమున ఇంకొక మలుపులో ]

== జ్యోతిస్సింగు ==

వామభాగమ్మునకు ప్రియురాలా
వత్తువా చల్లగా ప్రియురాలా
అడుగు వేయుట యన్న ప్రియురాలా
అతి దుర్ఘటంబయ్యె ప్రియురాలా
పాదరక్షలు విడుతు ప్రియురాలా
పదము జారకయుండు ప్రియురాలా
తల తిరుగుచున్న దో ప్రియురాలా
తరు వానుకొందునా ప్రియురాలా

== అలకాదేవి ==

[ కన్నీళ్ళతో ]

ఉపవసించుట చేత
ఓనాధ ఓనాధ !
ఒడలు తూలుచు నున్న
దోనాధ ఓనాధ !
నిమ్న భాగాలపై
నిజదృష్టి ఓనాధ
నిలుప బోకుడు నాధ !
నిలుప బోకుడు నాధ !

వల్లభ క్రోడాన
వాతూలము విధాన
తేలిపోవగ నేను
దేహభారము బాపి
నానాధు నడిపించు
నాతల్లి కల్యాణి !
ఇరువురను బ్రోవవే
ఇలవేల్పు, కల్యాణి !

.. ..

ఆరగింపుడు నాధ,
ఆయాసము తొలంగి
శక్తి యుజ్జృంభింప
సహకార ఫలము లివె.

== జ్యోతిస్సింగు ==

వల దలకా
వల దలకా
వ్రత భంగం
బగు నలకా
చిన్న శాఖ విరిచి అలక,
చే యూతగ నిమ్మలకా !

.. ..

జయ జయ జయ ఏకలింగ,
జయ కర్తృ[illegible]ము లిమ్ము స్వామి !

కరుణ బూని నీ భక్తుల
కాపాడుము దేవదేవ !

[ప్రస్థానము]

[మార్గములో నొకచోట]

== గంభీరసింగు ==

దుర్జయు పలుకుల
ఘోరముగా మతి
మారెను : పయనము
మానుదునా యిక ?

== అమాత్యుడు ==

వీరుడు కావున
విన డేమో యను
అనుమానము ప్రభు,
అంకురించినది.
అయినను శీఘ్రమె
అగ్రము చేరును
అధికబలిష్ఠుం
డగుట కుమారుడు.

[ కదలుదురు ]

[ మార్గపు మలకలో ]

== అలకాదేవి ==

ఏమిది ఏమిది నాథా,
ఇట్లు రోజుచున్నవారు !
పడుదు రేమొ తూలి క్రింద
భద్రము భద్రము నాథా !

అయ్యో, గుండెలు దడదడ
లాడుచున్న వధికముగా,
దిగచెమటలు పోసె నొడలు,
తేకువ తప్పునొ యేమో !

భూరి వివృతములు నాసా
పుటములు, శోణోష్ఠమ్ములు
నీలిమాక్రాంతమ్ములు,
నిలువగ్రుడ్లు పడియె నయ్యొ !

చాలు జాలు ! పయన మాపి
సత్వరముగ దింపి నన్ను
అశ్వముపై గూరుచుండి
ఆయాసము బాపుకొనుడు.

పరిగణింప వలదు ప్రభూ
పరాజయం బయినయట్లు !
అనామయం బయిన మీకు
అంతె చాలు నాకు నాథ !

సమ్మతింప కుందు రేని
జనకులు మన పరిణయమ్ము
ఆమరణము మీస్మరణమె
ఆలంబనముగ నిలిచెద !

దింపుడు నాథా తోడనె !
దింపరేని దిగుదు నేనె !
ఈ విచిత్రవరపరీక్ష
ఇంక జాలు, నింక జాలు !

== జ్యోతిస్సింగు ==

తెరలెను మైకపు
తెర ప్రియురాలా !

విశ్రాంతిం గని
వెడలుద మిపుడే.

అపజయమ్ము కా
దంగీకారము,
పౌరుష మెడలిన
ఫలితము కలదా !

మంగళలాభ మొ
మరణంబో మరి
ఏదో కావలె
నీ పట్టుననే !

.. ..

నిజముగ అలకా,
నీ వర్ధాంగివి
కానియెడల మృతి
గాంతును ధ్రువముగ !

.. ..

అర్ధాంగీ కృత
హైమవతీశా !
ఏలుము మమ్ముల
ఏకలింగజీ !

[ముద్దు పెట్టుకొని]

బయలు దేరుదము
ప్రాణవల్లభా !
నాకు జనించెను
నవోత్సాహము !

== అలకాదేవి ==

బలము నొసంగుచు
ప్రాణేశ్వరునకు
కావుము తల్లీ
కల్యాణీ మము !

[ప్రస్థానము]

== సైనికులు ==

మంగళం బలకాకుమారికి
మంగళము జ్యోతిఃకుమారున,
కచల దుర్గ ప్రభు వరేణ్యున
కభ్యుదయ మగుతన్ !

*

## మూడవ రంగము

## కల్యాణీ మందిర ప్రాంగణము

[అలకాదేవిని దింపి]

== జ్యోతిస్సింగు ==

జయ జయ జయ ఏకలింగ !
జయ కల్యాణీ జననీ !

[మోకరిల్లి]

== ఉభయులు ==

జయ భక్తాభీష్ట ప్రద
జగజ్జనకులార జయము !

[వెలుపల]

== సైనికులు ==

జయము జయము జ్యోతిస్సింహా
జననేతకు మా రేనికి !

జయము జయము జయ మలకా
జనయిత్రికి మారాజ్ఞికి !

= అలకాదేవి =

బడలినారు ప్రాణేశా
పదపద్మము లొత్తుదునా ?

= జ్యోతిస్సింగు =

దాహము దాహ మ్మలకా,
తడియారెను నో రలకా,
విశ్రమింతు, తీర్థము గొని
వేగముగా ర మ్మలకా !

[ శిలాఫలకమున శయనించును ]

.. ..

= అలకాదేవి =

[జలము దెచ్చి]

కమలపత్రి పుటములోన
కల్యాణీపుష్కరిణీ
దివ్యజలము
దెచ్చినాను.

శీతలోదకంబు గ్రోలి
సేదదేర మీరు నాథ !
చనుదెంతురు
జనకు లిటకు.

కనులు దెరచి యొక్కసారి
కాంచరేమి ప్రియురాలిని ?
పలుక రేమి
ప్రాణనాథ !

భూరిశ్రమచేత నిద్ర
పోవుచున్నవారో ! త్రాగు
డించు కంత
యిదిగో జలము !

[ముఖముపై నీరు చల్లి]

చల్లినా నాననమున
చల్లనౌ కొలని నీరు :
అయిన రా దేమి తెలివి !

తేరుకొనుడు ప్రాణేశ !
తేకువే లేదె యింక !
మూర్ఛలో మునిగినారో !

అరుగుదేర కున్నారు
అంగణమ్ములో కెవరు
ఏమి చేతు నే నిపుడు !

పెదవులం దడిపినాను
బిందువైన పోవదే
నోటిలోని, కేమిగతి !

కొంత విశ్రమించినారె
ఇంత శోష యెందులకో
వింత గొల్పుచున్నది మీ
కంత శక్తి కలదుగదా !

భయ మగుచున్నది
పలుకరు నాథా !
కనబడ దేలా
కళ వదనముపై.

గుండెలు స్ఫుటముగ
కొట్టుకొనుట లేే,
దండదు నాడియు
హస్తము లోపల!

లేశమాత్రమును
లేదే ఊపిరి
విడిచిన చిన్నెయు
వ్రేలి కక్కటా!

[ కదలించి చూచి ]

అయ్యో అయ్యో
ఆస్యము వెంబడి
జాలువారినది
సన్నగ రుధిరము.

రయమున రమ్మా
రాజవైద్యుడా!
రక్తస్రావము
రక్తస్రావము!

అయ్యో అయ్యో
అయిపోయినది!
ఇంకే మున్నది
ఈ లోకములో!

చూచుచుండగనె
శూన్యం బైనది
రాజస్థానము
రత్నము కోల్పడి!

కల్యాణాంతము
కాదగినది యిటు
అవసిత మైనది
అమంగళముగా.

నాకోసమె గద
నాథా, యీగతి
జవ్వన మందే
సంప్రాప్తించెను!

చూడకున్న నను
సుఖముగ నుందురె
మృత్యుదేవతను
మీపాలికి నే!

పత్రిక యేటికి
పంపితి నయ్యో
ఆహ్వానము మృతి
కంపినతీరున!

దుర్గేశ్వరు నిజ
దుహితకు నొసటను
వైధవ్యంబే
వ్రాసియున్నదా!

.. ..

రాజస్థానము నందలి
రాహుత్తులయం దగ్రణి
కోటలు పట్టెడి వీరుడు
కూలిపోయె విధివశాన!

సౌందర్యము బాహుబలము
సాహసంబు వ్యర్థ మాయె
లక్ష్యము ప్రాపించిన జయ
లక్ష్మి యేమొ దూర మయ్యె!

జీవి తేశు నయ్యయ్యో
చేతులార చంపుకొంటి !
బ్రతికి యేమి ఫలం బింక
ప్రాణంబులు విడుతు నిపుడె!

ప్రేమకు బలి యైన నాదు
ప్రియు పవిత్ర రక్తముతో
కలియుగాక నా రుధిరము
కటారి కారుణ్య వశత !

[పొడుచుకొనును]

== గంభీరసింగు ==

[ప్రవేశించి]

అమ్మా, అమ్మా,
అలకా, అలకా,
ఏమది తల్లీ,
ఏటికి పలుకవు !

.. ..

సుకుమారి నా తల్లి
శోషిల్లెనా యేమి !
ఉపవాసమున మూర్ఛ
నొందెనా నా బిడ్డ !

.. ..

లెమ్ము జోతిస్సింహా,
లెమ్ము లెమ్ము కుమార,
ఏల పడియున్నాడ
విటు కరకురానేల ?
విజయంబు గన్నావు
విషమ పరీక్షలో.

అలకా అలకా
ఆయాసంబా
ఏమిది తల్లీ,
ఇంకను లేవవు !

విజయము గనె నీ
విభుడు పరీక్షను;
కల్యాణమె యిక
గ్రక్కున లెమ్మా !

.. ..

ఉభయులుం జలియింప
కున్నవా రేమిగతి!
అహిత మయ్యెనో యేమొ
అరసి చూడు డమాత్య !

== అమాత్యుడు ==

[ వారిని సమీపించి ]

అనుమానించిన
యట్లే యైనది !
క్షణకాలములో
జరిగిపోయినది !
అత్యాహితమే
అయినది దేవా !
దుర్జయసింహా
తోడనె రమ్మిటు !

== దుర్జయసింగు ==

[ వచ్చి ]

ఘోరమైన యన్యాయము !
కోలుపోయి నా డసువులు

వీరాగ్రణి అక్కటకట!
వితథయత్నమందు నేడు!

ఆయాసముచే గుండియు
లలిసియుండ నోపు! నోట
సన్నని రక్తస్రావము
జాలువారి పేరుకొనిమె.

== గంభీరసింగు ==

భూరిబలుడౌ జ్యోతిస్సింగు
పోయినాడు మనల విడిచి!
ఏల పాడు వరపరీక్ష
ఏర్పరించినా నమాత్య?

మూర్ఛపోయెనో క్కో నాదు
ముద్దుబిడ్డ! ప్రాణనాథు
దుర్మరణము గాంచి మహా
దుఃఖ వివశ చిత్త యగుచు?

== అమాత్యుడు ==

అయ్యో, దేవా
అత్యాహితమే!
అసువులు బాసిన
దలకా దేవియు!

== దుర్జయసింగు==

వాడి యైన ఛురిక దిగగ
వక్షస్థలి గాఢముగా
రక్త సిక్తమై యున్నది
రాజపుత్రి కౌశేయము.

== గంభీరసింగు ==

సర్వ నాశనము
సర్వ నాశనము
లోపించెను నా
లోచనతారక!

వల్లభనిధన
వ్యథ సహింపలే
కాత్మహననమే
ఆచరించితివ!

ఏకపుత్రికవె;
ఏ మనుకొంటివి
నీ యనంతరము
నీ జనకుని గతి!

తనువు తుచ్ఛ మని
తలచి పుత్రికా,
ప్రణయదేవతకు
బలియైపోతివ!

ఏ మున్నది నా
కీలోకములో!
కాని మొండినై
కాయము వీడను.

అపమార్గము నే
ననుసరింప నే
నుభయులు సుఖముగ
నుందురు కాదా!

సకలము శుభముగ
సంపన్నము కా
దగినది యీగతి
దగ్ధం బాయెను !

వార్ధకమున నీ
వ్యధ జనియించెను
వేగమ దేహము
విడుచుట ధర్మము !

== దుర్జయసింగు ==

వీరి పవిత్ర ప్రేమము
విదితమేని దుర్గాధిప,
వీక్షింపక యీ దృశ్యము
వెడలిపోయియుందువాడ !

నా వలనం గొంతవరకు
నష్టం బయిపోయె మహా
యోధుని యిహలీలయు నొక
యువతీహృదయజ్యోతియు !

దుర్గేశా, యెల్లరమును
దోషావిష్టుల మైతిమి !
ప్రాయశ్చిత్త సూచకముగ
ప్రణమిల్లుద మీస్థలమున !

ఇది పవిత్రమైన భూమి !
ఈ రంగముమీద చంద్ర
కాంతశిలా మంటపంబు
కట్టింపుడు దుర్గేశా !

చిరకాలము రాజపుత్రి
సీమాలంకారముగా
స్నిగ్ధ ప్రియ కరుణ కథా
చిహ్నం బగు మంటపంబు !

పూతముగా నెగడు గాత
పుణ్య దంపతీ చరిత్రి
విన్నవారి మానసములు
విగత కల్మషమ్ము లగుచు !

=== సమాప్తము ===

# ఆఖరుమాట

**మొక్కపాటి నరసింహశాస్త్రి** 1937 - జూలై - ప్రతిభ

పార్థసారథినాయుడు తన కడసారి ప్రయాణాని కంతా సిద్ధం చేసుకున్నాడు. అధైర్యంకాని బెంగ కాని ఏమీలేదు అదివరదాకా కొంత అధైర్యమూ భయమూ కలిగినా ఈ అవతారం చాలించడమే ఉత్తమమని నిశ్చయించుకున్న తరువాత ఆ భయం గియం అన్నీ పోయినాయి.

రాత్రి సుమారు రెండుగంట లవుతుంది. బయిట పండువెన్నెల. చల్లని మలయమారుతం. అన్ని వైపులా పుష్పసౌరభము. ప్రకృతిఅంతా తన్ని సంతోషంతో సాగనంపుతోన్న ట్లుంది. అంత కంటె కావలసిన దేమున్నది.

ఒక్క విషయమే మధ్యమధ్య చురుక్కుమనిపిస్తోంది. కొద్ది రోజులలో ప్రభుత్వమువారు (Sir) బిరుదు ప్రసాదిస్తారని నిశ్చయంగా ఆరోజునే తెలిసింది అదికాక ఈసారి ఎన్నికలలో తనకు మంత్రిపదవి తప్పదని తమ పార్టీవారు ఏకగ్రీవంగా అన్నారు. (Lord Mayor) కావడానికి తగ్గ అవకాశములు కూడా లేకపోలేదు. ఇంతకాలం ఉండి తన కోర్కెలు కొద్దో గొప్పో సిద్ధించపోతున్న సమయంలో తమ ప్రాణత్యాగం చేసుకోవలసివచ్చినందుకుమట్టుకు కొంచెము బాధగానే ఉన్నది. కొంచెముసేపుంటే అదీ పోతుంది.

తన కాగితాలూ రికార్డులూ ఎక్కడి వక్కడ అన్నీ జాగ్రత్తపెట్టాడు. జమా ఖర్చు పుస్తకాలన్నీ సవరించి ఒకచోట పెట్టాడు. రాయవలసిన ఉత్తరాలన్నీ రాశాడు. కాని ఇంక అఖరు ఉత్తరం రాయడానికిమట్టుకు చెయ్యాడలేదు కొంతసేపు. తన కొడుక్కి రాయాలి. పంచప్రాణాలు వాడి మీద పెట్టుకొని, వాడి కేదో మహామహుణ్ణి చేదామనుకొని, అనేకములైన ఆశలూ, వాంఛలూ, వానిలో కల్పించి, ఇప్పు డవన్ని మట్టిలో కలిపి వాడిని ఫకీరుని చేసిపోతూ ఏమని రాయడమూ అని కొంచెము సందేహించాడు. కాని రాయక తప్పదుకదా అని ఆరంభించాడు.

ఇంటా బయిటా కూడా అంతా నిశ్శబ్దంగానూ ప్రశాంతంగానూ ఉంది. ఒక్కసారి కిటికీలోనుంచి నవ్వుతున్న చంద్రుని చూచాడు. ఉత్తరం వ్రాయడ మారంభించాడు...అవును. ఆత్మహత్య చేసుకోవడము చాలా కష్టమే. కాని బ్రతుకుకంటే చాల సులభంగా తోచినప్పుడు ఇంక చెయ్యతగిన దేమున్నది. పిరికితనమే కావచ్చు; ఈకర్మఫలం ఎప్పుడో ఒకప్పు డనుభవించక తప్ప దంటారు మనవాళ్ళు. కాని ప్రస్తుతం, మన్ని ఖండఖండాలుగా చించి చెండాడవలెనని వేచిఉన్న ఈ నరసింహముల నుండి తప్పించుకొని దాటిపోతే తరవాత అనుభవం సంగతి అప్పుడు చూడొచ్చు...ఈ ఆస్తి అంతా నా చేతులతో సంపాదించాను. నా చేతులతోనే తగలేశాను. ఇంకొకళ్ల ననవలసిన పని లేదు. ఎలావచ్చిందో తెలియదు. ఎలాపోయిందో అంతకంటె తెలియదు. కాని ఒక విషయం-అప్పుడు ఎవళ్లుచెప్పినా ఒప్పుకోలేదు. కాని ఇప్పుడు ఒప్పుకోక తప్పదు. అన్యాయార్జితవిత్తం నిలవదు. ముమ్మాటికీ నిలవదు. అనేకమంది కూలినాలి చేసీ ముష్టిఎత్తుకొనీ సంపాదించుకున్నవాళ్లు, అనేకమంది వితంతువులు, తిండికూడా మానుకుని అఖరుకు తమ ముప్పుగడవడంకోసం కూడపెట్టుకున్న చిన్నమొత్తాలు, అందరూ నన్నునమ్మి ఏదోవడ్డీ వస్తుందని నాదగ్గర దాచిపెట్టారు...అవన్నీ నా స్వాధీనం చేసుకున్నాను. ఏకోర్టువారూ నన్ను

శిక్షించలేదు. కాని ఇంతమందిఉసురూ తగలదూ! న్యాయం విచారించి శిక్షించగలిగిన సాహసుడైన ప్రభువేఉంటే ఈ వ్యాపారస్థులలో, ధనికులలో, ఎంతమంది, ద్వీపాంతరవాస మనుభవిస్తోందురో! మాబదులు ఆ శిక్షలన్నీ అన్యాయంగా నిరుపేద లనుభవిస్తున్నారు. నేను ఎప్పుడు ఏపని చేసినా, దేనికీ పశ్చాత్తాపపడేవాడిని కాను. తెలియక చేసిన దానికి పశ్చాత్తాపముకాని, తెలిసిఉండి కష్టనష్టములు ఆలోచించి చేసేపనికి పశ్చాత్తాప మేమిటి? ధనార్జన చెయ్యవలెనని నాకు బుద్ధిపుట్టినప్పుడు, మంచిచెడ్డ, ఉచ్చంనీచం అనే విచారణకూడా లేకుండా ధనార్జన చేశాను; స్త్రీవాంఛ కలిగినప్పుడు ఏపద్ధతినైతేనేమి కోరిన స్త్రీని సంపాదించి తీరాను. కాని సింహావలోకనం చెయ్యడం, చేసిన పనికి విచారించడంమట్టుకు ఎప్పుడూలేదు. పుణ్యమో పాపమో వాటి ఫలితం నేను అనుభవించి ఎరుగను. ఇకముం దెప్పుడో అనుభవిస్తానంటే నాకు నమ్మకంలేదు.

కాని నేను చేసిన రెండుపనులకు మట్టుకు, నాటి నుంచి నేటివరకు విచారిస్తున్నాను, భయపడుతున్నాను. వాటి ఫలితమే ఇప్పు డనుభవిస్తున్నా ననే దృఢవిశ్వాసం కలిగింది నాకు. రెండూ అప్రయత్నంగా అనాలోచితంగా చేశాను. శాపమన్నా పాపమన్నా నమ్మకం భయంలేని మొండివాడికి, శాపభీతీ పాపభీతీ కలిగించినాయి. ఏమిలాభ మిప్పుడు! అనుభవంలోకి వచ్చినతరువాత కాని తెలియలేదు. నమ్మకం కుదరలేదు. ఇప్పుడు నమ్మకం కలిగి ఏమీ చేయడానికి వీలులేని పరిస్థితులు వచ్చినాయి.

ఇంతవరకు ఆప్రశంస ఎవ్వరిదగ్గరా తేలేదు. నాలో నేను అనుకోడానికికూడా భయపడేవాడిని. ఏదో భయంకరమైన అపాయం వస్తుందని తెలిస్తే ఫలాని మోస్తరు అపాయమని తెలియనంతసేపూ చాలా భయంగా ఉంటుంది. ఫలానాఅనీ అది అనివార్యమనీ తెలిసినతరువాత ఇంక భయమే ముంటుంది? రాయిచేసుకు కూర్చోడంతప్ప చేసేది మరొకటిలేదు. కాని ఈ ఆఖరు క్షణంలో నీతో చెప్తే కొంత హృదయభారం తీరడమే కాకుండా, నీముందుజాగ్రత్తకు కొంత ఉపయోగంగా ఉంటుందని నా నమ్మకం.

ఒకప్పుడు మనయింట్లో దొంగలు పడ్డారు. ఎలా వచ్చారో, ఎలా వెళ్లారో తెలియదు. ఎక్కడా ఒక కన్నము తవ్వడంగాని, ఒక తలుపు బద్దలు కొట్టడంగాని, ఒక తాళం బద్దలు కొట్టడంగాని జరగలేదు. ఎలాగైతేనేమి ఇంట్లోఉండె వస్తువులన్నీ సుమారు పదివేలుకిమ్మతుగలవి పోయినాయి. నాటికీ నేటికీ ఆ వస్తువుల జాడకాని దొంగలజాడగాని, తెలియలేదు.

మన యింటి కెదురుగుండా రోడ్డుమీద మర్రిచెట్టు కింద ఒక నిరుపేదకుటుంబము, భార్యా, భర్తా, ముగ్గురు పిల్లలూ ఉండేవాళ్లు. వాళ్ళెవళ్లో, ఎంత కాలంనుంచి అక్కడ ఉన్నారో, ఆ కుటుంబంలో ఎంతమంది ఉన్నారో, వాళ్ళకు జీవనం ఎలా గడుస్తోందో నేనెప్పుడూ విచారించలేదు. నాకేమి అవసరం? కాని ఇప్పుడు వస్తువులు పోవడంతోటే మట్టుకు అనుమానం వాళ్లమీద పోయింది. పేదరికమంటే అందరకూ లోకువేకదా. ముందు ఇంట్లో నౌకర్లనందరనూ ప్రశ్నించి, వాళ్ళ సామానులూ ఇళ్లూ సోదాచూచి తరువాత నా అనుమానంమీద పోలీసులు ఈ చెట్టుకిందవాడినికూడా ప్రశ్నించి వాడి సామానులుకూడా అన్నీ వెతికారు పాపం! అన్నీ ఏమున్నాయి? ఒక పెట్టా; బేడా! ఏమీలేదు. కుండలూ, దాకలూ, మూకుళ్లూ, ఎవళ్ళో వీధులో పారేసిన సీనారేకుడబ్బా ఒకటీ, సీనారేకుగొట్టాలు రెండూ, ఇదీ వాడి సంసారము. ఇంతలో వాడి దురదృష్టముకొద్దీ, నా దురదృష్టముకొద్దీ, రెండు రవ్వల ఉంగరాలు, ఒక రవ్వలదుద్దూ దొరికినాయి. ఇంకేముంది! వాడిని పట్టుకొని Police stationకి లాక్కుపోయారు 'నాకు spur tank లో దొరికాయి' అని వాడు ఎన్నివిధాల మొత్తుకున్నా

వాడిమాట వినేవా రెవరు? రోడ్లమీదా చెరువుల్లోనూ రవ్వలఉంగరాలూ దుద్దులూ పడి దొర్లుతూ ఉంటాయా మరి!

ఇంక నక్కడనుంచి మామూలుకథే! పోలీసువారు వాడిని పట్టుకుని కుళ్ళపొడవడం, ఎంత కొట్టినా తన కారోజు ఉదయాన్నే అవి దొరకినవి కాని తనేపాపమూ ఎరుగననీ వాటి విలువకూడా తనకు తెలియదనీ ఎన్నివిధాల చెప్పినా వినక వొళ్ళు స్వాధీనంలేకుండా కొట్టి రెండుసంవత్సరములు కఠిన శిక్ష వేశారు.

పోలీసువారు కొట్టిన దెబ్బలవల్ల లోపల అవయవములు నలిగిపోయి జబ్బు ప్రవేశించింది. ఖైదీలకు అందులోనూ ఇటువంటి దరిద్రుడికి జబ్బుచేస్తేలక్ష్య పెట్టేది ఎవరు? అడిగేదెవరు? ఆజబ్బుతోటే అలాగే కాలక్షేపం చేసుకుని బయిటపడ్డాడు. మన ఇంటి ముందునుంచి వాడిభార్యా బిడ్డలూ మకాము ఎత్తేసి మరొక చెట్టుకిందకు పోయారు.

రెండు మూడు సంవత్సరాలు గడిచాయి. ఈసంగతంతా నేను మరచిపోయాను. ఒకరోజు సాయంకాలం, సుమారు అయిదు గంటలకు రటాన్ బజారులో చల్లారాం షాపుదగ్గరకువచ్చి, లోపలికివెళ్లి నాకు కావలసిన ఒకటి రెండు వస్తువులు కొనుక్కుని, వచ్చి కారుదగ్గర నిలబడ్డాను. లోపలనుంచి నౌఖరు ఆ సామాన్లు తెస్తున్నాడు.

ఇంతలోనే ఇద్దరు ముగ్గురు వీధుల్లో తిరిగేవాళ్లు ఒక మూకుడుపట్టుకొచ్చి, అక్కడ వాళ్ళ మనిషి ఒకడు చచ్చిపోయాడనీ, తీసుకుపోయి దహనం చేసుకోడానికి ధర్మం చెయ్యమనీ అడిగారు. ముష్టి ఎత్తుకోడానికి ఇదొక దొంగవేషమని నేననుకుని పొమ్మన్నాను. ఎన్నిసార్లు చెప్పినా పోలేదు. ఇటువంటి దొంగవేషాలువేస్తే Police వారికి వప్పచెపుతానని గట్టిగా కేకవేశాను. చుట్టూ పదిమంది మూగారు. పోలీసులకు చెపుతే మాకేమిభయమూ, మేము దొంగతనము చేశామా, చూడండి అక్కడనే శవమున్నది. గొప్పవారుకదా అని ఇటువంటి కష్టములో ధర్మమడుగుతే బెదిరిస్తారేమిటని అందులో ఒకడు ఎదురుతిరిగి సమాధానంచెప్పాడు. సరే ఏదో పారేద్దామని జేబులో చెయ్యిపెట్టేసరికి తల విరియబోసుకుని గుండెలు బాదుకుంటూ పెద్దపెట్టున ఏడుస్తూ శోకదేవతలాగ ఒక ఆడమనిషి వచ్చింది. నన్ను చూడడంతోనే మరింత కేకలేస్తూ వీడే నా మొగుణ్ణి చంపినవాడు. నాకూడు మంటగలిపాడు; నాపిల్లలను దిక్కుమాలిన వాళ్ళను చేశాడు; నాఉసురు వీడికి తగలకపోతుందా? వీడిపిల్లలిలాగే ఎప్పుడేనా ముష్టెత్తుకోకపోతారా? అని గుక్కతిప్పుకోకుండా నోటికి వచ్చినట్లల్లా తిట్టడ మారంభించింది. నాడు నేను నిర్హేతుకంగా ఖైదుకు పంపినవానిభార్యఅని పోల్చాను. ఖైదునుంచి వచ్చినతరువాత లేవలేదుట. అలా తీసుకు తీసుకుని యమబాధ పడిపడి చచ్చిపోయాడుట. ఇదంతా ఏమితెలుసు నాకు? అంతకంతకు చుట్టూ జనసమూహం ఎక్కువఅయింది. జన మెక్కువైన కొద్దీ ఆమనిషి ఏడుపూ తిట్లూ ఎక్కువైనాయి. అందరూ ఆమనిషికి సానుభూతి చూపినవారే! ఇక్కడనుంచి త్వరగా అవతలకుపోతే మాట దక్కుతుందని, జేబులోనుంచి పదిరూపాయలుతీసి మొదట ముష్టికివచ్చినవాడి మూకుట్లో పడేశాను. వాడు పోబోతుంటే ఆ ఆడమనిషి గభీమని వాడి చేతుల్లోనుంచి మూకుడు లాక్కొని త్వరలో నేనిన్ను తగలెయ్య డానికి నీ కొడుక్కి అవసరముంటుంది పుచ్చుకో అని ఆరూపాయలు నా మొహాన్ని వేసికొట్టింది. అక్కడున్న జనసమూహమంతా ఒకసారి 'బలే' అన్నారు. ఇంతలోనే పోలీసుజవాను ఒకడొచ్చి ఏమిటీ అల్లరనేసరికి అంతా తప్పుకున్నారు. నేనూ నాకారులోఎక్కి ఇంటికి చేరుకున్నాను. కాని నావొళ్ళు ఆపాదమస్తకం కంపించిపోయింది. ఆమనిషిని చూస్తే నే చేసినపాపం నన్ను శిక్షించడానికి మూర్తీభవించినట్లుగా కనపడ్డది. ఎప్పుడో ఒకప్పుడు ఆమనిషిశాపం నాకు తగిలి

తీరుతుందనుకున్నాను. తరువాత ఆసంగతంతా మరచిపోయానుగాని మళ్లీ ఈసమయంలో జ్ఞాపకం వచ్చింది. ఆ శాపఫలమే సుమా ఇది. ఆశ్చర్యంగా లేదు.

* * *

ఇంక రెండోసంగతి. నాకు ఉత్సవాలన్నా జన సమూహాలన్నా చాలా సరదా. అపేక్ష ఏమీ లేక పోయినా ప్రజలుచూపే ఉత్సాహమూ, అక్కడ చేరే సౌందర్యమూ చూడవలెనని కుతూహలం. అందుచేత ఎక్కడ ఏఉత్సవమైనా తప్పకుండా వెళ్ళి కొన్నిగంటలు కాలక్షేపం చేసేవాడిని. అలాగే ఆనాటి ముక్కోటి ఏకాదశిరాత్రి ఉత్సవానికి పెందలాడే భోజనంచేసి పార్థసారథిగుడికి వెళ్ళాను. దేవుడిమీద భక్తిచేత కాదని వేరే చెప్పే దేమిటి!

అటువంటి సమయాల్లో సాధారణంగా నాకుకలిగే ఆనందంకంటె ఆనాడు నాకు పదిరెట్లు ఎక్కువ ఆనందం కలిగింది. కారణం నేను చెప్పలేను ఆ దీపపు వెలుగులు, ఆ స్త్రీసమూహము, వారి శరీర కాంతియు, వాటినతిశయింపచేసి చీరమీదరంగులు వారిఅంగముల నలంకరించినరత్నద్యుతులు, అక్కడి వివిధపరిమళములు, పారవశ్యముకలిగించే సంగీతము, ప్రయత్నముగనో అప్రయత్నముగనో లభించిన స్త్రీ స్పర్శా – వీటిఅన్నిటివల్లా కలిగిన ఆనందం ప్రతి రక్తనాళములోనూ ప్రవేశించినన్ను ఉన్మాదునిగా చేసింది. తనివితీరగా సురాపానము చేసినవానివలె ఈసంతోషం నాతలకెక్కి శరీరంచులకపడి వాయువులో తేలిపోతున్నట్లుగా ఉంది. ఇంక నక్కడ ఉంటే పిచ్చి యెత్తుతుందేమోనని భయపడి ఇంటికి పోదామని బయలుదేరాను.

అప్పటికి సుమారుఒంటిగంటపైగా అయింది. కొంత మంది జనం మళ్లుమొగం పెట్టారు. నేను నెమ్మదిగా సమ్మర్దంతప్పించుకొని సుంకువారి వీధిలోనికి వచ్చి అక్కడనుంచి వెంకటరంగంపిళ్లవీధులోనికి మళ్లాను. అక్కడ పదిగజాలదూరములో కొంతమంది జనం కూడిఉన్నారు. ఒక ఆడమనిషి కేకలు వినపడ్డాయి నేను తొందరగా అడుగువేసి అక్కడికి చేరుకొన్నాను. ఆజనాన్ని చూచి ,ఏమిటిఅల్లరి! మంచి పౌరుషశాలులే! ఇంతమందిచేరి పరదేశస్థురాలగు ఆమెకు తెలియని భాషలో ఏమిటి అంటున్నారు? ఏది మొగాళ్లు! ఇప్పుడు మాట్లాడండి చూతాము, Police man కూడా సమీపంలోనే ఉన్నాడు.' అనే సరికి ఇల్లేసామి అని ఎవరిమట్టుకువారు జారిపోయారు.

ఆ స్త్రీ ఒక్కర్తే వెక్కి-వెక్కి ఏడుస్తూతలవంచుకు నిలబడ్డది. నాకు జాలివేసి 'ఏవమ్మా భయంలేదులే. ఇంక ఎవళ్లూ నీజోలికిరారు. నీవు నిర్భయంగా వెళ్లవచ్చును' అన్నాను.

ఆమెవైఖరినిబట్టి బట్టకట్టునుబట్టీ ఆంధ్రవనితఅని ఊహించాను. నేను పలుకరించగానే ఆమె తల ఎత్తి నాకేసి నిదానంగా కన్నీటిచాటునుంచి చూచింది. విచారముచేత పొంగినకళ్లు కాటుకకంటి నీటిచే తడిసి మలినమైన చెక్కిళ్లు ముఖంలో కనపడుతున్న నిస్పృహా చూస్తే దైన్యము మూర్తీభవించినట్లు కనపడ్డది. వర్షపుమబ్బుచాటునుంచి తొంగిచూచే చంద్రబింబమువంటి ఆమెముఖంచూస్తే నిరుపమానసౌందర్యవతి అని తెలుస్తోంది. ఆమె వయస్సు సుమారు పందొమ్మిది, ఇరవై సంవత్సరములకంటె ఉండదు. ఆమెశరీరం చూస్తే శిల్పిచెక్కిన విగ్రహాన్ని మించిపోయి లావణ్యనిధివలె అగుపిస్తోంది. నేను అనేకవేలమంది స్త్రీలను చూచాను. అత్యంత సౌందర్యవతులనుకునే వాళ్లనుకూడా చూచాను. కాని ఈమె పక్కను నిలబడతగ్గవాళ్లు ఎవరో నాకప్పుడు స్ఫురణకురాలేదు. ఆంధ్రులలో అందమూ, నాజూకూ ఏనాడో అంతరించినవని అనుకునేవాడిని. ఆపయశస్సును పోగొట్టడానికి ఈపిల్ల ఒకర్తి చాలు.

ఆమె మాట్లాడకుండా అలాగే నిలపడ్డది. 'ఏమమ్మా ఎక్కడకు వెళ్ళవలెను? భయంలేదులే చెప్పు'

అన్నాను. దానితో ఆమె మళ్ళీ కంటనీరుపెట్టుకొని, పొంగివస్తూన్న దుఃఖాన్ని ఆపుకొని, తను బ్రాహ్మణబాలిక నని, గోదావరిజిల్లానుంచి ఈ వూళ్లో బంధువులింటికి వచ్చానని, ఇంకా కొందరు ఆడవాళ్ళతో ఉత్సవం చూడడానికి వచ్చాననీ జనసమూహంలో వాళ్ళనుంచి విడిపోయి దారితప్పిపోయాననీ, ఏమి చెయ్యడానికీ ఎక్కడికి వెళ్ళడానికీ తోచక వీధంటవస్తూ దారి అడుగుతే ఆ మనిషి ఏదో అన్నాడనీ చెప్పి, (తండ్రీ) సమయానికి దేవుడులా వచ్చారు. లేకపోతే నా గతి ఏమయ్యేదో' అని మళ్లీ కంటనీరుపెట్టుకుంది. 'మరి అయితే ఇంటికి వెళ్లగలవా' అన్నాను. తనకు దారి తెలియదనీ ఆ వీధిపేరుకూడా బాగా తెలియదని మైలాపూరులో తన బంధువు ప్లీడరనీ చెప్పింది. 'సరే అయితే నీకేమి భయంలేదు. నేను తీసుకువెళ్ళి మీ ఇంటిదగ్గర దిగపెడతా'నని చెప్పాను. మొదట కొంచెము సందేహించింది కాని మరోక దారిలేక నాతో రావడానికి అంగీకరించింది

ఆ వీధిచివరనే ఒకరింటిదగ్గర నిలబెట్టిన నాకారు దగ్గరకు తీసుకువెళ్లి ఎక్కమన్నాను మళ్లీ కొంచము తటపటాయించింది. 'భయంలేదమ్మా ఎక్కు, లేకపోతే ఇందాకటి మోస్తరుగానే జరుగుతుంది' అన్నాను. దానితో భయపడి కారులోఎక్కకూచుంది.

నేనూ లోపలికి ఎక్క In house రోడ్డులోనుంచి మెరీనాకు దారితీశాను. చల్లగాలి, సముద్రపురొద, ఇవన్నినిర్మలమైనఆకాశం, నాపక్కనసౌందర్యరాశి నాసదుద్దేశాన్నిమార్చి నన్ను సాయంకాలంనుంచి దహించివేస్తూన్న కామోద్రేకాన్ని ద్విగుణీకృతం చేశాయి. నామదనాగ్నికి తగ్గఆహుతి దొరికిందనుకున్నాను. ఈ పిల్లను అనుభవించిమరీ ఆమెను పంపవలెనని నిశ్చయించుకున్నాను. ఆమె అంగీకరించదేమోనన్న ఆలోచనేనాకు తోచలేదు. మొదట కాస్త బిగిసినా తరువాత నాచేజిక్కిన వెనక ఒప్పుకోక ఏమిచేస్తుం దనుకున్నాను.

ఆపిల్లను మొదటచూచినప్పుడు కలిగిన జాలిఅంతా అంతరించింది. ఈరూపందాల్చిన చక్కదనాన్ని ఎప్పుడు కౌగిటచేరుద్దామనే ఆతురత తప్ప మరొకటేమీ తోచలేదునాకు. ఇటువంటి అవకాశములు అనేకం వచ్చినాయి నాజీవితంలో. అనేకసార్లు ఆఅవకాశములను ఉపయోగించుకున్నాను. ఇప్పుడు మట్టుకు అలా ఎందుకుకాకూడదు. ఇటువంటిపిల్ల నాభార్య అని చెప్పుకోగలిగిన ధన్యు డెలాటివాడై ఉంటాడా అనుకున్నాను. ఈచక్కదనానికి తగ్గవాడవునా కాదా అనే ఆలోచన పోయింది. ఈమెకు తగినవాడని చెప్పతగిన పురుషుడు సృష్టిలో ఉంటాడా అనిపించింది. నెమ్మదిగా Ethiop's beach చేరి కారు ఆపాను. అదివరకు ఏమి ఆలోచించుకుంటోందో కాని కారు ఆగడముతోనే ఉలిక్కిపడి నాల్గుప్రక్కలా చూచింది నేను దిగి ఆమె కూర్చున్నవైపువెళ్ళి తలుపుతీసి దిగమన్నాను. తెల్లపోయి 'ఎందుకు' అంది.

'కొంచెము సేపు ఈ చల్లగాలిలో కూర్చుని పోవచ్చును' అన్నాను.

'కాదు నన్ను త్వరగా ఇంటికి తీసుకువెళ్ళండి' అంది. 'అలాగేలే. త్వరగానే వెడదాము. రా' అని చెయ్యిపట్టుకున్నాను. కేకవెయ్యబోయింది. ఒక చెయ్యి నోటిమీద వేసి, రెండవచెయ్యి ఆమె నడుముచుట్టూ వేసి బలవంతాన బయటకు లాగి సముద్రపుటొడ్డుకు తీసుకువెళ్లాను. ఆ ఇసుకతిన్నెమీదకూర్చుని, నాపక్కనేకూర్చోపెట్టుకొని నోటిమీదచెయ్యితీసి గట్టిగా కౌగలించుకొని, (ఎందుకలా భయపడతావు. ఇప్పుడే తీసుకువెళ్ళి మీఇంటి దగ్గర దిగపెడతాలే' అన్నాను. 'మీరు తండ్రివంటివా రనుకుని మిమ్మల్నినమ్మినాను. మీరూ ఇలాటివారేనా'అంది ఏడుస్తూ. అప్పటికీఆమనిషిస్వభావం తెలుసుకోలేక పోయాను. ఇది మామూలు మాటలే అనుకున్నాను. మరొక్కమాటేనా అడలేదు. కేకలన్నా వెయ్యలేదు. నా కౌగిటిలోనుంచి విడిపించుకునే ప్రయత్నమైనా చేయలేదు. నేనుఏమనుకోను?

నా కౌగిలిపట్టు ఇంకా బిగించి ఒక్కముద్దు పెట్టుకున్నాను. నిర్ఘాంతపోయి నాకేసిచూచింది. ఆ చూపు జన్మజన్మాలకూ నాకుమరపురాదు భయము సంభ్రమము ఆశ్చర్యము, ఇంకా ఎన్నెన్నో భావాలు ఆచూపులో కనపడ్డాయి. ఒక్కచూపులో ఏకకాలమందు ఇన్ని భావములు ప్రదర్శించుటకు సాధ్యమౌతుందని నేను ఎన్నడూ అనుకోలేదు. మరొకళ్ళుఅయితే ఆ చూపుకి భయపడి అంతటితో తమ ప్రయత్నమును మానుకునేవారేమో! నేనైనా మరొక సమయంలో అయితే బాగా ఆలోచించి మరీ ముందుకు సాగే వాడిని. కాని ఆక్షణంలో నాకు ఒళ్ళు తెలియలేదు. నాశరీరంలో ప్రతి రక్తబిందువూ ఉడికిపోతోంది. సర్వేంద్రియములూ స్వాధీనము తప్పిపోయినాయి. న్యాయాన్యాయవిచక్షణావిహీనుడనయిపోయినాను. ప్రమాదస్థితిని తెలుసుకోలేకపోయినాను అంతేకాకుండా పతివ్రతలంటూ ప్రపంచములో ఉన్నారని నాకు నమ్మకంలేదు. ఎటువంటి స్త్రీఅయినా, ఏదోరూపంలో తగినంత ప్రతిఫలం దొరుకుతే పరపురుషుడికి స్వాధీనం కావడాని కంగీకరిస్తుందని నా దృఢవిశ్వాసము. వాడెవడో చెప్పినట్లు (Every woman has her price) అనేమాట ముమ్మాటికి సత్యం అని నా నమ్మకం; అనుభవంకూడాను. అటువంటప్పుడు ఈ పందొమ్మిదేళ్ల పల్లెటూరుపడుచు వారందరికీ అతీతురాలని ఎలా అనుకోను?

ప్రపంచమంతా నిశ్శబ్దము. సముద్రపుహోరుకూడా ఆక్షణంలో నాచెవిని పడలేదు. చేతనాచేతన ప్రపంచమంతాకూడా ఒక్కసారి ఊపిరి బిగబట్టి ఏమి జరుగుతుందో చూతామని ఆశ్చర్యముతో వేచిఉన్న దనుకుంటాను. ఆకాశముమట్టుకు తన అనంతకోటినక్షత్రకాంతులతో నవ్వుతున్నట్లున్నది. నామదనాతురత వింక నణచుకోలేకపోయాను. అపిల్లను నావడిలోకి లాక్కొని రొమ్ముమీద చీరారవికా తొలగించి ఒళ్ళు తెలియకుండా లెక్కలేని ముద్దులుపెట్టుకున్నాను. ఒక్కొక్కముద్దు పెట్టుకుంటున్న కొద్దీ నాఆవేశము మరీహెచ్చిపోయింది. ఆపిల్ల నిర్నిమీలిత శూన్యదృష్టితో నాముఖంకేసి చూస్తూ ఊరుకుంది. గత్యంతరంలేక శరీరంనాకు వప్పగించింది అనుకున్నాను. మొదట నా చేతులలో ఆమెశరీరం కొంచెము బిగియబారిందనుకున్నాను. క్రమేణా పట్టు తప్పిపోయినట్లు నా చేతుల్లోనుంచి జారిపోవడము మొదలుపెట్టింది. నేను ముద్దులతో ఊపిరి ఆడక ఆమెను ఇసుకమీదకు జారవిడిచి ఒక్కరెప్పపాటు ఊపిరితీసుకున్నాను. రెప్పవాల్చకుండా ఆమె అలాగేనాకేసి చూస్తోంది. ఎందుచేతననే ఆలోచనతోచలేదు నాకు. పునరాలింగన చుంబనాదుల కామెను లేవదీయబోయాను. ఆమెశరీర మదొకమాదిరిగా చలువెక్కినట్లు తోచింది. తల వెనక్కి పడిపోయింది. ఇదేమిటి మూర్ఛపోయిందా అనుకుని మళ్ళీ పడుకోపెట్టి ఇటూఅటూ కదిపి పలకరిస్తే పలకలేదు. అరిచేతులూ అరికాళ్లూ రాశాను. నీటిఒడ్డుకుపరుగెత్తికెళ్ళి దోసిలితో నీళ్లుతెచ్చి ముఖాన్ని చల్లాను. ఏమిచేసినా లాభంలేకపోయింది. ఇదొక జబ్బు కాబోలు, క్రమేణ తెలివివస్తుం దనుకున్నాను. అప్పటికి నాఉద్రేకం చల్లారింది. ఒకవిధమైన భయ మారంభమయింది. ఇంటికి పోయేవాడిని పోక ఇదెందుకు తెచ్చుకున్నానా అనుకున్నాను. అలాగు అరగంటో ముప్పావుగంటో కూర్చున్నాను. ఎంతకూ ఆమెకు తెలివిరాలేదు. సరిగదా క్రమేణా ఒళ్లు నఖశిఖపర్యంతం చల్లపడిపోయింది. ఆపిల్ల చనిపోయిందని గ్రహించాను. వర్ణనాతీతమైన భయంతో నా శరీరంయావత్తూ కంపించిపోయింది. నా ప్రథమచుంబనముతో ఆమెముఖమును నేను మలినపరచినప్పుడే ప్రాణం పోయిఉండవలెనని ఊహించాను. ఆ నిర్నిమీలితదృక్కులభావ మది అయిఉండవలెను. పాపం, యౌవనోదయవేళ తన వాళ్ళందరకూ దూరమై, ఈ నిర్జనప్రదేశంలో పరాయివాని చేతిలో ఈ నిర్భాగ్యపుబలవన్మరణం రాసిపెట్టిఉన్నది ఆ పిల్లకు. నేను హంతకుడిని. చేష్టలుడిగి, రాతిబొమ్మలా కూర్చున్నాను.

వొళ్లు ముచ్చెమటలుకారిపోసి నీరుకారిపోవడం మొదలెట్టింది. ఆ పిల్లమీద జాలిపోయి ముందు సంగతేమిటనే ఆలోచన పోయింది. కూర్చున్న కొద్దీ ప్రతిక్షణమూ ప్రమాదకరమని తోచింది. అదివరకు నిర్జనమనుకున్న సముద్రతీరం అనేక కోట్ల జీవరాశులతో నిండిఉన్నట్లు తోచింది. నిశ్శబ్దంగా ఇంతవరకూ ఉన్న సముద్రం గర్భనిర్భేదముగా రోదించడం మొదలెట్టింది. స్తంభించిపోయినదనుకున్న వాయువు ప్రచండవేగముతో నా చెవులు చిల్లులు పడేటట్లు కోటిగొంతుకలతో అరవడము ఆరంభించింది. దూరాన్ని వెదుకుతున్న మోటారుకారు ఒకటి ప్రళయ గర్జనంతో నామీద వచ్చి పడుతుందనుకున్నాను. నా వెనుక తిరువళిక్కేణి ఉత్సవములోని దీపపుకాంతులు నరకజ్వాలలులా కనపడ్డాయి. ఆకాశాన ఉన్న నక్షత్రకోటులు కన్నీరు కార్చడం మొదలెట్టినాయి. దిక్కులేకుండా నిర్జన ప్రదేశంలో చనిపోయిన ఈపిల్లకోసం చేతనా చేతన ప్రపంచం యావత్తు విచారిస్తున్నట్లు తోచింది.

అనిర్వాచ్యము అపూర్వము అననుభవము అయిన మహాభీతి నన్నావరించింది. ఆకళేబరాన్ని ఎవరికంటా పడకుండా ఎక్కడో పారవేసి నేను ఇల్లు చేరడమే ప్రధానకర్తవ్యమని తోచింది. భయముతో స్వాధీనము తప్పిపోయిన అవయవములకు వింత బలం వచ్చింది. మంచుకంటె చల్లనై కొయ్యబారిన కళేబరాన్ని తీసుకొని కారులో పడేసి మళ్ళీ కారువచ్చినదారినే తిప్పి కోటసమీపంలో కారు ఆపి ఈవింతబరువును మోసుకొని సముద్రంలో వీలైనంతలోతుకు తీసుకువెళ్ళి నీళ్ళలో గిరవాటు వేశాను. ఆఖరుసారి ఆఅమ్మాయి ఆ Shocked innocent చూపుతో నన్ను మందలించింది. నాటనుండి ఈఆఖరుక్షణంవరకూ అహర్నిశములు జాగ్రత్స్వప్న సుషుప్తులలోకూడా ఆ కడసారిచూపు నన్ను వెంబడిస్తూనేఉంది. అనేక జన్మపరంపరలలో నాటి మహాపాపమునకు తగ్గ ప్రాయశ్చిత్తమును అనుభవించి పునీతుడనయ్యేవరకు ఆచూపు నన్ను వదలదనుకుంటాను. కాని సముద్రుడు నా రహస్యమును దాచడానికంగీకరించలేదు. మహాక్రోధంతో ఒక పెద్దతరంగం నన్ను అవతలికి గెంటేసి ఆపిల్లను నెమ్మదిగా వొడ్డుకు చేర్చింది. నేనక్కడ ఇంకనిలబడలేకపోయాను.

తిన్నగా నాకారు ఎక్కి వెయ్యిభూతములు ఆవహించినట్లు మనోవేగంతో ఇంటికి వచ్చిపడ్డాను. అక్కడకూడా ఆగ బుద్ధిపుట్టలేదు. తడిబట్టలు విడిచేసి పొడిబట్టలు కట్టుకొని మళ్ళీకారులో కూర్చుని బయలుదేరాను. ఎక్కడికో నాకే తెలియదు. కారు ఏదారిని వెడుతోందో దారిలో ఏమున్నదో చూచుకోలేదు. మరొక్క రెవ్వరో నడుపుతున్నట్లుంది కాని నేనే నడుపుతున్నాననుకోలేదు. కారుకి ఉన్న యావచ్ఛక్తి వినియోగించిఉంటాను. సుమారు ఏడుగంట లయ్యేసరికి నాకు తెలియకుండా బెంగుళూరు చేరాను. తిన్నగా మనబంగాళాకు వెళ్ళాను. ఈచెప్పకుండా రావడం నాముఖవైఖరీ చూచి నౌఖరులు ఆశ్చర్యపోయారు. నేను ఎవ్వరితో మాట్లాడకుండా తిన్నగా కారులోనుంచిదిగి పడకగదిలోకివెళ్ళి కోటేనావిప్పకుండా పడుకున్నాను. నౌఖరు ఏదో అడిగాడు. నేను జవాబు చెప్పలేదు. ఇంక ప్రపంచ మెరుగను. తరువాయి సంగతి నాకు జ్ఞాపకం ఉండిఉంటుంది. సుమారు నెల రోజులవరకూ వొళ్ళుతెలియని జ్వరం, స్మృతిలేకపోవడం, హఠాత్తుగా తలంతా నెరవడం, డాక్టర్లు Brain fever అనుకోవడం, 20 రోజు లయిన తరువాత ప్రాణభయంలేదని వైద్యులు నిర్ణయించడం, విరామంలేనిపనివల్లా తీవ్రాలోచన వల్లా (Nervous break down) వచ్చిందని ఆరుమాసములువిశ్రాంతి తీసుకొని దేశాటన చెయ్యమనడం ఆప్రకారం మనం తిరగడం నువ్వు ఎరిగున్నదే. ఇదీ నేను చేసిన విరామంలేనిపనీ, తీవ్రాలోచనానూ.

... ... ... ...

ఇంక నీతో చెప్పవలసిన దేమీలేదు. నప్పుచెప్ప వలసిన ఆస్తి అంతకంటే లేదుకదా. నీదారి నీవు చూసుకోవలసిందే.......నాకు జీవితంలో రెండే ఆదర్శాలు ఉండేవి. నేను విశేషంగా ధనార్జన చేసి, ఏదో మహోన్నతపదవి పొందవలెనని; రెండవది, నిన్ను పురుషోత్తమునిగా చేసి నీకేదో మహా సామ్రాజ్యపట్టాభిషేకం చేయవలెనని. ఇందులో ఏదీకూడా చెయ్యలేకపోయాననేవిచారం కొంత కాలం ఉండేది కాని ఇప్పు డదికూడాలేదు. వారి వారి జన్మాంతరసంస్కారమునుబట్టి ఏవో కొన్ని సంకల్పములు కలగడమే కాని వాటి నిర్వహణము మట్టుకు మనదికాదు. నేను ఆత్మహత్యచేసుకుందా మని నిశ్చయించుకొని నప్పటినుంచి, నా అభిప్రా యాల్లో, దృక్పథంలో చాలా మార్పు వచ్చింది. మనం జీవితంలో ప్రధానమనుకున్నవన్నీ అప్రధా నంగానూ అప్రధానమనుకున్నవన్నీ ప్రధానంగానూ కనుపిస్తున్నా యిప్పుడు.

సముద్రయానం చేసేటప్పుడు నావ ఒడ్డునుంచి దూరమైనకొద్దీ నిత్యజీవనాని కత్యవసరమనుకున్న సమస్త పదార్థములూ, రోడ్లు, బళ్ళు, ఇళ్ళు, వా కిళ్ళు, నదులు, పర్వతములు సమస్తమూ మాయమై, పంచభూతములూ తప్ప మరేమీ గోచరించనట్లే నేను ఈ ప్రాణప్రయాణసమయంలో ఇహపర ముల మధ్యను నిలబడి ఒక్కసారి సింహావలోకనం చేస్తే వస్తుస్వరూపములూ, తత్వములూ, విలువలూ తారుమారై జీవితంలో మనకు కనపడే కృత్రిమా కారాలను విడిచి, నిజస్వరూపంతో నిజస్వభా వంతో నిజస్థానంలో కనపడుతూ ఉంటాయి. ఆఖరుకు బ్రతికి ఉన్నవాళ్లూ, వెఱ్ఱివాళ్లూ, అప్ర యోజకులూ దేశవినాశనానికి కారకులూ అనుకున్న తత్త్వవేత్తలమాటే—సత్యం నిత్యం, అనుకున్నది అసత్యం అనిత్యంగానూ, అనిత్యమూ అసత్యమూ, అనుకున్నదే నిత్యము సత్యముగాను కనుపిస్తోంది.

... ... ... ...

నీకు తత్త్వోపదేశం చేదామని కాదు నా ఉద్దేశం, చేసినా నువ్వు వింటావనే నమ్మకంలేదు నాకు. నా ముందు నడచిన మహానుభావులమాట బ్రతికి ఉన్నవాళ్లూ నేను విన్నాను గనుకనా !

... ... ... ...

ఇదివరకెన్నడూ ఈ రహస్యములను ఎవ్వరితోటీ చెప్పడానికి భయపడ్డాను. అందులోనూ ముఖ్యం గా నీతో చెప్పడాని కసలే సిగ్గుపడ్డాను. ఏతండ్రీ తనకన్న బిడ్డలయెదుట చులకనపడడానికి ఒప్పుకోదు కదా! ఇప్పుడు చెప్పకుండా ప్రాణంవిడవలేక పోయాను. ఇంక నెవరేమనుకున్నా నాకు విచారం లేదు. ఈ తుచ్ఛప్రపంచంయొక్క దూషణ భూ షణతిరస్కారములు అందనిచోటికి పోతున్నాను. నేను ఉన్న స్థితిలో దారిద్ర్యాన్ని చూచి జాలిపడి చేత నైన సహాయం చెయ్యడానికిబదులు, ధనమదాంధత చేత, అదరమ్రిగ్గి అధఃపాతాళానికి అణగద్రొక్కి— వాడి చావుకి కారకుడిని అయ్యాను. ఈదుష్టప్రపం చంలో అదృష్టము, అలభ్యమూ అయిన, అమాయి కత్వమూ, పవిత్రతా కనపడినప్పుడు గౌరవించి పూజించడానికిబదులు, వాటినిచంపేసి నట్టేటిపాలు చేశాను. ఇంతకంటె, ఒక్కజీవితంలో దుర్మార్గం ఏమిచెయ్యాలి !

నాయనా! నీవు నన్నుగురించి ఏమనుకొన్నా సరే కాని నేచేసిన ఈమహాపరాధములు రెండు మట్టుకు జ్ఞాపకం పెట్టుకో. నేను అనుభవించినవాటి ఫలితం మరచిపోకు. ఆఅపరాధములు మట్టుకు నీవేనా నీజన్మ మధ్యమంచు చేయకూడదని నాతుదికోరిక...ఇహలా నీసమీపములో ఉండి చూస్తూ ఉంటాననుకుంటాను .... ........ వెళ్ళనా నాయనా ! సమయానికి దగ్గరేనాలేవు కదా ! ......ఇదేమంచిది.........

పార్థసారథినాయుడు ఉత్తరంఅంటించేసి బల్లమీద పెట్టేసి ఒళ్లువిరుచుకొని కడసారి ఇల్లంతా తిరిగి, తోటలోఒక్క సారి తిరిగి వచ్చి, జేబులోమాత్రతీసి నోట్లోవేసుకుని కాసిని మంచినీళ్లుతాగి మంచంమీద పడుకున్నాడు......

సమాప్తము.

# రామలింగారెడ్డి ప్రశంస

విశ్వనాథ సత్యనారాయణ

వేమభూపతి యనవేమ వీరభద్ర
భూమిపతులును నీమాట పుట్టినంత
స్మృతిపథమ్మున నవతరించెదరు నాకు
పొంగినయెడందగా రామలింగరెడ్డి !

అమరుకవ్యాఖ్యానమందు శాకుంతల
    వ్యాఖ్యఁ గవిత్వతత్వంబు కలదు
శ్రీనాథకవివచస్సిద్ధి యుబ్బారు రా
    యప్రోలు దువ్వూరు లాది గురువు
వీరభద్రారెడ్డి వేమభూపతి యర్థ
    శాస్త్రమ్ములోఁ బ్రజ్ఞ చాలగలరు
కడు పాకనాడాదికటకాంత మధికార
    మపుడె చెలామణి యగుచునుండె
తెలుఁగు తొలిరెడ్లకన్న నాధిక్య మేమి
కలదో యీయనయందు నొక్కటియె కలదు
నాఁటిదొరలమహత్తు లీనాఁడు మరల
తెలుఁగుసీమల మొలక లెత్తించెఁగాక.

అల్పధీజలముచే నాకాశమును ధాత్రి
    యొకఁడు కష్టముపొంది యుప్పళించు
ఒకఁ డుగ్రధీప్రతిభోన్మేషవాహియై
    కడఁగి సముద్రాభిగామి యగును
ఒకఁడు వీలునుబట్టి యొదిగి విజృంభించి
    యాకాశమును ధాత్రి నప్పళించు
ఒకఁడు ప్రారబ్ధవీచికి నొద్దిగిలిపోయి
    తాఁబేటివలెఁ గాళ్ల తలయు ముడుచు

ఆంధ్రవిశ్వవిద్యాలయాధ్యక్షుఁ డయ్యు
నీవు రెండవరకవుమానిసివి రెడ్డి !
కడ మహాజీవితార్థాభిగామి వగుచు
కూర్మముంబోలె లోలోన గుంచుకొందు.

రెడ్డి ! నీకవితావిమర్శనవిధాశ్రీలే కథాకప్తి వే
జొడ్డెన్ మార్గముపూర్వలాక్షణికు లుద్యోగమ్ము సద్యోగ్యమై
యొద్ధారించిన నీవచోలతికలం దుయ్యాల జంపాలలై
యుద్ధినాకృతులైరి సూరనకవీంద్రోక్తిప్రబంధాంగనల్.

నన్నభట్టులు మధునవరఝరిజనిగిరి
తిక్కన్న శిల్పపుఁ దెనుఁగుతోఁట
ఎఱ్ఱన్న సర్వమార్గేచ్ఛావిధాతృండు
పోతన్న తెలుగులవుణ్యపేటి
శ్రీనాథుఁడు నవేక్షుసిద్ధరసాపగ
కృష్ణరాయఁ డనన్యకృతిప్రబంధ
పెద్దన్న పదపోతపెట్టినిక్షురసమ్ము
రామకృష్ణుఁడు సురారామగజము
విశ్వమెల్లను వెలిఁగించు వెలుఁగులగు ము
రారి భవభూతి కాళిదా సాదులైన
యాంధ్ర సంస్కృత పూర్వ కవ్యాత్మ లెల్ల
ధూర్వహము లౌచు నిన్ను నాశీర్వదించు!

ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షుడు డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారికి అంతర్విశ్వవిద్యాలయాధ్యక్షపదవీప్రాప్తికి బందరుపౌరులు గౌరవించినప్పుడు చదివినవి.

# కవిరాజా!

**శివరామం**

తెలుగమ్మపులకరిం
పులతోనె పుట్టావు;
పలుకమ్మకలవరిం
తలలోనె పెరిగావు.

రసమూర్తి!
        నీగుండె
కరిగెనా,
        నీగొంతు
తిరిగెనా,
        కిన్నెరా
సెల యాను;
        కోకిలా
పిలు పాను.

నీనడక
ఆర్యమతసమ్మతము;
ఆంధ్రపౌరుషయుతము.

నీతలపుతోటలో
నీపలుకు తేటతో
పూవుతావులు విరియు;
తేనెతీపులు కురియు.

కవిరాజ!
నిను మెచ్చుకోలేని
జనము -
నీ కచ్చుకోరాని
ధనము-
వాటితో పనియేమి?

నీ
చదువులకె పలుకమ్మ
పులకరించింది;
నీ
వ్రాతలనె తెలుగమ్మ
కలవరించింది!

[శ్రీ విశ్వనాథ సత్యనారాయణ కవిరాజ ప్రశంస]

# సారంగపాణి పదములు

## మండపాక పార్వతీశ్వరశాస్త్రి

నా చిన్నతనములో, మా బొబ్బిలిలో ఉన్న వేణుగోపాలస్వామివారి ఆలయానికి తరుచుగా రాత్రిళ్లు వెళ్ళుతూ, ప్రసాదాలవినియోగం పూర్తి అయ్యేదాకా కనిపెట్టుకొని ఉండేవాణ్ణి. నన్ను ఆకర్షించింది ప్రసాదాలవినియోగమే కాదు. అంతకన్నా మరొక విశిష్టవిషయం ఉండేది. అక్కడ కీర్తన భాగవతులు పవ్వళింపుసేవలు పాడేవారు. అందులో ఒక ముసలాయన "లాలనుచు వూచేరు లలనలింపునను, శ్రీల చెన్నలరు నుయ్యాలపాన్పుననూ" అని పూర్వకాలపు బాణీతో లాలిపాట పాడుతూ ఉండేవాడు. ఆపాట నాకు చాలా ఆనందం కలిగిస్తూ ఉండేది. కాబట్టి రోజూ వింటూఉన్నా, తనివితీరేది కాదు. ఆపాట విందామనే తరుచుగా వెళ్ళుతూఉండేవాణ్ణి. మా యింట్లోఉన్న పిల్లల కందరికీ సంగీతం - స్వరాలు, కృతులూ, వీటిమీద చాలా మక్కువ. కాని, నాకుమాత్రం సంగీతం అబ్బిందికాదు. అందుచేత, పల్లవిసంప్రదాయం, కృతిసంప్రదాయం పాటలకన్న, భక్తిగనో, రక్తిగనో, పాడేకీర్తనలే నా మనస్సును ఆకర్షిస్తూ ఉండేవి. ముఖ్యముగా, ముసలమ్మలు పాడుతూ ఉండే భజనకత్తు కీర్తనలు, బందిఖానా వగైరాలలోవి చాలా ఇష్టంగా ఉండేవి. మా నాయనమ్మగారు కొన్ని చక్కని పాటలు పాడేవారు. ఆవిడకు సంగీతం రాకపోయినా, మహాగాయకుల ఇంటి ఆడపడుచు కావడంచేత, ఆవిడ శ్రావ్యమైన కంఠంతో భక్తిరసమైన పాటలు చాలా పాడుతూ ఉండేవారు. అందులో, ముఖ్యముగా,

హరినారాయణ గోవిందా యని
స్మరణసేయవె ఓమనసా
పురుషోత్తమ దామోదర కేశవ
భోగిశయన వేణుగోపాల హరి

అనిన్నీ,

ఎంత పేదవాడే - వేణుగోపాలు
డెంత పేదవాడే -
అంత పేదగాకుంటే - అలనాడు కుచేలుని
అటుకులకు చే సాచునా - ఓచెలులారా
ఎంత పేదవాడే -
పండ మంచమే యుంటే - భావజజనకుడూ
పాముపై నిద్రించునా

అని పాడుతూ,

పొట్టనిండితే కాక - పొరుగిండ్ల చొరబడి
పొందికెన్న ముచ్చిలునా - ఓచెలులారా -

అన్నమాటలు వచ్చేసరికి, నాకు ఒళ్లు గగుర్పొడిచి తిరిగి, మరొకసారి పాడమంటూ ఉండేవాణ్ణి.

ఆవిడ పాడుతూ ఉండేపాటలలో, నాకు ఎక్కువగా మనసుకు ఆనందం కలిగిస్తూఉండే పాట ఏదంటే,

కళ్ళుపూసుకొని తిరుగకమునుపే
కంఠధ్వని తగ్గిపోవకమునుపే
అళ్ళు ముందరికి వంగకమునుపే
అంగము, తల, వణకెత్తకమునుపే
హరినామస్మరణసేయకవుంటే
అవతల గతి యేమీ -

అప్పులకొప్పులు కదియకమునుపే
అన్న మెంకరు తినిపించకమునుపే
దొప్పలోన సై గడగకమునుపే
దోవతి బరువై తోచకమునుపే

హరినామస్మరణ సేయకవుంటే
అవతల గతి యేమీ -

ఈపాట పాడుతూఉంటే, ఇంట్లోఉన్న ముసలమ్మల అవస్థ కళ్ళకు కడుతూఉండేది.

మా వూళ్లో సాతాన్లు అక్షయపాత్రికు చాలామంది వచ్చేవారు. వాళ్ళు పాడేపాటలు నాకు అప్పటికీ, ఇప్పటికీకూడా ఆనందం కలిగిస్తాయి. మా వూరి సాతానులలో ఒకాయన నామాలు బాగా దిద్ది, మెరగినిగుమ్మిడిపండువాటం అక్షయపాత్రి పట్టుకొని, ఈ క్రిందిపాటపాడుతూ ఉండేవాడు.

అక్షయపాత్రకు పోతే - కలదని - వొక
భిక్షముశేయరయా - మూల
నిక్షేపము త్రవ్వి నెత్తిన బెట్టేరా

ఈ పాట నాకు చాలా ఆనందం కలిగించేది.
ఇందులో, "నిందుకొన్నదని కొందరు, అరువు నీయబ్బతోడని కొందరు" అనిన్నీ, "పెద్దలుశేరని కొందరు, నేడు తద్దినమనేవారుకొందరు" అనిన్నీ పాడుతూఉంటే నాకు నాలా ఆనందంగాఉంది.
సాతాన్లుపాడేపాటలలో, "కడుపా నీవింత ఘనమైతివా" అనేపాట ఒకటినాకు చాలా ఇష్టంగా ఉండేది.

"భక్తిలేనివ్రతము లెన్నిచేసిన, ఫలములేదుసుమ్మీ" అనే పాటఅంతా సరదాగానే ఉండేదిగాని, ఆపాటలోఉన్న,

కావివస్త్రములు గట్టిన నేమి కండ్లు మూసుకొని గొణిగిననేమి
లావుగ తిరుమణి మెత్తిననేమి లక్షతులసినర్పించిననేమి"

ఆమాటలు వచ్చేటప్పుడు చెవులు రిక్కించుకొని, జాగ్రత్తగా వినేవాణ్ణి. కారణమేమంటే, అలాంటిభక్తులు కొందరు మావూళ్లోవాళ్ళు నాకు కళ్ళకు కట్టినట్లు ఉండేవాళ్ళు.

అయితే, క్రమక్రమంగా నాకీపాట అపైని నజరు తగ్గిపోయింది. వసుచరిత్రాదిప్రబంధముల పఠన పాఠనములు చిన్నప్పుడే అభ్యాసం కావడంచేతనూ, చిన్నయసూరిగారి దబ్బాభాషలో ఏదో మాధుర్యం ఉందని పలుగురితోపాటు నేనూ అనుకోవడంచేతనూ, మధురమైనభాషగల ఈ పాటల పైని నజరు తగ్గిపోయింది. "శబ్దంబులయందుఁబోలె నపశబ్దోచ్చారణం బెన్నఁడున్ లేకుండన్"నియమముతో సంభాషించడానికి అలవాటుపడ్డ కొక్కొండ వెంకటరత్నశర్మగారు అవతారపురుషుడువలె కనబడుతూ ఉండేవారు. మా తాతగారు పార్వతీశ్వరకవిగారు తాము రచించిన పద్యాలలో "బుధులతుల్ జూచుకోలేదు"అన్నప్పుడు, "కుదరకనా, ఇముడకనా,"అన్నప్పుడు, నాకు అసహ్యంగా ఉండేది. బాల్యంలో పద్యరచనకుమాత్రమే అలవాటుపడ్డవాణ్ణి గనక, చిన్నప్పటి పద్యాలలోనూ, కొద్దిగా తరువాతవ్రాసిన నవలలోను "దబ్బాభాష"చాలా ప్రీతితో వ్రాసేవాణ్ణి. ఆరోజులలో పదకవిత్వమంటే చేతగాని పామరులు వ్రాసే దని నాకు ఉద్దేశంగాఉండేది. తరువాత తరువాత రావుసాహెబ్ గిడుగు రామమూర్తిపంతులుగారి దయవల్ల, వాడుకభాషలోకి దిగి, గ్రంథాలు తిరిగి తాళపత్రప్రతుల సహాయంతో చదవడం ఆరంభించినతరువాత, చిన్నయసూరి ఆంధ్రదేశానికి చేసిన గొప్ప ద్రోహము హృదయములో గట్టిగా నాటుకొనిపోయింది. అప్పుడు తిరిగి చాలా వెనకకు వెళ్ళవలసి వచ్చింది. శ్రీరామమూర్తిపంతులుగారు నాకు తిరిగి ఓనామాలు చెప్పి, అక్షరాభ్యాసం చేయించినారు. క్రొత్తదృష్టితో తిరిగీ గ్రంథాలన్నీ చదువుకొన్నాను. ఆచదవడంలో పూర్వం నాకు అసహ్యములుగాఉండిన కొన్నిగ్రంథాలు అప్పుడు సహ్యములుగా ఉండడమేకాకుండా, గౌరవించదగినవిగా కూడా ఉండసాగినవి. అందులో, పదకవిత్వాలు, ద్విపదకవిత్వాలు,ముఖ్యమైనవి. ఇప్పుడు ప్రబంధాలకన్న వీటిపైన నాకు ఎక్కువగౌరవం. నిజమైనతెలుగుకవుల నిజమైనకవితాశక్తి అంతా ఈ రెండు రకాల కవిత్వాలలోనే ఉంది.

పదకవిత్వాలలో, రెండు పుస్తకాలు నాకు చాలా ప్రీతికలిగించేవి కలవు:

(1) క్షేత్రయపదములు.

(2) సారంగపాణిపదములు.

క్షేత్రయపదములు ఆంధ్రవాఙ్మయానికి మాత్రమే చేరవలసినవి కావు. అమరుకకవి కిగల భావనాశక్తియును, జయదేవకవికిగల పదగుంఫనసామర్థ్యమును గలసి, క్షేత్రయలో మూర్తీభవిస్తూఉన్నవి. తగినవా రెవరైనా, ఆంగ్లేయభాషలోనికి తర్జుమాచేసి చూపితే, పాశ్చాత్యులుకూడా ఆమోదించవలసినంత భావనాబలము కలదు. క్షేత్రయకవిత్వములో,

అందులోనూ, అడుగరమ్మా - అతనిపైనూరక అలిగినానటరే -

ఆపదంలో

"పొలుపుమీర దానిరూపు పలకమీద వ్రాసి పాణి
తలముననుంచి కనుగొనుచున్నది తానో నేనో"

ఆవాక్యంలోఉన్న రసపుష్టి అమరుకుడికి జయదేవుడికీకూడా సాధ్యంకాదనే నా నమ్మకం.

ప్రబంధాలు తెలుగును విశ్వవాఙ్మయమునుంచి తప్పించినవి. విశ్వవాఙ్మయములో చేర్చి, తెలుగుకు ఉన్నతస్థానం ఇప్పించగల పదద్విపద కవిత్వాల నిజమైన స్థానం గమనించవలసినభారం ఆంధ్రులపైన కలదు. క్షేత్రయ రచించిన ఈక్రిందిపదం చూడండి.

కల్యాణి - త్రిపుట.

పల్లవి - ఇంతమేలుదానవా, ఓచెలియ, నీ
వింతమేలుదానవా -
అనుపల్లవి - ఇంతి మువ్వగోపాలు వింటికేలపొమ్మంటివే,

చరణములు.

చెలులొక్కరును లేరు, చిలుకపంజరమున
పలుకకున్నది, యల్లభావ మేమో,
తెలుసుకొందా మని తెరచాటుననుండిన
కలికిరో, వాడె చక్కనివా డంటివి - ఇంత -
మరి రమ్మే మందువోయని, మాటాడక నీగుట్టు
నరపె నవఁగేల నద్దమువ్వాని,
మురిపెముతో నీదు మోవి విరుచుకొని,
నెరజాణ యైనవానికి నీడు లే దంటివి - ఇంత-

ఈ పాటలో కవి చూపించిన సామర్థ్యము సుప్రసిద్ధమైన ఏ సంస్కృతకావ్యంలోకూడా లేదనే నాఉద్దేశం. ఆంధ్రుణ్ణి కావడం చేతనేమో-క్షేత్రయ్యనుగురించి ఎవరో కొంచెం వ్రాసినారుగాని, ఇంకా విపులంగా తజ్ఞులెవరైనా వ్రాస్తే సంతోషిస్తాను.

ఇక సారంగపాణిపదాలనుగురించి వ్రాస్తాను.

శ్రీరామమూర్తి పంతులుగారి ఉపదేశానుసారంగా పాతపుస్తకాలు తిరగవేస్తూఉండడంలో, సారంగపాణిపదా లనే పుస్తకం ఒకటి నాచేతుల్లో పడ్డది. నా మామూలుప్రకారం, తురకవానివలె, పుస్తకంపత్రాలు వెనకనుంచి తిరగవేయడం ప్రారంభించాను.

అందులో, మొదటనే - అనగా చివరనే -

*లా లెనుచు వూచేరు లలన లింపునను
శ్రీలచెన్నలరు నుయ్యాలపాన్పునను -

అన్న పాట కనిపించింది. అందులో

జోల పాడెద మనుచు, జోడు గూడుకొని,
బాలికలు తమలోన పంతమాడుకొని,
మేలిమిగ నిన్ను రమేశ పాడుకొని,
తాళిమితో వచ్చేరు దయను వేడుకొని -

అనేమాటలు పూర్వపు మా బొబ్బిలికోటలో ముసలికీర్తనభాగవతుణ్ణి జ్ఞాపకము చేసి నన్ను బాల్యావస్థలోకి క్షణకాలం మార్చివేసినవి.

*లాలి + అనుచు - ఇది ఇప్పుడు "లాలనుచు" అని వ్రాస్తారు. పూర్వం - "లాలెనుచు" అని వ్రాసేవారు. ఇ + అ - ఈ సంధికి ఫలితము ఆగాని, ఎ గానికాదు. ఇంగ్లీషులో Back - Mat అనే వాటిలోని అకారధ్వనివంటిది. మనము కాటాకు - చెప్పాడు-అనేవి ఏలాఉచ్చరిస్తామో అది దీనికి ప్రత్యేకగుర్తు కావలెను. గ్రాంధికులు తోసివేద్దా మన్నా పారిపోదు.

అలాగు పత్రాలు తిరగవెయ్యగా వెయ్యగా చిన్నప్పుడు నేను వింటూఉండిన మానాయనమ్మగారి పాటలు, పాతాసులపాటలు చాలా కనబడ్డాయి. బహుశా యీ పుస్తకం బొబ్బిలిప్రాంతాలలో దేమో అని భ్రమపడి ముఖపత్రం తీశాను.

చెన్నపురిలో 1867వ క్రిస్తుశక సంవత్సరములో అచ్చుపడ్డది. కార్వేటి నగరాధీశ్వరులఆజ్ఞచే గ్రంథకర్తయగు సారంగపాణిగారి దౌహిత్రుడు గరిమెళ్ళ వెంకటసుబ్బయ్యగారిచే నేలటూరి సుబ్రహ్మణ్యముగారి విద్యావిలాస ముద్రాక్షరశాలయందు ముద్రింపింపబడినది. కార్వేటి నగరాధిష్ఠిత శ్రీమద్వేణుగోపాల నామాంకిత మైనది. కాబట్టి గ్రంథకర్త 1830 సంవత్సరపు ప్రాంతములలోని వాడై చిన్నయసూరిగారికి సమకాలికుడై యున్నాడు. ఎక్కడి కార్వేటినగరము- ఎక్కడి బొబ్బిలి? రైళ్ళులేనికాలంలో ముసలమ్మలు, బిచ్చగాండ్రుకూడా పాడుకొని, ఆనందించేటంత ప్రజాదర మును పొందగలమాధుర్యముకలిగిన ఈగ్రంథమును అమూలాగ్రంగా చదవడం ప్రారంభించినాను. గ్రంథమంతా నాలుగు భాగాలుగా విభజింపబడ్డది.

మొదటిభాగంలో శృంగారమున్ను, రెండవభాగంలో దేశీయమున్ను, మూడవభాగంలో జాతీయ మున్నూ, నాలుగవభాగములో భక్తి వైరాగ్యములున్నూ కలవు.

గేయకవిత్వములో సార్వభౌమ పీఠమును అధిష్ఠింపవలసినవాడు త్యాగరాజు. త్యాగరాజుగారి ప్రతిభ అంతా ఆయనపల్లవులలో ఉన్నది. ఆయనకు ఉండిన సంగీతసాహిత్యముల సామర్థ్యమంతా ఆయనపల్లవులలో కనిపిస్తుంది. అయితే ఆయనచరణాలుమాత్రం ఆయనపల్లవులకు తీసి కట్టుగానే ఉంటాయి. కవితాదేవత తన్నావేశించిన నిముసములో పల్లవులు అవ్యక్తముగా ఆయనకుస్ఫురిస్తూఉంటే తరువాత పాతపురాణానికి చరణములు పూరిస్తూ ఉండేవాడేమో అని నా అనుమానం. అనగా ఆయన పల్లవులలో దేవత్వమున్ను చరణములలో మానవత్వమున్ను నాకు కనిపిస్తూ ఉంటుం దన్నమాట. త్యాగయ్యగారి పల్లవులలో ఉన్నంతదివ్యప్రతిభ క్షేత్రయ్యగారి పల్లవులలో కనబడదు. కాని పల్లవి మొక్క మొలిచి నట్లుంటుంది. పల్లవిలోనుండి అనుపల్లవి దానినుండి చరణములు క్రమక్రమముగా వికసించి, ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయం అనే గీతావాక్యమును నాకు ప్రత్యక్షముగా చూపిస్తూఉంటాయి. త్యాగయ్యగారి కీర్తనలలో పల్లవి ముందుపుట్టి చరణములు పూర్తికోసం ఏర్పడ్డట్టు కనిపిస్తూఉంటుంది. కాని క్షేత్రయ్యగారి కీర్తనలలో పల్లవి ముందుపుట్టి తరువాత చరణాలు పుట్టినవా లేక చరణాలు ముందుపుట్టి తరువాత పల్లవి పుట్టినదా అనే విచారణకు అవకాశం కలుగుతూ ఉంటుంది. అనగా, ఒకదాని కొకటి ఈడుదీయ వన్నమాట. *

మచ్చుకు ఒక్కొక్కటిమాత్రమే చూతాము:

– త్యాగయ్య –

కళ్యాణిరాగము – చాపుతాళము.

పల్లవి – నిధి చాలాసుఖమా, రామునిసన్నిధి చాలాసుఖమా –
నిజముగఁబల్కుమీ మనసా –

* ఈ విషయమునుగురించి ప్రత్యేకంగా వ్యాసం వ్రాయవలసిఉంటుంది గనుక ఇక్కడ విస్తరించి వ్రాయలేదు.

అను... దధినవనీతక్షీరములు రుచో, దాశరథిధ్యాన భజన అను
సుధారసములు రుచో,

చర... దమశమమను గంగాస్నానము సుఖమా, కర్దమదుర్విషయ
కూపస్నానము సుఖమా,
మమతబంధనయుత నరనుతి సుఖమా, సుమతిత్యాగరాజ
నుతుని కీర్తన సుఖమా

క్షేత్రయ్య

ముఖారిరాగము – చాపుతాళము.

పల్లవి – అడుగరమ్మా, అతనిపైమాగక – అలిగినానటరే –
అను... పడుచుదనముమాని, మువ్వగో-పాలరాయనియాన బెట్టి
మీ – రడుగ

చర... పూని, దానింటికిపోగాను మా – పొలతి చూచి బెదిరించిన
దానికి లంచమిచ్చెదనన్నది తానో నేనో,
వానిపై లేనివి కల్పింపరాదు, వాడవనితలెల్లవినగ
దానిసేఁజాడక – తాళలేనన్నదితానో, నేనో – అడుగరమ్మా
అలుకుదీరి దానివాకిటనిలచి, వీధిలో నన్నుఁజూచి,
తలుపుమూలదాగియున్నది తానో నేనో;
అలసివచ్చెననుచుఁ జక్క-రానవాలిచ్చిన నారగించి,
తలిరుబోణిమోవిరుచికి రాదన్నది తానో నేనో,
అనబెట్టి మీ – రడుగరమ్మా

త్యాగయ్యకును, క్షేత్రయ్యకును, పల్లవి – అనుపల్లవి – చరణముల పరస్పరానుసంధానములలో గల తేడా పై రెండింటివల్ల కొంతపోల్చుకోవచ్చును. నా దృష్టిలో త్యాగయ్య నారదునివంటి దేవఋషి వలెనూ, క్షేత్రయ్య వాల్మీకివంటి మనుష్యఋషివలెనూ, కనబడుతూఉంటారు.

సారంగపాణిగారి పాటలలో, త్యాగయ్యగారి నారదత్వముగాని, క్షేత్రయ్యగారి వాల్మీకిత్వము గాని, కనబడకపోయినా, పల్లవి అనుపల్లవి చరణములు పరస్పరానుబంధముకలిగి, ఆయనసహజకవితా సామర్థ్యమును వెల్లడిచేస్తూఉంటాయి.

మచ్చుకు ఒకటిమాత్రం చూపిస్తాను.

శంకరాభరణము – త్రిపుట.

పల్లవి – ఇంతమోహమేమిరా, ఇందరికన్న, ఇంతి చక్క-నిదేమిర,
అను... సుంతసేపు దానిఁ జూడకుండలేవు
అంతరంగము తెలుపవదియేల, వేణుగోపాల, ఇంత –
చరణము... నీ యెదురుగావచ్చునా సొనరుగ నిండుకౌఁగిటఁగుల్చునా
అకుమడుపు లందిచ్చునా, తన చెలిమికి – నైనవాడని మెచ్చునా,
తమి హెచ్చునా –

ఏకచిత్తమున మీరిద్దరు ఇంపుసొంపులమున్న ముచ్చట
నాకు వినవిన వేడుకయ్యారా ఇపుడానతీరా -
ఇంత మోహమేమిరా -

నేను సంగీత విద్వాంసుడను కాకపోవడంచేత సారంగపాణిగారి కీర్తనలలోని సంగీత శాస్త్రవిషయములు విమర్శించదలచుకోలేదు. శక్తిలేనుకూడాను. కాబట్టి ఆయనను కవిగామాత్రమే భావించి విమర్శిస్తాను.

క్షేత్రయ్యగారి పదములలో భావమునకు తగిన రసమును, రసమునకు తగినభావమును, ఒకదానిలో ఒకటి ఇమిడి శివశక్తుల సామరస్యమువలె యర్ధనారీశ్వరత్వమును ప్రత్యక్షము చేయుచుండును. ఈక్రిందివాక్యాలు చూడండి.

మధ్యమావతి - ఆది.

పల్లవి - తెలిసి తెలియలేక పలికేరు చెలులు
అను...కలసియున్న సామిపై - కాకసేయ వలెనా -
చర...కోనకంటం దము గను-గొనదంతైనగాని
చెనరులేని వాడౌనంచు నిందించేరు
ఘనమైన సామిరూపు కనులు నిండి యుండగ
కనకాంగి, యితరులు కానవత్తురటనే.

కళ్యాణి-ఆది

పల్లవి - నామనసువంటిది నీమన సైతే, నానోముఫల మీడేరురా -
అను...నేమారు, చెరకున పండు పండినట్ల వేడుక లినుమడించురా ఓరివరద
చర...ఊరకుండగలేక, గోరనేమి వ్రాసిన, నీరూపుగా దోచురా
ఏరా కనుగూరిమేల్కాంచినంతనే నీవు నా
చేరువ నున్న ట్లుండురా -
ఈరీతి నామోహ మున్నది నీకే తెలుసు
ఎవరితో విన్నవింతురా - ఓరివరద
నీడ యొక్కచు తిరిగి, నీడ చూచిన నీవు
కూడ వచ్చిన ట్లుండురా - శ్రుతి
కూడి యునిచికొని, పాడినంతనె నీవు నా
తోడ పాడిన ట్లుండురా -
ఆడినమాటకు ధ్వని నీవు ప్రతిమాట
లాడినయ ట్లుండురా -
ఈడు లేనినాదువలపు ఇది నీకు తెలుసు
ఎవరితో విన్నవింతురా - ఓరివరద

ఈ పైవాక్యములలోఉన్న రసభావసమ్మేళనము సంస్కృత సారస్వతము రసభావసమ్మేళనమును మించి యున్నదని నాయుద్దేశము.

సారంగపాణిపాటలలో క్షేత్రయ్యగారి ప్రౌఢిమ కనబడకపోయినా మనోహరములైన భావములు విపులముగా కనిపిస్తూ ఉంటాయి. మచ్చుకు ఒక్కటి

కేదారగౌళ - ఆది.

పల్లవి - నేడు నీవు విన్నవించినందుకు నెనరు పుట్టరాదా - ఎంత
అను... వేడుకై తోచెనో నాథునికి - కలది వేణుగోపాలదేవునికి -
చర... నిన్నుఁ బాసి నిమిష మోర్వ దంటివి, నీ సొమ్మంటివి
కన్నీరున పైట దడిసె నంటివి - కౌరా దంటివి
ఉన్న తావున నుండ దంటివి - ఉలికే నంటివి
చిన్నబుచ్చితే దోస మంటివి, చిత్తానికి సరిపోయిన దంటివి నేడు నీవు

పంతువరాళి - చాపు.

పల్లవి - కరుణ నీకు నామీద గలుగుటకు కారణ మే మయ్యా
అను... పరమాత్మ వేణుగోపాల నీదు నామ
స్మరణైన చేసితినే, యోగనైన - కరుణ నీకు
చర... అలకుచేలునివలె, నటుకులు తెచ్చి మి మ్మారగించ మంటినే
చలువగంధము కుబ్జవలె దేవరవక్షఃస్థలమున నలదితినే
విలసితముగ నావిదురునివలె మీకు, విం దొనరించితినే
కులుకుచు నారదువలె పారిజాతకుసుమ మర్పించితినే
యోగనైన - కరుణ

ఈభావములు సహృదయులకు హృదయంగమములుగా లేవా?

ఈరచనావిశేషమే కాకుండా సారంగపాణిగారి కీర్తనలలో నా హృదయమును ఆకర్షించినవి మరి కొన్ని విషయములు కలవు అవి ప్రత్యేకముగా వివరిస్తాను.

సారంగపాణిగారు తన గ్రంథమును నాలుగు భాగములుగా చేసినారని ఇదివరకే చెప్పినాను. అందు మొదటిభాగమున స్వీయా పరకీయా సామాన్యాది వివిధ శృంగారమును ద్వితీయభాగమున కేవల సామాన్యా శృంగారమును, తృతీయభాగమున జాతీయ (అనగా పామరజనుల) భావములును, చతుర్థ భాగమున భక్తివైరాగ్యములును, హృదయంగమములుగా వర్ణించినారు.

మూడవభాగము చాలా విశిష్టమైనది. దీనికి జాతీయ మని పేరుపెట్టినారు. ఈకాలములో "ఎంకి పాటల"ను స్వర్గలోకమునకు ఎక్కించిన రసికశిఖామణు లందరూ గమనించవలసిన విషయము. నీచపాత్రలు నీచభాషలో, ఉత్తమపాత్రల భావాలు ఉత్తమపాత్రల సంగీతంతో వ్యక్తము చేయడము ఎంతరసికతో, అందులోరసమున్నదనీ అనుభవిస్తూఉన్నామనీ అనుకోవడము ఎంతరసికతో నావంటి అల్పజ్ఞుడు చెప్పగలిగినవిషయం కాదు. సారంగపాణిగారికిమాత్రం ఈభావము స్ఫురించినట్లు కన బడదు. కళాప్రపూర్ణులు సృష్టించిన ఎల్లి పేరిగాళ్ళ ప్రేమావంతము ఎంకి నాయుడుబావల ప్రేమా వంతంతో సంప్రతించి చూస్తే కళాప్రపూర్ణుల నామసార్థకత్వము గోచరిస్తుంది. అంతేకాక

నిమణుచు నామణుచు, నిరకు తప్పకుంటే
ఎన్నాళ్లు ఎడబాసి లేమాజా నెంచు
ఏమూల ఏసోల ఏమికన్నే నివవో
రొంటూ వనాని నీవు తుంటరిమావు -

ఆసేమాటలలో గలభావపారిశుద్ధ్యముగాని,

రైకా నూసి మాగించినదు రాసావోరిపడుచు
కోకా నూసి మాగించినదు గోసాసింగుపడుచు

ఆసేమాటలలో గలభావయాథార్థ్యముగాని, ఎంకి నాయుడుబావల పేరిమోదంతములో ఎంతవరకు ఉన్నదో తద్జ్ఞులూహింతురుగాక. సారంగపాణిగారి నీచపాత్రప్రసంగాలు చిత్రంగా ఉంటాయి. మచ్చుకు కొన్ని మాదిరీలు చూపిస్తాను.

మోహన - చాపు.

పల్లవి - ఇసబోనంమ్మోన - యీాదెంబ డెల్లాచ్చే
దిష్టిగ్నమో యీాప్పుడో బొమ్మో లేక యిగనేసుడో నీముడో
అను...నొసలి బూది గొట్టి నొష్ట గందం మెత్తి
కుసుని కుండాడోడు గుండా ముంగాల - ఇసబోనం
చర...గొడుగు లంట కింపి - గిడుగుల్నే యుండాయి
అడుగున పబ నో రట్టెల బెట్టింది
తడిగే వేనటుంది, అడిగే పేరెటమను
పడుమూపిన్నో లేందో పక్కలా యిసరగా - ఇసబోనమ్మో
తాలాలువాసగ - మేలాలాగుతుండాగ
సివేడికలు మూడ - కిత్రాలాడ
పూవుంట సెడుగోలు - పుట్టుగిచ్చాల్లోనో
తావేనగారిందాంయి తలమంటేకంబోయి - ఇసబో

మరొకటి

పంతువరాళి - ఆది.

పల్లవి - సంగవాకమను - బీమెదుండాయి - బింగరమోయి బాపనోల్లకు
అను...అంగల్లో అచ్చింత్లోగింజలె - చంగటికిసిరినపిండిపప్పైతే
చర...రుదొల్లోపరచి చెంతుంటే
రుయిటోకీనే గోరస్తపడుండజ
గోదార్లైలే గుడ్డల్లిందేమీాడ
గొండపామ్మను పిండోల్నంటి నాలెంజ - సంగ

ఇంకొకటి

నాదనామక్రియ - చాపు.

పల్లవి - మనసా - నొమ్మబాకే - యీాద్రిగాము కళేభారం
మనసా - నమ్మబాకే

అను...మనసా - యీడేర్గాము - మట్టి పెట్టింటుది
పనికేటిలోనుండె - పరమాత్ముడె దెల్పంటే - మనసా

చర...1. తొమ్మిమిదిసారంభూళ - తోకేనవమావిగ
బెమ్మగాయించిది - బెష్టకౌకట్టె - మనసా.
2. ఎన్నంటాయెమికేలు - యెనకముంగ జెంటికేలు
కన్నయాదులబుట్టు - గడగకుంటి గబ్బుమనసా
3. పయిరెన్నెలదుగున - పరమకాంధలము
మయిదు యీస్మ్రదుకేగి - మచ్చిగప్పింధాడుమనసా
4. తనవోణకెత్తి - ధరమధాణంకేశి
యినవలెరామేంధం - ననమోచ్ఛము - మనసా
5. ఎంటవంగిటిలావు - యేనుగోపాలుని
బంటై పాదకవళం బట్టాజ ఘట్టిగ - మనసా

మరొక్కటిమాత్రం

అరభి - చాపు.

పల్లవి - అగ్గితిరుమళ్లంట - అజ్జునికతులంట
అవురా - యెంతసోద్దెమే - బారతకత
ఔరా - యెన్నెన్నింతలే
అను...మగ్గిజయము దీని - సుట్టుబలాదురు
అగ్గుకోరవు అయ్యార్నుబగో నీసాచ్చిగ అగ్గి
చర...1. యిగనేనుపైకెక్కి - యీటీసనూడొచ్చి
బగుపెగ్గిస్నినోన్ని - బలికిదుశ్శాసుని
కెంగముచూడగనే - మొర్చ నాయాలట్టి
గుగుసుమిగువవకుండ - గుండెల్లగుక్కాకె అగ్గి
2. అనుమం తెనకటోడు - అభిమన్నుడంటానే
సనియనోలె బట్ట - సాముసేయును అట్టె
యినరేయేరా బద్రి - నిసనకాయలు దొక్కి
కనురెప్పె సా తక్కె - కర్ణుని పించనె - అగ్గి
3. యిరస్నేచ్చు సద్దకు - డింద్రజిత్తోకరెయ్యి
దురివోదనునిసెయిలో - దూరి ముక్కున పెల్లి
అరిపి పిసాసోలె - అశ్వద్ధామను మింగి,
సారివోదమూరెనే, సాదయేడిగున్న - అగ్గి

నీచపాత్రలలో కలుతూఉండే భావాలు వాటి తబ్బిబ్బులూ పైపాటలలో యెంత స్వభావసిద్ధంగా ఉన్నవో పరిశీలిస్తే తెలుస్తుంది. పాత్రకు తగినభాష - భావకు తగినభావము - భావానికి తగినపాత్ర పరస్పర పోషకములై జీవకళతో ఉన్నవి.

అయితే, ఈభాషలో పెద్దచిక్కు కలుగుతూఉన్నది. పేరిగాడి ఉదంతంగాని కన్యాశుల్కంగాని యెంకినాయకురాలి ప్రణయవిభ్రమముగాని, సారంగపాణిగారి జాతీయంగాని, ఛాయాపేక్షకములైయే యున్నవి. సమకాలికులగు సమదేశికులకే సుబోధములుగాని ఇవన్నీ దేశకాలభేదములవల్ల దుర్బోధములైయే యున్నవి.

పామరజనవ్యవహార సిద్ధమైనభాష తద్దేశ తత్కాల తత్పాత్రలకు మనోరంజకముగాను సుగమముగాను ఉన్నా, సర్వదేశసర్వకాలసర్వపాత్రమనోరంజకముగా ఉండదు. బహుదూరత్వమువల్ల అన్నిభాషలకు ఈగతే పట్టవచ్చును గాని అవకాశమైనంతవరకు దేశకాల పాత్రల సార్వత్రికత్వము కావ్యరచనలో గమనించవలసినఅంశముకాదా? ఏదిఏలాగుఉన్నా నీచపాత్రల భావాలు నీచభాషలో చెప్పితేనే హృదయములను ఆకర్షించునుగాని ఉత్తమభాషలో చెప్పిన ప్రయోజనములేదు. చిత్రనళీయములో ఎరుకువాళ్ళ సంభాషణ స్వభావసిద్ధముకాదని వేరే చెప్పనక్కరలేదు. కాబట్టి సారంగపాణిగారు తృతీయభాగరచనకు ప్రశంసాపాత్రులైయున్నారు.

ద్వితీయభాగమునకు దేశీయమని సారంగపాణిగారే పేరు పెట్టియున్నారు. ఇందులో సామాన్య శృంగారము వర్ణించిఉన్నారు. ఈభాగంలోఉన్న పాటలన్నింటిలోను భావము, భాష, చాలా ఒప్పిఉన్నవి. శిష్టజనులు సంప్రదాయంగా మాట్లాడుకొనే వ్యవహారభాషలో మనోహరములై సముచితములైన భావములతో ఈభాగమంతా చాలా శ్రావ్యంగా ఉన్నది. భాష అతిసులభము అతిలలితము. భావములు అతికోమలములు. సామాన్యభావమునకు మిక్కిలి ఒప్పియున్నవి. మచ్చు చూదాం. మొట్టమొదటనే

భైరవి - త్రిపుట.

పల్లవి - నీపొందుసేయక విడిచేనా - వేరే
సెలతకొప్పున విరులు ముడిచేనా - ఆరే
అను... బాపురే నే చేయు - ప్రతిన చెల్లకపోతే
నాపేరు యిక వేణు - గోపాలుడనవలెనా - నీపొందు
చర... 1. మరునిగూర్చితపము చేయనా - యీడా
మనసులేదంటేనే అయినా
మరులునిరుపలేక - మరిమరివేడితే
కరుణమాలి యట్టె - కండ్లెఱ్ఱచేయగానే - నీపొందు
2. పాటపాడిమెప్పించనా - నీపై
పదముచెప్పివలపించనా
బూటకాలమాలి - నీపుణ్యామనేకొద్ది
మోటుబారుకొని - మొగముచిట్లించగానే - నీపొందు
3. కూనలమ్మకు వేట గొట్టినా - నిన్ను
గూడితేపొంగళ్ళు బెట్టనా
చానతో బతిమాలి సరసకురమ్మంటి
కానిలెమ్మని కసరిపొమ్మనగానె - నీపొందు

ఇంకొకటి

భైరవి - ఆది.

పల్లవి - నీమాటకివడతలు - నీకే సరి - లోకులెవరు మెచ్చరమ్మా
అను... ఈకొడికి తెల్లవారగద - నన్నికను వేణుగోపాలుడనదట - నీ
చర...1. నిదురలోతె - లేవ మనసుబుట్టదు - నుదుటరోయేనాడు బొట్టుపెట్టదు
ఇదియుగాక - తమలపాకుముట్టదు - ఏడాదికికొప్పువిడిచికట్టదు - నీ
2. చీరె చేత వకనాడుముట్టదు - వింతచూచినా - నవ్వుపుట్టదు
రాణివాసమట అడుగటుపెట్టదు - రామరామ - సొగసనేది గిట్టదు - నీ
3. సేమగూడేది తనకుకూడదు - నెవరుగూర్చి నాతోపలుకాడదు
పూనివట్టి మంకుగుణము వీడదు - బుద్ధి వారు చెప్పేరనిచూడదు - నీమాట

ఇంకొకటి

మధ్యమావతి - చాపు.

పల్లవి - ఇప్పుడుగాక యింకెప్పుడు బెదరించేవింతి నిన్ననదోసమా
అను...చప్పుడుచేయక - వేణుగోపాలుడు
చంకబెట్టుకొన్న సలి గాదటకేమే - ఇప్పుడు
చర...1. చుట్టు కొల్లారిండ్లు - కుంతలో విడిదారు
పట్టిమంచము దూదిపరుపులాయె;
పెట్టెలకొలది కట్టువర్గములాయె - పెరిమెలదనమాయె;
కట్టివిడువ చేత కొనుకీసమాయె; పుట్టిమీద చేతివుగ్గాలాయె
పట్టినపను లెల్ల బంగారుచెరుగాయె
వట్టాకు వుడికించే చట్టి దూరమాయె - ఇప్పుడు...
2. పడతిరో - పూరూగు పైరుపచ్చలాయె
కడలేని ధాన్యాల - కణజలాయె;
మెతదిప్పరాకుండ - మినుకుసొమ్ములాయె
మెరుగుటద్దములాయె;
నడితీలో యిప్పుడు - నాగరీకమాయె నానాటికి పని
నాణ్యమాయె;
వడినిండా తరగని - వక్కలాకులాయె;
ముడికి చాలనిగుడ్డ ముచ్చటమరుపాయ - ఇప్పుడు-

ఇం కొక్కటిమాత్రం

గౌళిపంతు - ఆది.

పల్లవి - అంతమాత్రము చే నీయనటే - అజ్ఞానురాలా - చే
అను... యెంత పిలిచిన పనేమిరా యని - గంతులు వైచుచు పరిగెత్తేవు
చర...1. కవాకాలము రాతిరిగుల్లో - అకేలాదాకొనిలుచుంటి
కేవాములమువారొకరోళ - నీవాళ్లోద్దాకా మామకొమ్మని - అంత

2. గడ్డగూడువరె తలబెట్టుకొని - సుద్దులాడవచ్చితె సాతాని
   పెద్దతెలగచిప్పదెచ్చుకొమ్మని - కిద్దెలోనిచముగు వంచి యిచ్చెను - అంత
3. రొయ్యదిన్ననోటికి పావ్వాకేం - తియ్యమనుచు యెడమచెయ్యిసాచితే
   అయ్యతోడ లేదని తనచారెడు - బియ్యమిచ్చె వుగ్రాణపుదాసరి - అంత
4. పాతగుడ్డ పైటకందలేదని - భంగపడితె - నాంచారుకప్పుడు
   సాతియున్నచీర గుంజి తెగపె - చేతికిచ్చె పరిచారక వైష్ణవు - దంత

ఈ భాగమంతా ఈలాగేఉన్నది. ఇందులో భావాలు చాలా స్వభావసిద్ధములు. భాష పాత్రోచితమై శిష్టజన వ్యవహారసిద్ధమైనభాష. ఈలాటిభాష చాలాకాలంవరకూ పాతబడిపోదు. స్వభావసిద్ధమైన భావానికి, మనోహరమైనభాషకూ ఈ ద్వితీయభాగరచనలో సారంగపాణిగారిని చాలా ప్రశంస చేయవలసిఉన్నది.

చతుర్థభాగమంతా భక్తివైరాగ్యములతో నిండిఉన్నది. గేయరచనలలో సామ్రాజ్య పట్టాభిషిక్తులగు త్యాగయ్యగారిని విడిచితే భక్తివైరాగ్యరచనలలో రెండవస్థానము గోపన్నగారికే ఈయవలసిఉన్నది. దాశరధీ - కరుణాపయోనిధీ - అన్న మాట నోటపట్టని ఆంధ్రుడుండడు. ఆయన తాను రచించిన కీర్తనలలో - యెదుటివారిని పరవశముచేసి తాను పరవశమగును. సకలేంద్రియములార ! యిపుడు సమయముగాదు, సద్దుసేయకయుండరే- అని గోపన్నగారు అంటూఉంటే ఇంద్రియములకు ఏకాగ్రత గోపన్నగారికే కలుగుతుందో మనకే కలుగుతుందో చెప్పలేను.

"కులుకుతురా తిరిగేవు, ఎవరబ్బసొమ్మని" అనిగాని, "అడుగుదాటికదలనివ్వను, నాకభయమివ్వక నిన్ను విడువను" అనిగాని గోపన్నగారంటూఉంటే స్వామివద్ద అంతస్వాతంత్ర్యము ఆయనకే చెల్లిందిగాని మనమనగా ఎంతవారమని తోస్తూఉంటుంది. ఏమీవద్దు, వట్టినే "రామచంద్రా" అన్నమాట గోపన్నగారినోటినుండి వచ్చినప్పుడల్లా రామచంద్రుడు "ఓ" అని, గోపన్నగారికే పలుకుతూఉన్నాడో, మనకే పలుకుతూఉన్నాడో వివరించలేను.

త్యాగయ్యగారికుండే సర్వతోముఖప్రతిభగాని, గోపన్నగారికుండే భక్తితాదాత్మ్యముగాని, సారంగపాణిగారికి లేకపోయినా, భక్తికితగినభావన, భావనకు తగినభాష ఒకదానికొకటి తులతూగుతూ సారంగపాణిగారి భక్తివైరాగ్యకీర్తనలు చాలా హృదయంగమములుగాఉంటాయి. మచ్చుకు

భైరవి - ఆది.

పల్లవి - భక్తితో పిలిచిపెట్టినయన్నము పట్టెడైనచాలు; చెవులకు
అను...రక్తిగా హితవైనపాట - పల్లవివిన్నాచాలు; కృష్ణా - భక్తి
చర...1. భావము తెలిసిననాయకురాలితో - భాషించినచాలు; తెలిసిన
   కోవిదులకు కరుణనిచ్చుదానము - కొంచెమైనచాలు; కృష్ణా - భక్తి
2. కులము తెలియ సత్కీర్తివహించే - కొడుకొక్కడెచాలు - ప్రజలను
   అలమటపెట్టక - ఆర్జించినధన మణుమాత్రమెచాలు; కృష్ణా - భక్తితో
3. అచ్చుదరై - తారగట్టినజాగా - ఆడిగడైనచాలు - యిది
   గచ్చుగాదు - సద్గురువాక్యము లరగడియవిన్నచాలు; కృష్ణా
4. వచ్చినప్రుడె యాచకులకు వశతృణమిచ్చేవంటిచాలు - సతులకు
   హెచ్చు వలదు - భర్తదైవమని ఊహించితేనచాలు - కృష్ణా - భక్తితో

6. దురితములుడిగేటందుకు దామోదరునిభజన చాలు; మీదట
పరతత్వము తెలుపుటకు వేణుగోపాలుడే చాలు; కృష్ణా - భక్తితో పిలిచి

సారంగపాణిగారు చతుర్థపాదంలో ఉపయోగించిన భాషకున్నూ ప్రథమపాదంలో ఉపయోగించిన భాషకున్నూ తేడాలేదు. కాబట్టి భాషావిషయమై రెండున్నూ కలిపే విమర్శిస్తాను.

ప్రథమభాగంలో వివిధములైన శృంగారభావాలు వర్ణించినారు. ఈభాగము పూర్తిగా కార్వేటి నగర వేణుగోపాలుని కంకితముకాలేదు. ఇతరనాయకులుకూడా కలరు. ఈ క్రిందివారు ముఖ్యులు - శ్రీ కళ్యాణ వేంకటేశ్వరులు, చిరుతని చెంగల్వరాయడు, ప్రసన్న వేంకటశౌరి, వరదా నారాయణుడు, శ్రీ మాకరాజ వీరకార్వేటిరాజేంద్రుడు. ఈ నాయకులందరూ వస్తారు.

ఏనాయకుడువచ్చినా అతడు దక్షిణనాయకుడే. ఇతడు కవులపాలిటికల్పతరువుకదా! నాయికలు మాత్రమే మారుతూఉంటారు. ఈ ప్రథమభాగంలో సారంగపాణిగారు తమ నైపుణ్యం చూపించినారు. రచన బిగిగాఉంటుంది. అనగా పండితుడు చెప్పినట్లు చెప్పినారు. కాని ద్వితీయభాగంలో ఉండేభావసారళ్యము భాషామాధుర్యం కనబడదు. పాండిత్యప్రకర్ష కోసం చేసినప్రయత్నం స్పష్టంగా ప్రత్యక్షమౌతుంది. ఇది అనేకవిధాలుగా కనబడుతుంది.

మచ్చు చూదాం.

1. (i) జిగిబిగి

పల్లవి - అలుక చేసి పలుకడేమె యీచెలివలపుమందుబలిమో
అను... కలదివినవె శ్రీకార్వేటినగర - నిలయుడైన వేణుగోపాలుడు
చర...(1) కలికిచిలుకపలుకులకును సొలయుచు చెలినిగోరినాడే - నను
బలిమిచేసి, వలచియున్న బాలిని కలసి యేంచినాడే -
తలిరుబోణులలో బలువిధముల నిటుచులక చేసినాడే - యిక
చెలిమిదలచి, కలసిమెలసి. అలయక వలపునిలుపగలన లలన చెలువుడు అలుక
(2) తెగువతోడ నాముగువకు కెలగల నగలు యిచ్చినాడే - నే
నగము రేయివేళ నగరు బంపితే అగడు జేసినాడే
పగలుజూడనే సొగసుగ బిలిచితే నగవులాడినాడే యీ
నగలు వలదు-సుగుణముగల నగధరు దగిలి పొగడి తగదను బహుఘనముగ - అలుక-
(3) సరసముగను ఆ - సరసిజముఖిపై - మరులుకొందినాడే - నే
సరసజేరి కరుణ జూడుమనినను - విరసమాడినాడే
తరుణి వినవె మును సురతము నేలిన - సరణి మరచినాడే యీ
మరుడు శరము చురచురమని గురుతుగ - నురము నొరయబరపె తరమ మరిమరి- అలుక

2. అనుప్రాసము

అసావేరి - ఆది.

1. ఏరా - ఏ రామా బోధించ - రారా రారాపూ సేయక
దూరా - దూరాన నిలుచుందురా - నీమదిన
తేరా - చేరారానేమందురా

2. నిన్నా నిన్నాడుకొన్నది - విన్నా - విన్నాణగత్తెను
కొన్నా - కొన్నాపరకమిత్తురా - నే దానికంటె
చిన్నా - చిన్నాపనులు సెత్తురా
3. వద్దా - వద్దారావు వొక్క
పొద్దా - పొద్దాయెనే యిట్లా
కద్దా - కద్దా చెలితో ఆటలు, రమేశ యిదే
రద్దా - రద్దాయె నీమాటలు
4. కానీ - కానీబోటి సతమానీ మానీతి నీదయ
రానీ - రానీదుమాయింటికి; అదిచెప్పినట్ల
పోనీ - పోనీదుపొరుగింటికి
5. ఇందు - ఇందుముఖుల మెచ్చ - ముందుముందుగాగూడి నా
యందు - యెందుకింతకోపమూ - వేణుగోపాల
సందుసందుల ప్రస్తావము

ద్విప్రాస - త్రిప్రాస - చతుష్ప్రాసాది ప్రాసచిత్రములు చాలాఉన్నవి. ఇంతేకాక - మందుల పేర్లు - మానుల పేర్లు - ఊళ్ళ పేర్లు - ఔషధముల పేర్లు - ఆభరణముల పేర్లు - రాగాల పేర్లు - మొదలైనవి ఇమిడేటట్లు పాటలు కూర్చినారు. ఈచిత్రాలన్నీ ప్రబంధాలలో కవీశ్వరులు అనుసరించే ప్రౌఢమార్గాలు. పాటలలో విపులంగా ఈలాటివి కూర్చిన కవి ఈసారంగపాణిగా రొక్కరే కనబడుతూఉన్నారు. దాఖలా చూదాం చిన్నచిన్న ముక్కలుమాత్రం.

1. కొమ్మలపదం

కోమలాంగికి బోవిడిచె పెట్టెల పగలగొట్టికొమ్మా - నేనా
వామాక్షివలె నేర్పరిన విభుని గెలువంగకొమ్మా
కనులజాచేనంటే దాటిరాడె దానికడపకొమ్మా - ఆ
కనకాంగినిజాచి నేర్పుకొన్నాడింత కలిపకొమ్మా

2. మందులపదం

ఎలనాగకేసరా లిచ్చితే నీకేమి
చలపట్టియిపుడు రచ్చలకు కొచుకొన్నావు
పలుమారు వేణుగోపాలా వెరుసేతుక
కలసియుందామనుచు బిలువ వేరుజావుగా

3. మానులపదము

సంతమున అటుదిక్కు పదివాళ్లు పోకమాను
ఇంతికిచ్చ్రుసుమీ ఈతమాను
సుంతమువను గట్టిచేసి సుదతి కొమ్మదిమాను
చెంతదీయకది మహాబెగడగొండి - మాను అదే.

4. ఊళ్ల పదము

కోరియుంటినే గోలకొండగ యెంతో నమ్మ
ఈరేడుజగము లెరుగ నిదివరకు
కూరిమితో నన్ను చిత్రకూటమున కూడిపాడి
పేరుచెప్పి నాముందర ఆ పెనుగొండగ భూషించెను.

5. ఔషధముల పేళ్లు

పొలతినెమ్మోము సుపూర్ణచంద్రోదయము
అలకాళిరుచి వినోదాంజనంబు
దాని మృదుమధురోక్తి ద్రాక్షాదిరసమెంచ
మానవతిచూపు మన్మథబాణసమము etc.

6. ఆభరణముల పేర్లు

కమ్మలుదానికి వ్రాయ కారణమేమన్నందుకు
సమ్మతిగాకుంటే పో చీ పొమ్మని నిరాకరించి etc.

ఈ ప్రథమభాగంలో లోకోక్తులు చాలా చాలా మార్చివారు.

1. మంచిది కానిలేవే
2. అందరానిపండ్లకాశించినట్లు
3. చెడ్డచేనికింటికడ్లు పొంగలిచేసినట్లు
4. ఉడుముపోతేపోయినది చై మాత్రము విడిచితేచాలు
5. ఉసురువుంటేవుప్పున్మ్రకోగలను
6. మూసినముత్యమువలె
7. పదివేలుతిట్టితివి
8. అడుగులోనె అరవైయారుగుణములైతే
9. గడిదీరి తిరిగితే
10. ఇంటింటిచంద్రుడవు
11. అడకావకు నీజాడలు బయలాయె
12. కొండకెగెవానిమొలను కొడవలిచిక్కినట్లాయెను

ఇత్యాదులు వందలకొద్దీ ఉన్నవి.

కేవల రసభావప్రకటనకైయే పుట్టినపదరచనలలో ఈలాంటి శబ్దచిత్రాలు ప్రదర్శించడంవల్ల ఉద్దేశభంగం కలుగుతుంది. కాని, ఆకాలంలో ప్రబంధకవులంతా శబ్దచిత్రప్రధానమైనపద్యరచనలే చేస్తూ ఉన్నందువల్లను, పద్యకవులకన్న పదకవులము తీసిపోతామాఅని తమమహత్తునిలబెట్టకోవడానికి సారంగపాణిగారు ఈలాంటిరచనలు చేసి తమ పాండిత్యం చూపించినట్లు కనబడుతుంది. ఈ "నత్యం"

బాధిస్తూ ఉండబట్టే కాబోలు ద్వితీయ తృతీయభాగాలు రచించి తాను సహజకవినని లోకానికి ఋజువు చేసినారు.

శబ్ద చిత్రాలకు కక్కుర్తిపడని పాటలుకూడా కొన్ని ప్రథమభాగంలో కలవు. అవి చాలా మనోహరంగా ఉంటాయి. చూదాం.

1. కలనైన పరసతుల కన్నులజూడని
   చెలువుడే నీ పాదసేవ చేసేనంటే
   వలదు పొమ్మనుచు అవలిమోమైతివి
   చెలియరో నీకింత చెల్లుబడి యేమే
2. బొమ్మలపెండ్లికి - కొమ్మలు వేగమె
   రమ్మన నే సంతోషమ్మున బోవగ
   సొమ్ములివిగో కైకొమ్మని చెంతకు
   రమ్మని ముంతముద్దిమ్మని కొసరేవు.
3. అతివరో నామాట లాలకించీ ననుచు
   వపుడు చిలుకను బెంచెనే - నన్ను
   మతిలోన దలచునని ప్రతిమనొక్కటి చిత్ర
   పటములో వ్రాయించెనే -
   వ్రతమనుచు వగకాని - వద్దికే చెలుల రా
   వద్దనుచు చాటించెనే, యింత
   మితిమీరి యిద్దరికి మిత్రభేదము చేసి
   మేలు మెచ్చులు గాంచెనే

ఈలాటి చాలా మనోహరమైన రచనలు కూడా ప్రథమభాగములో కలవు.

గేయకవిసార్వభౌముడగు త్యాగయ్యగారే కేవల పరాడంబరంకోసం కొన్ని రచనలు చేసినప్పుడు, తక్కినవారిమాట లెక్కయేమి? ఏగతి రచియించినైన సమకాలమువారలు మెచ్చరేకదా - అన్న భయం ప్రతి కవికీ సహజమేగదా. కాబట్టి సహజకవులు లోకం మెప్పుకోసం కొన్ని రచనలు చేస్తూ అది తమమతంకాదని రుజువు చేయడానికి సహజరచనలుకూడా చేస్తారు. కావలిస్తే త్యాగయ్యగారి సంగతి చూదాం.

1. ఉపచారము చేసేవారున్నారని మరువకురా
2. ఊరకే కల్గునా రాముని భక్తి
3. ఎవరికై యవతారమెత్తితివో
4. ఎంతని నే వర్ణింతును శబరిభాగ్యము
5. ఎంతరానీ - తనకెంతపోనీ నీ చెంతవిడువ శ్రీరామా
6. కొలువైయున్నాడే - కోదండపాణి

అని యీలాంటి మధురమైన వాక్యాలు రచించిన త్యాగయ్యగారే

1. తరుణారుణనిభచరణా - సురమదహరణా
   శ్రితజనకరుణాద్భుతసుగుణ - అనిన్నీ

2. భవసారస భవమానస - భవ నామొరవినురా
శరశోభిత శరభాపతిమిరభాస్కర సుగుణా - అనిన్ని
3. లాలిలాలీయనీ యూచేరా, వన
మాలిమాలీయని యూచేరా
రామరామాయని పాడేర - రిపు
భీమభీమాయని పాడెరా
దేవదేవాయని పిలచేరా, భూ
దేవదేవాయని తలచేరా

అనిన్ని చెప్పినరచనలలో ఏమిరసపుష్టికలదు? ఇవి సమకాలికుల మొగము తుడుచుటకు మాత్రమే కాక మరేమి?

## ప్రథమ చతుర్థభాగములలో సారంగపాణిభాష.

సారంగపాణిగారు తమ పదరచనలలో వాడుక చేసినభాష ఆంధ్రభాషాచరిత్రలో చాలాప్రధానమైన విషయమే. అందులోసంగతులు చాలావరకు అందరకీ తెలిసినవే అయినా, సందర్భం కలుపుకోవడానికి తిరిగీ చెప్పవలసివచ్చినట్లు తోచినందున, చెప్పుతూఉన్నాను. నూతనత్వము లేకపోయినందుకు క్షమించండి.

మ. రా. రా. గిడుగు రామమూర్తి పంతులుగారు భాషకు క్రొత్తగా శాసనముగాని, అనుశాసనముగాని చేసినవారుకారు. సనాతనమైన సత్సంప్రదాయము కృత్రిమపండితులహస్తాలలో పడి మాటుపడిపోయిఉంటే, కృత్రిమపండితులను దూరముగా తరిమివేసి, మాటుపడిపోయిన ఆసనాతనసంప్రదాయాన్ని తిరిగీ వెలుగులోనికి తీసుకొనివచ్చినారు. గీతామతమును కృష్ణుడు క్రొత్తగా సృష్టిచేసి అర్జునుడికి చెప్పలేదు. సనాతనమైన ఒకసత్సంప్రదాయమునే, ధర్మసమ్మూఢచేతస్కుడైన అర్జునుడికి ఉపదేశంచేసి, అతనిని కార్యశూరుణ్ణిగా చేసినాడు. అవిధముగానే రామమూర్తిపంతులుగారునూ, సనాతనమైన ఒక సత్సంప్రదాయమును ధర్మసమ్మూఢచేతస్కులైన గ్రంథకర్తలకు ఉపదేశముచేసి వారిని కార్యశూరులనుగా చేసినారు. కాబట్టి గీతావిషయమున శ్రీకృష్ణునికి ఈయవలసిన స్థానము భాషావిషయమున శ్రీరామమూర్తిపంతులుగారికి ఈయవలసిఉన్నది. కృత్రిమాంధ్రపండితులకు ఆచార్యులైనవారు చిన్నయాచార్యులుగారు. ఈచిన్నయ్యవారు చిన్నవారికి వ్రాసిన వ్యాకరణము చాలదని గుర్తించే, బహుజనామోదము సంపాదించగలసిన యొక పెద్దయ్యవారు పెద్దవ్యాకరణము వ్రాసినారు. ఈచిన్నయ్యవారున్ను, పెద్దయ్యవారున్నుకూడా అయ్యవార్లే కావడంచేత, వారి ఉపదేశాలే పాఠశాలలలో స్థిరపడి, పాకశాలలవరకూ పోయి, చివరకు పానశాలలలోకికూడా ప్రాకి, అపైని, పాఠశాలలో ఉన్నవారికికూడా మతసంస్కారము కలిగించినవి. పాఠశాలలలో ప్రవేశించి, ఈచిన్నయ్యవారిమతము ఎంతప్రమాదము కలిగించినా, ఈనూతన మత స్వీకారము చేయకుండా ఉండినవారు, పాఠశాలలలో ప్రవేశించకుండా పాఠశాలలోనే ఉండిపోయినవారు కొందరు చిన్నయ్యవారి సమకాలికులే ఉన్నారు.

వారిలో మొదటివారు బ్రౌనుపండితులు. జూలూరి, రావిపాటి, దేవరాజు ప్రముఖులగు పండితుల సహాయమువల్ల బ్రౌనుపండితుడు సనాతన సంప్రదాయమును నిలబెట్టినాడు. కాని అతడు శ్వేతా

చార్యుడు కావడంచేత సర్వసమ్మతుడు కాలేకపోయినాడు. త్యాగయ్యవారు చిన్నయ్యగారిని అత్యుము చేయలేదు గాని, ఆయన తమిళాచార్యుడు కావడంచేతనున్నూ ఆయనపదాలు పాఠశాలల లోకి ప్రాకినా పాఠశాలలలోకి ప్రాకవలసిన అగత్యం లేకపోవడముచేత నున్నూ, అవి యెవరికీ వజరుకలిగించడంలేదు. సారంగపాణిగారు కూడా చిన్నయగారితో సమకాలికులే గాని, వారిపదాలు దేవాలయములలోను, అక్షయపాత్రలలోను, ముసలమ్మల నోళ్లలోనూ, ఉండిపోవడంచేత అవి కూడా పాఠశాలలో ప్రవేశించలేదు. కాబట్టి చిన్నయ్యవారి పెద్దయ్యవారి మతాలే నిలిచిపోయి, ఇతరమతాలన్నిటినీ అణిచివేసినవి.

అయితే, అణచివేత లెప్పుడూ శాశ్వతంకావు. తిరుగుబాటు ఎప్పటికైనాతప్పదు. అతిరుగుబాటు కొక్కొండవారిలో మొలకెత్తి, వీరేశలింగంగారిలో కొంతతలయెత్తి, ఆవేంకటరాయశాస్త్రిగారిలో అటూ ఇటూ ఊగులాడి, అప్పారావుగారిలో వేళ్ళుదన్ని, రామమూర్తిపంతులుగారిలో పల్లవించి, పుష్పించి, ఫలించినది. కొక్కొండవారిలో దాగరంతమేర ఏదోకనబడ్డమబ్బు, శ్రీరామమూర్తిపంతులు గారి రూపాన కాలమేఘమై మహావర్షము కురిసి, మురికికాలువలన్నిటినీ శుభ్రపరచినది. శ్రీరామ మూర్తిపంతులుగారు పునరుద్ధరించిన ఈసనాతన సత్సంప్రదాయమునకు, ఆచార్యులలో సారంగిపాణి గారొకరు. ప్రాచీనపండితులపద్ధతి శ్వేతమునులలో మాత్రమే నిలిచిపోయినది. త్యాగయ్యవారిపద్ధతి గాయకులలోనే నిలిచిపోయినది. అందులోనూ, అరవవారినోళ్ళలో పడి, మరీపాడయిపోయినది. సారంగపాణిగారి పద్ధతిమాత్రం, దేవాలయములు, బిచ్చగాండ్రు, ముసలమ్మలలోకికూడా ప్రాకి సర్వ జనామోదమును పొందినది. ఇక వారిపద్ధతి విచారిద్దాము.

మూడవభాగంలో వారనుసరించిన మార్గము ఇదివరకే కొంత తెలుసుకొన్నాం. దానికి తాత్కా లికామోదమున్నా సార్వకాలిక సార్వదేశికామోదము లేదనికూడా తెలుసుకొన్నాం. ఆయన మొదటి మూడవ భాగాలలో అనుసరించిన పద్ధతి వేరుగా ఉన్నది.

శ్రీనాథునియందు బీజవత్తుగా ఉన్న యొకపద్ధతి శ్రీకృష్ణదేవరాయలయందు వృద్ధిపొంది, రఘునాథ రాయలలో విజృంభించినది. ఈపద్ధతినే సారంగపాణిగారు అనుసరించినారు. దీనిని విపులీకరించి చెప్తాను. శాఖాచంక్రమణముగాని, చర్వితచర్వణముగాని, పాఠకులు ఉన్నప్పటికీ క్షమించవలసిన దని ప్రార్థన.

ఆంధ్రసామ్రాజ్యము మగధసామ్రాజ్యాన్ని ఆక్రమించిన ప్రథమశతాబ్దానికే ప్రథమాంధ్రవ్యాకరణం పుట్టిఉండాలి.

దరశార్జపిప్పలిదశాంకుశపన్నగసన్నిభాః క్రమాత్ పరుషాః అనిన్నీ పంచవర్గాదయోవర్ణాః శంఖశార్జాది సన్నిభాః- అనిన్నీ, వర్ణతత్త్వములోనూ,

“వాతః, అద్యః క్రియాసు భూతార్థద్యోతినమాద్యగం వినా సర్వః
సర్వత్రాజ్యతాత్పర్యం క్షయం యస్య ద్రుతప్రకృతికేభ్యః”

అని ఇతరత్రాను, చెప్పిన సూత్రాలు అతిప్రాచీనములు కాకతప్పదు. నన్నయభట్టుగారు తనకాలా నికి ఉండినకొద్దిసూత్రాలకు కాలోచితంగా మరికొన్నిసూత్రాలు కలిపి. చిన్నవ్యాకరణం చేశారు. అథర్వణాచార్యులుగారుకూడా అలాగే చేశారు.

బాలసరస్వతిగారికి నన్నయభట్టుగారి పాతతాటాకులేవో దొరికితే, దాని కొకకథ కల్పించి ప్రాచీనత్వముతో పాటు పవిత్రత్వముకూడా కలిగించి, తనవికూడా కొన్నిసూత్రాలు తగిలించి అక్కడక్కడ అధర్వణాచార్యులుగారిని స్మరిస్తూ ఒక వ్యాఖ్యానరూపమైన వ్యాకరణం నిర్మించినారు. నీకన్న నేనేమి తక్కువవాడనా అని అహోబలపతిగారు బాలసరస్వతిగారిసూత్రాలకే తిరిగీ వ్యాఖ్యానము వ్రాసి, అధర్వణుని ఎక్కువగా స్మరించడమేగాకుండా నన్నయ్యగారిసూత్రములలో కలపడానికి వీలులేకపోవడంచేత కొన్నికొత్తకారికలుకల్పించి అధర్వణుడికి అంటగట్టినారు. వీరిద్దరినీమించినవారు మధ్యనుండిన కూకునూరి వారు. వీరు బాలసరస్వతి గారు ఉపపాదించినతీర్మానాన్ని ప్రతిపాదించి తమ ప్రజ్ఞ అంతా ఛందోభాగంలోచూపినారు. ఇక్కడికిలక్షణాలుస్థిరపడ్డవి. ఇదంతా కావ్యభాషానుశాసనమే అనగాపద్యకావ్యాలకే అన్నమాట. ఈలక్షణాలు ఈలాగుఉంటూఉండగా, ఈలక్షణాలు చాలవనిపిస్తూ నన్నయభట్టుగారు భారతం ఆరంభించినది మొదలుకొని, పోగాపోగా లక్ష్యస్వరూపమైన కావ్యభాష స్థిరపడ్డది. కాని ఈకావ్యభాషకుకలిగిన స్థైర్యము ప్రవాహనిత్యత్వమువంటిదే ఐనది. ఈస్థైర్యానికి భంగం కలిగించడానికి సాహసించినవాడు శ్రీనాథుడు. తరువాత పెద్దచేయి శ్రీకృష్ణదేవరాయలు. కాని దీనిలో బిరుసువేసుకొన్నవాడు చేమకూరవాడు. ఇక్కడికి అప్పకవిగారి అహోబలపతిగారి కాలం వచ్చింది. అనగా అప్పకవి అహోబలపతిగార్లు తాళ్లువేసి జారిపోకుండా లక్షణాలను బిగించినకాలం లోనే ఆలక్షణాలు ఒదులుచేసినవాళ్ళుకూడా పుట్టినారన్నమాట. ఈలక్షణాలగొడవంతా కావ్యాలకే. కావ్యేతర వాఙ్మయము- అనగా కథలు, వ్యాఖ్యానాలు, శాస్త్రములు, చరిత్రములు ఈ మొదలైనవన్నీ స్వచ్ఛమైన వ్యవహారభాషలోనే పుట్టుతూఉండేవి. పండితులుకూడా అవి అలాగే వ్రాసుకొని చదువుతూఉండేవారు. ఇంకా రెండురకాలు మిగిలిపోయినవి. అవి కావ్యాలూకావు కావ్యేతరాలు కావు. అవి శతకాలు, పాటలు. శతకాలు, పాటలు కావ్యాలలో చేరలేదు. కాని కావ్యేతరాలు కూడా కావు.

ఇప్పటి ఖండకావ్యాలకూ వీటికీ మేనత్తమేనమామపిల్లలరూపేణ సంబంధం ఉన్నట్టు కనిపిస్తుంది. కాబట్టి కొన్నిపోలికలుకూడా ఉన్నవి. ఇవి మధ్యరకానివికాబట్టి, వీటిలో కావ్యభాషంత బిగిగా ఉండనటువంటిన్నీ, కావ్యేతరభాషంతవదులుగా ఉండనటువంటిన్నీ, ఒకనడిమిరకంభాష ఉంటుంది. అందులో, శతకాలు కావ్యాలకంటే వదులుగాఉండి, ఎక్కువవాడుకమాటలు కలిగిఉంటాయి. పాటలు వచనాలకంటే బిగువుగాఉండి, ఎక్కువ ప్రాచీనాంధ్ర గ్రంధములలోని మాటలు కలిగిఉంటాయి. అనగా, నాఉద్దేశం, శతకాలలో వాడుకమాటలు నూటికి 50 వంతువనున్ను, పాటలలో వాడుకమాటలు నూటికి 75 వంతుననున్నూఉంటవి. ఇప్పటికి తేలినవిషయమేమంటే, అప్పకవి, అహోబలపతిగార్లు లక్షణాలను ఒకప్రక్క స్థిరపరచడానికి ప్రయత్నిస్తూఉన్న రోజుల లోనే, కావ్యభాషలో నూటికి 25 వంతున వాడుకమాటలున్ను, శతకాలలో నూటికి 50 వంతువాడుక మాటలున్ను, పాటలలో నూటికి 75 వంతు వాడుకమాటలున్నూ, వచనరచనలలో నూటికి నూరు వాడుకమాటలున్నూ, అటఉండేవన్నమాట. ఇక, అప్పకవి, అహోబలపతిగార్ల అనుశాసనం ఎవరికోసమో బోధపడలేదు.

ఈసంప్రదాయాన్ని అనుసరించే త్యాగయ్యగారును, సారంగిపాణిగారును తమ ప్రథమ చతుర్థభాగాలలోను, గేయరచనచేసినారు. ఈ సంప్రదాయాన్ని అనుసరించే క్రొత్తపండితులు వచనరచనకు

మార్గం చూపించినారు. త్యాగయ్య, బ్రౌను, సారంగపాణిగార్ల కాలంలోనే ఇంగ్లీషు పాఠశాలలు వచ్చినవి. వాటిలో చెప్పడానికి వచనగ్రంథాలు కావలసివచ్చింది. వాటిని నిర్ణయించే అధికారం చిన్నయసూరిగారిచేతిలో పడ్డది. ఆయన అరవదేశపు తెనుగుపండితుడు కావడంచేత, తెలుగుదేశంలో ఉన్న తెలుగు మాట్లాడ ఎరిగినవాడు కాడు గనుక ప్రబంధాలలో ఉన్న వచనాలే వచనరచన అనుకొని, వచనరచనా సంప్రదాయం తెలుసుకోలేక, కావ్యభాషకు అప్పకవి అహోబలపతులు నిర్ణయించినపద్ధతే వచనరచనకు కూడా నిర్ణయించి, నీతిచంద్రిక లక్ష్యప్రాయంగా వ్రాసి, ఆచార్యత్వము సార్థకం చేసుకొన్నాడు. దీనినే సీతారామాచార్యులుగారు మరికొంత విపులము చేసి, తమప్రాధత్వమును స్థిరపరచుకొన్నారు. పూర్వపు నన్నయ్య అథర్వణులవలె, మధ్యకాలపు అప్పకవి అహోబలపతులవలె, ఇప్పటి చిన్నయ్య సీతారామాచార్యులు వ్యాకరణాచార్యులైనారు. బ్రౌనుదొరగారి పద్ధతి మూలబడ్డది. త్యాగయ్య సారంగపాణుల పద్ధతి అడుగంటింది. కావ్యాలు, శతకాలు, పాటలు, కథలు, వంటపాటలు, కల్లుపాటలు, కామమ్మకథలు - అన్నీ చిన్నయ్యవారి పాత్రలో పోసి, శుద్ధిచేసి, పవిత్రములుగా చేసినవే. వెనక, కవులకు స్వేచ్ఛ ఉండేది. సభలలో ఎవరో ఏదో ఆక్షేపణ చేస్తే ఎవడో తలమాసిన పూర్వకవిప్రయోగం చూపించి నోరుమూయించేవారు. కాని చిన్నయ్యగారి అనుశాసనం చాలాగొప్పది. అది తాతాచార్యులగారి ముద్ర. యూనివర్సిటీవారి చేతికి వచ్చింది. తప్పువ్రాస్తే అడిగేవాడు, సమాధానం చెప్పేవాడు లేడు. పరీక్షలో ఫైలు కావడమే. అందుచేత ముద్రిదిట్టంగా పడవలసినదే. కాబట్టి ఇంగ్లీషు చదువుకొన్నవారు ఎక్కువ అయినకొద్దీ చిన్నయగారిబలము ఎక్కువ అయినది. ఇంగ్లీషు చదువుకొన్నవారే మార్గదర్శులు అయినారు కాబట్టి, ఇంగ్లీషురాని బోడిబాపనపండితులు కూడా ఇంగ్లీషురాకపోవడం తమకొకలోపమన్న భ్రాంతిచే ఏ విధముగా తెలిసీ తెలియని ఇంగ్లీషు పదాలు ప్రయోగిస్తూ పవిత్రమైనామని అనుకొంటూ ఉండేవారో, ఆ విధముగానే చిన్నయ్యగారి వ్యాకరణమే ఉత్తరాలలోకి సభలలోకి కూడా దింపి పవిత్రులైనామనుకొన్నారు. కాని ఇదివరకే చెప్పినట్టుగా ఒకపక్క బిగించికొన్నామని కొక్కొండ వేదము ప్రముఖమనుకొనుచుండిన కచ్చ మరొకపక్కనుంచి విడిపోనారంభించినది. చివరకు శ్రీరామమూర్తిపంతులుగారు ఈ బండారమంతా బయలుచేసి ఇక్కడికిది చాలును తిరిగీ వెనకకు పదండని. కుర్రవాళ్లను వెనకకు త్రిప్పి, మళ్లీ సరియైన త్రోవలో పెట్టినారు కాబట్టి, నేటివ్యవహారరచనలన్నీ సనాతనసంప్రదాయానికి ఎంతమాత్రము విరుద్ధములు కావు. నడుమవచ్చిన చిన్నయ్యగారి మతమే సంప్రదాయవిరుద్ధమైనది.

ఈ సంగతి యూనివర్సిటీవారు ఇంకా తెలుసుకోలేకపోవడానికి కారణమేమో.

చిన్నయ్యసూరిగారికి సమకాలికులై చిన్నయ్యసూరిగారిని లక్ష్యము చేయనివారిలో సారంగపాణిగారొకరని చెప్పినాము. వీరు ప్రథమచతుర్థ భాగములలో, త్యాగయ్యవరకూ వచ్చిన గేయకవిత్వ సంప్రదాయము ననుసరించి, నూటికి 75 పాళ్ళు వాడుకమాటలువేసి పాటలన్నీ రచించినారని చెప్పినాము.

చతుర్థభాగపు జాతీయరచనలలో వారికాలము నాటి నీచపాత్రలభాషలో రచించినారని చెప్పినాము. ద్వితీయభాగపు దేశీయరచనలలో శిష్టజనవ్యవహారసిద్ధమైనభాష ఉపయోగించినారని వ్రాసినాము. ఈభాగమంతా మధురమై, రసవంతమై, పాత్రోచితమై, సర్వవిధముల శ్లాఘాపాత్రమై యున్నది. సారంగపాణిగారు ద్వితీయభాగంలో అనుసరించినభాష నేటి రచనలకు లక్ష్యప్రాయమై యున్నది. కాబట్టి మరి రెండు మాత్రమే మళ్ళీ మచ్చు చూదాము.

రాగము - అపరూపము - చాపుతాళము.

పల్లవి - అట్లాగే కొనలె దానికి - హైశ్యావాసు - నాడు
అను...కొట్లాడిం దెరుగవటే - వేణు - గోపాలుని పిలువవద్దంటే
చర...1. వడ్డికి చేయుమని యూకలు - గుడ్డలో గట్టియ్యాగాని
సొడ్డు నెత్తిన చేసి యురికె - జిడ్డు మొన్నటితోనే విడిచె - అ.
2. కలభూషణములన్ని ముడిచి - తలమాదున వుంచుకొంటే
మెలకువగా అంటుకొని - జరిగె చిలుము నిన్నటితోనే విడచె
3. పందుకొనేవుండి - పక్కలో పయిపనులన్ని చక్కబెట్టి
కుండలు చట్లన్ని జలగడిగి - ఉండింది పండింది ఊడ్చుకొపోయె - అ.

రాగము - కన్నడ - ఆదితాళము.

పల్లవి - ఒకధూపములేదే - నీసాక్షిగ - ఒట్టిపైబూటకమే నే - యేమో
అను...ఇక ముందర ముత్యాలకుళ్లాయి యెన్నడో పెట్టేనట - ఇప్పుడు -
చర...1. కానవినాసవతులు ఊళ్లో - కల్పించేందుకు దొడ్డాశ్చర్యము
కానావున్నది రామాయణమిది-లోని గుట్టు పెరవాళ్ళకు తెలివిడి
2. గుడుగుడుఆలోచనలేకాని - కోమలి నే నొక పోణిమి యెరుంగను;
అడిగితెలుసుకొని పిమ్మటకాదను - తడకుదాసరిప్రతిష్ఠవంటిది
3. ఏణాక్షిరో - యీసాంబ్రాజ్యానికి - యేమిటికే గాంధారితనాలు;
వేణుగోపాలుడు ననుగూడి - వెళ్లవుంగరాలిచ్చేన నేడు - ఒకధూ.

రాగము - కేదారగౌళ - ఆదితాళము.

పల్లవి - ముసిలిబడుగుమీద యెంతమోహామే - ముదితరో నీకు - మదిలో
అను...అసమశరుడనుచు వుప్పొంగితివో - అన్నిటికీ కొసుగదా దొడ్డది
చర...1. తల మొల కడశాళ్ళ నెరిసిపోయె - దగ్గిదగ్గి హీనస్వరమాయె
పిలిచినాను చెవివినరాదాయె - బలముఉడిగితప్పటడుగులాయె
2. రాతిరైతే - రేచీకటి కదలను - రమణీ నీబిగికౌగిలివదలడు;
మాటమీదబట్ట యేమారడు - ముష్టివకరికైనా వేయనీయడు ముసిలిబడుగు...

ఈలాంటి రచనలలో భావాలు ఎంత స్వభావసిద్ధంగా ఉన్నవో భాష అంత సహజంగాఉన్నది. ఈ భావాలు మనుష్యతత్వంలో మారకుండా చాలాకాలం ఉండవలసినవే. ఆ భాషకూడా చాలా కాలం మారకుండా మనోహరంగా ఉంటుంది. శ్రీరామమూర్తిపంతులుగారు తమ వాదమును ఆరంభించినప్పుడు వారి భావవీధిలో ఉన్నది ఈలాటిభాషయే. శ్రీరామమూర్తిగారు సారంగపాణి పదాలు ఎరుగుదురో ఎరగరో నేనుచెప్పలేను. కాని సారంగపాణిగారు ద్వితీయభాగరచనలో లక్ష్య రూపంగా చూపిన భాషయున్ను రామమూర్తిగారు వాదనలలో స్థిరపరిచిన భాషయున్ను ఒక్కటే. కాబట్టి. సారంగపాణిగారిలోఉన్న నూతనత్వానికిన్ని, రామమూర్తిగారిలోఉన్న ప్రాచీనత్వానికిన్ని మనము అభినందించవలెను.

౬౧

సారంగపాణిగారి పదములను విపులమైన టీకతో తిరిగి అచ్చు వేయవలసియున్నది. ఈమనోహరరచన లోకంలో శాశ్వతంగాఉండవలసియున్నది. అలాగే క్షేత్రయ్యగారి పదాలన్నీ అచ్చువేయవలసిఉన్నది. క్షేత్రయ్యగారు రచించిన పదములసంఖ్యనుగూర్చి వారే యీక్రిందివిధముగా చెప్పుకొన్నారు.

మే రు వు ప ద ము

యదుకులకాంభోజి - ఆదితాళం.

పల్లవి - వేడుకతో నడచుకొన్న విటరాయు
డేడుమూడుతరములనుండి - యెందున్నకానాచట

అను...కూడుకొని - మువ్వగోపాలుడు - కృప గల్గ నావిభుడు

చర...1. మధుర తిరుమలేంద్రుడు మంచిబహుమానమొసగి
యెదుటకూర్చుండుమని - యెన్నికలిమ్మనగను
యిదిగో రెండువేలపదము లెంచుకొమ్మనగ
చదురుమీదనున్నసామికి సంతోషమింతంతగాదు

2. వాళిమీర - తంజావూరియచ్యుతవిజయ రాఘవేంద్రుని
సాలుమనుష్యుల వెంబడి - సరస పాడగాంచి - చలువచప్పరములో
చక్కగా వెయిపదములు పలుకరించగాను - బహుమానమిప్పించె నావేళ

3. గోలకొండ పవాదుషాకొక వేయి విలిచి - తోళసిమూరివారు
పిలిచినవేళ - వెలయ మువ్వగోపాలుడు వెయ్యిన్నేనూరుపదములు
నలువదిదినములలోగా నను గలిసి వినిపించెనే - వేడుక

క్షేత్రయ్యగారు రచించినవి వేలకొద్దీ పదములుకలవని వారిమాటలవల్లనే తెలుస్తూఉన్నది. ఇవేవీ ఎక్కడాకనబడవు. నావద్ద - నూరు నూటయేబది మాత్రమే కలవు. ఇవి ఆంధ్రసారస్వతానికి నిజమైన ఆభరణాలు. ఈలాగే ఇతరగేయకారకులైనఘట్టుపల్లివారు బొల్లవరపువారు శోభనగిరివారువీరభద్రయ్యగారు తాళ్ళపాకవారు మాతృభూతేశ్వరులవారు జటపల్లివారు ఇనుకొండవారు శివరామపురమువారు మెరటూరివారు కోసలపురివారు దీక్షితులవారు శ్యామాశాస్త్రులవారు సుబ్బరాయశాస్త్రులవారు వీణకుప్పయ్యగారు ఈమొదలగు గేయకావ్యకర్తల గ్రంథాలన్నీ అచ్చువేసి ప్రాచీనాంధ్రసారస్వతములో ఉన్ననూతనత్వము చూపించి ప్రబంధవాఙ్మయమువల్ల కలిగినమార్పున్ను చిన్నయ్యసూరిగారివల్ల కలిగినహానిన్నీ లోకమునకు తెలియచూపి నిజమైనఆంధ్రసంప్రదాయాన్ని లోకంలో స్థిరంచేయవలసినదనిన్నీ అనుసరించవలసినదనిన్నీ ప్రార్థిస్తూఉన్నాను. సారంగపాణిగారికీర్తి లోకంలో ప్రకాశించేటట్టు చేయవలసినదని ఆంధ్రులందరినీ ప్రార్థిస్తూఉన్నారు. సత్యము జయించునని విశ్వసిస్తూఉన్నాను.

# "సంధిపంచకము"

కోమాండూరి కృష్ణమాచార్యులు

సాతవాహనుఁ డొక్క వసంతసమయ
వాసరంబున జలకేళివాంఛ నొదవ
వేడ్క నుపవనసీమ వాపీజలావ
గాహన మొనర్పనరిగె నంగనలతోడ.

తొడవులను దీరముననూడ్చి తోయజాక్షు
లతనుఁ దొరనుండి తిగిచిన యసిలతికల
పగిది రాజేంద్రుహృదయంబు పల్లవింప
శిశిరవాఃపూరములఁ బ్రవేశించిరపుడు.

ధవళనిశ్వాసహారివస్త్రములు దడిసి
మేననంటిన నొప్పిరి మెలతలెల్ల
మందరాచలకోణ నిర్మథితదుగ్ధ
శరధితరఁగల నెగయునచ్చరలనంగ.

నిర్మలోదకముల మహీనిర్జరేంద్రుఁ
డంబుజాక్షులతోఁగూడి యపుడువొలిచె
విమలగ్రహతారకాసమూహములలోనఁ
దేజరిల్లెడుపూర్ణిమాత్రేయుఁడనఁగ.

సాలతుంగతనుండైన జనవిభుండు
అంసదఘ్నాంబువులలోన నపుడు నిలువ
తనకునంతియులోతని తరుణి జేర
మున్గెదవు సుమ్మటంచు విభుండు వల్కె.

రమణులంతట కరపుష్కరంబులెత్తి
విభుని పై చల్లులాడిరి వేడ్కతోడ
బాహుమూలద్యుతులు గాంచువాంఛ తేఁడు
వారిపైఁ జల్లె వారి నవ్వారిగాఁగ.

జలజనేత్రలు విభుతోడ జల్లులాడ
నైపథాలక "మోదకైస్తాడయార్య
పుత్ర" యని పల్కె రప్పుడా భూవిభుండు
పిండివంటలు వేగఁ దెప్పించెనపుడ.

వార లవి గాంచి రాజేంద్ర వారికేళి
సమయమున మోదకముల ప్రసక్తి యేల ?
యనిన మీరలు గోరితి రబలలార !
కానఁ దెప్పించినాఁడ నిక్కాలమందు.

అని విభుడు వల్క వార లత్యంతహాస
ముఖరితాస్యాబ్జలయి విభుమోము జూచి
సంధిపంచకమైనను జదువనట్టి
జడవిభులపజ్జ మౌనంబ సరసమనిరి.

భూవిభుండప్డు లజ్జ నెమ్మోము వాంచి
పలుకనేరక మౌనియై వలువలపుడ
తాల్చి తనయనభిజ్ఞతఁ దలచి తలచి
చింతనొందుచు భవనంబు నేరనరిగె.

# ఈనాడు

బొడ్డు బాపిరాజు

చిదుమం జీకటి గారు ఈరొందద పూచెఁ శారదజ్యోత్స్న; లో
నదుమన్ రాణివిషాదదావమున నల్లల్లాడి మ్రోడైన దీ
బ్రదుకెల్లం దళుకొత్తె గ్రొంజివు రెలర్పన్, నేటిసంతోషసం
పదలం దాచుకొనంగ యీ యులతిహృద్భండారమే చాలునా ?

అలజడి రేపు పీడకల యట్లు గతానుభవం బొకప్పుడే
పలుచనినీడలాగొ కనుపట్టునుగాని, సుకమ్ము వేయిరే
కుల విరబూసి నేడు బ్రదుకున్ మరపించుచునుండ లోకమే
తలపనిచిత్త మేటికని త్రవ్వుకొనున్ కదచన్నరోజులన్ ?

వాడినపూవురేకువలె వాంఛ యొకొక్కటి రాలిపోవ రా
పాడినదుఃఖవుంబెనుతుపానులు నే డిక లేవు ! హాయిగా
పాడుకొనంగ పచ్చికలపట్టులు, వెన్నెలరేలు, తావు లో
లాడెడిపూలతోట లడుగంటనిపూర్వపుజెల్మి పిల్చెడిన్.

మునుపొకనాడు 'శోకమయమ్ముఁ, గరుణాజనకమ్ము, నిష్ప్రయో
జన' మని మాటికే బ్రదుకుసంగతి మ్రోసెనో హృద్విపంచి యీ
దినమున కోరి యీబ్రతుకె 'దివ్యతమ' మ్మనుచుఁ కలస్వన
మ్మున పలికించుగీతిచయమున్ భువనశ్రుతిమంజులమ్ముగన్.

పూచినమల్లెపూలవలపుల్ దెగద్రావినచల్లగాలితో
లేచినక్రొత్తయామిని దలిర్చిననిందుబెదందకుఁ సుధా
నేచునమర్యో నీకులుకు చిందెడిచూపుల నీలిరేక, పా
పా ! చిరునవ్వుతో హృదయభారము నెప్పుడు తీసివైచితో !

హృదయములు కోసి యిచ్చినట్లిచ్చినావు
కాలమనువెద్దనైతానుకరములకును
ప్రణయఫలముల రెంటి నీ పలుకులోన
ఆలకింతుము మూడు కంఠాలు బిడ్డ !

# ఏకాకి

## తల్లావఝ్ఝల కృత్తివాస తీర్థులు

మా నాన్న కళాశాలలో ఉద్యోగం చేస్తున్నాడు. అరిటిపండు వొలిచి చేతులో పెట్టినట్టు చక్కగా బోధిస్తాడు. కళాశాలలో దేశీయ భాషలు చెప్పేపండితులను, అధికారులు చిన్న చూపు చూస్తారు. మాకు ఉన్నదేదో పూర్వమే ఖర్చయిపోయింది. ఆయన జీతం తెస్తేనే మాకుటుంబ పోషణ జరుగుతుంది. మా చెల్లాయీ, నేనూ చూసిందల్లా కావాలని మారాము చెయ్యం. పొరుగింటివాళ్ళు చేసుకొనే సరదాలు చూసి సంతోషిస్తాము. అమ్మఐనా ఉన్నదాంతో సంతృప్తిపడే స్వభావమే. నగలు నాణ్యాలు, చీరలు మొదలైనవి కావాలని ఎప్పుడూ అడిగి ఎరగదు. ఇల్లు కళకళ లాడేట్టు ఆనందధామముగా చేస్తుంది. ఆ తల్లి చల్లనికారుణ్యమే లోకకళ్యాణానికి హేతువు!

పదిగంటలయినతర్వాత భోజనం చేసి, బట్టలు కట్టుకొని తమలపాకులు నములుతూ కాలేజీకి వెడతాడు. అమ్మ నాకూ చెల్లికి అన్నాలుపెట్టి ఇంటి పనులు పూర్తిచేసుకొని, చెల్లికి తలదువ్వి జడవేసి, అమ్మాయికి గుణింతాలు దిద్దబెడుతుంది. నాకు 'సరస్వతీవాచకం' చెపుతుంది. చూచిరాత రాయించడం, లెక్కలు చేయించడం, పాతపాఠాలు వప్పగించుకోవడంతో రెండు గంటలు పడుతుంది. అమ్మాయికి తిథులపేర్లు, వారాలపేర్లు, ఋతువుల పేర్లూ, మాసాలు చెబుతుంది. అమ్మ కాపరానికి రాకపూర్వం నేర్చుకొన్న అధ్యాత్మరామాయణంలో కీర్తనలు, యక్షగానాలలో పాటలు, కృష్ణలీలాతరంగిణిలో తరంగాలు చెల్లాయికి నేర్పుతుంది. చెల్లికి చిన్నతనం కనక పాటఫలితం చప్పున ఒడికడికాదు. గదిలో పరువుల దొంతరమీద కూర్చుని సన్నని గొంతెత్తి నాటకాలలో పద్యాలు, పాటలూ, మట్లూ, గీతాలు శ్రావ్యంగా పాడుకొని నాలో నేను పొంగిపోతాను. అమ్మ కోపగిస్తుందేమోనని భయం. పలకమీద లెక్కలు చెయ్యమనిఇస్తే బొమ్మలుగీస్తూ నేను దెబ్బలు తినడం మామూలు. ఎన్ని దెబ్బలు తిన్నానో అమ్మచేతులో. నాన్న యింటికి రావడముతోనే నేను చేసిన అల్లరి, పాఠాలు తిన్నగా చదవక లెఖలు చెయ్యకపోవడం తంతు నాన్నకు పూసగుచ్చినట్టు చెపుతుంది. తలుపుచాటున నక్కి నాన్నముఖవైఖరి చూస్తూ కొడతాడా ఏమిటి చెప్మాఅని అనుమానిస్తూ నిలబడ్డాను. నన్ను తనదగ్గిరికి రమ్మని నాన్న పిలిచాడు. భయంతో దగ్గిరికి వెళ్ళాను. ఆయన కోపం మేఘాలవలె చెదిరిపోయింది. 'కొప్పడడం ఎలాగో తెలియదు' మానాన్న ఇలా అనేసరికి, "మీరు మరీ వాణ్ణి ఎందుకూ పనికిరాకుండా చేస్తున్నారు! బొత్తిగా చెప్పినమాట వినడాయిరి. ఇంకా నెత్తి నెక్కించుకొంటారేం" అని విసుక్కుంటుంది అమ్మ. నాన్న పరమశాంతంగా ధ్యానబుద్ధుడువలె వుంటారు. చిరునవ్వుతో అమ్మకు సమాధానమిస్తాడు నాన్న. ఆయన నన్నుగాని చెల్లినిగాని గట్టిగా మందలించి ఎరగడు.

అమ్మంటే నాన్నకు చాలా ప్రేమ. తన నిండు హృదయంలో అమ్మకు శాశ్వతమైనతావు యిచ్చినాడు. ఆయనసాహచర్యమువల్ల అమ్మకు చక్కని సంస్కారము ఏర్పడ్డది. తరుచు ఆయన గ్రంథావలోకనం చేస్తుంటే, అమ్మ చాలా విషయాలు నాన్నవల్ల గ్రహిస్తుంది. నాన్నదగ్గిర కావ్యాలు పాఠం చెప్పుకొన్నది. ఆయన గ్రంథం చెబుతుంటే అమ్మ రాస్తుంది. ఆయనలేఖిని అనాతంక గతిని వెళ్ళడానికి అమ్మసహాయం ఎంతో అవసరం.

మధ్యాహ్నం నాన్న కాలేజీ కెళ్ళాక, అమ్మ లేసు అల్లుకుంటూ గుమ్మందగ్గిర కూర్చుని నాన్న రాకకై ఎదురుచూస్తుంది. సాయంత్రము కుర్రాళ్ళకు పాఠాలు చెప్పడం అయిపోయాక విసుగుతో నాన్న యింటికి వస్తాడు. ప్రసన్నమైనముఖంతో, చిరునవ్వుతో నాన్నకు ఆహ్వాన మిస్తుంది. కాలేజీలో పడ్డ శ్రమ మరిచిపోతాడు. విశ్వం యావత్తు నిత్యనూతనమై రమణీయమై తోస్తుంది ఆయనకు.

నాన్న వాకిట్లో కుర్చీలో పడుకొని, చెల్లిని పొట్టమీద పడుకోబెట్టుకుని, దూరాన మినుకు మినుకు మనే నక్షత్రాలనుగురించి ఎన్నో కథలు చెబుతాడు. చీకట్లో గరుడవర్ధన కలయపూచి నక్షత్రాలవలె పువ్వులు రాలుస్తుంటే నాన్నకు వింతభావాలు తోస్తవి. ఎన్నోకథలు అల్లి చెల్లికి చెబుతాడు. నేను నాన్నకు కొంచెం దూరంగా వుంటాను. అంత చనువులేదు. ఎప్పుడో కాని నన్ను దగ్గిరికి పిలవడు నాన్న. నేను అల్లరిచేస్తానని కోపమేమో; ఆయన కోపమే ఎరగడు; అమ్మ వంటింట్లో శ్రావ్యంగా పాడుతుంటే; వాకట్లో కూర్చున్న మాకు వినిపిస్తుంది, కూరపోపువేస్తున్నప్పుడు చుంయిమని అంటూవుంటే అమ్మ తనలో తాను పాడుతూ వుంటుంది.

౨

జీవితం ఎప్పుడూ ఒకమాదిరిగా వుండదు. జీవన సంగీతము శ్రుతి అపశ్రుతులమేళన. నాన్నసంపాదన యింటిఖర్చుకు చాలడంలేదు. ఇంటికి వచ్చేపోయే బంధువర్గంవల్ల మాకు ఖర్చు. దానాలనీ ధర్మాలనీ ఎవరో వకరు వస్తూంటారు. నాన్న లేదనడు. దగ్గిర కానీ లేకపోతే తొడుక్కొన్న కొత్త చొక్కాగాని; ఉత్తరీయం పైన వేసుకొన్నదిగాని తీసి వాడి కివ్వవలసిందే. కాపరం గడవడం కష్టంగావుంటున్నది. పోనీ; వారంకుర్రవాణ్ణి మానిపిస్తాడా. "నేను భోజనం పెట్టలేను. మరోచోట చూసుకోండి" అని అనడానికి నాలుక రాదు ఆయనకు; అమ్మకు మరీ మొంగమాటం; ఎవరిమనసూ కష్టపెట్టదు.

కొట్టుమీద బాకీ పెరిగిపోతున్నది. నాన్నకు ఎప్పుడూ నిర్విచారమే. జీవితంలో ఎన్నిమార్పులు వచ్చినా ఆయన లెక్ఖచెయ్యడు. సంసారంలో కుమ్మరిపురుగువలె అంటీఅంటనట్టు వుంటాడు. అమ్మ ఒక్కొక్కప్పుడు నాన్నను చూసి వింత పడుతుంది.

వారంరోజులనుంచి చెల్లికి జ్వరం కాగిపోతున్నది. అమ్మకు ఏమీ తోచడంలేదు, కార్తీక శుద్ధ దశమినాడు కన్నుల్లో చెల్లాయి ప్రాణాలు వదిలేసింది. ఆమె కడసారిముద్దుపెట్టుకోబోయింది. ఆమెపెదవులు మృతదేహాన్ని తాకినవి; కనుకొలుకుల్లో మంచువంటికన్నీరు నిండి; జన్మకూ మృతికీ మధ్య తెరవలె అయినది. కొంతసేపు కొయ్యబారింది; చెల్లికళ్ళు పదేపదే ముద్దుపెట్టుకున్నది. చిన్న జడలో వాడిపోతున్న పువ్వులు చూసి మరీ ఏడ్చింది. నాన్న క్షణంసేపు శూన్యమైన ఆకాశం వైపు చూశాడు. ఎవ్వరితోనూ మాట్లాడక గదిలో కూర్చుని రాలిపోతున్న నక్షత్రాన్ని చూసి నిట్టూర్పు వదలినాడు. జీవితం స్వప్నాలఅల్లికవలె తోచింది. అనంతమైన మృత్యువు శూన్యమైననోరు తెరిచి కోట్లకొద్దీజీవరాసులను దాహం తాగేస్తున్నది. జీవితం సింహావలోకనం చేసుకొన్నాడు. అసంతృప్తి; వెగటూ అనుభవించాడు.

చెల్లి చనిపోవడంతోటే ఇరుగుపొరుగువాళ్ళు అమ్మదగ్గిరికి వచ్చి పలుకరించి; ధైర్యంచెప్పి పోతున్నారు. అదివరకు మేమంటే యిష్టపడనివాళ్ళు మాకు దగ్గిరైనారు. మానాన్న సంఘసంస్కారప్రియుడనీ, మాఅమ్మకు మడీ ఆచారాలు లేవనీ; అనుకొనే ఇరుగుపొరుగువాళ్ళు ఇప్పుడు మాయోగక్షేమాలు తెలుసుకొని జాలిపడుతున్నారు.

అమ్మహృదయం కుమిలి కుమిలి పోతున్నది. ఏపనిచేస్తున్నా ఆ చిన్నారి ముద్దుమొహం ఆమె

తలపుల్లో ప్రతిబింబిస్తుంది. అమ్మాయి రాసుకొనే పలక; ఆడుకొనే వస్తువులూ చూసినప్పుడు ఆమె పడ్డ బాధకు మితిలేదు. ఆ ముద్దుమాటలు ఆవింత నడకలు అకిలికిలాడే చురుకైన కళ్ళూ ఆ చిన్ని జడా అమ్మ మరచిపోలేదు.

ఇంటిపని చేసుకోలేక పోతున్నది. పనిమనిషిని పెట్టుకోడానికి డబ్బులేదు. పరామర్శ చేయడానికి వచ్చి రోజులతరబడి బంధువులుంటున్నారు. అందరికీ చేసిపెట్టలేక పోతున్నది. పిల్లపోయిన బెంగ వల్ల; సంసార తాపత్రయంవల్ల అమ్మ వాడిపోతున్నది. ఓపలేనిది కావడంవల్ల పని చెయ్యలేక పోతున్నది.

నేను పుట్టినతరువాత ఇదే మొదటిసారి మృతితో పరిచయం. పోనీ ఏతమ్ముడో చెల్లాయో మళ్ళీ పుడుతుందికదా, కొంతవరకు నాబెంగ తీరుతుందనుకొన్నాను. అమ్మకు ఈడువచ్చిన ఆడపిల్ల లేక పోవడంవల్ల నేను కొంచెం పనికి అదుకొనేవాణ్ణి. అమ్మకు తిన్నతిండి అరగడంలేదు. వేవిళ్ళు పట్టుకొన్నవి. ఆరోగ్యం తిన్నగాలేదు. ఎనిమిదో నెలలోనే అమ్మకు నొప్పులు రావడం అరంభమైనవి.

నాన్న అంతగా బాధపడుతున్నట్టు పైకి కనపడడు; ఆ గంభీరమైన హృదయంలో ఎన్నో వేదనలు తరంగాలవలె పొంగుతూవుంటై. బొత్తిగా లేవలేక మంచంపట్టింది అమ్మ. నాన్న వంట చేసిపెట్టి కాలేజీకి వెడుతున్నాడు.

ఒకరోజు అమ్మకు నొప్పులు ఎక్కువైనవి. నాన్న కాలేజీలో వున్నాడు కాలేజీకి పోతున్న కుర్రాళ్ళద్వారా నాన్నను ఇంటికి రమ్మని కబురు పంపించాను. పొరుగింటావిడ అమ్మదగ్గర కూర్చుని ఏమిటో చెబుతున్నది. నాకు ఏమీతోచలేదు. నాన్న వచ్చాక కొంచెం ధైర్యం వచ్చింది; అమ్మ నాన్నకేసి చూసింది.

"డాక్టరు వస్తున్నాడు...ఏమీ ఫరవా" మాట్లాడలేక పోయినాడు నాన్న. మంచందగ్గర కూర్చున్నాడు. అమ్మ నాన్న చెయ్యి పుచ్చుకొని ఆ కన్నీటిచారలబుగ్గలమీద దీపంవెలుగు ప్రసరించి మెరుస్తుంటే, "కుర్రవాణ్ణి చూడండి... మీరు బెంగపెట్టుకోకండి" అన్నది.

నాన్న ఏమీ బదులు చెప్పలేక వూరుకున్నాడు; అమ్మతల నిమురుతూ ఆలోచిస్తున్నాడు.

అమ్మ ముద్దియ్యితండ్రీ ! మంచిబుద్ధి కలిగివుండు. బళ్ళో చేరు. నాన్న వున్నారు...ఫరవాలేదు అన్నది. క్షణంఆగి "అలాగేనమ్మ" అన్నాను. నాకళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగినవి. అమ్మ నాబుగ్గలు నిమిరి ముద్దుపెట్టుకొన్నది. ఇప్పుడు చెల్లాయి వున్నట్టయితె ఏమనుకొనేదో. అమ్మ తిరిగి వస్తుందనే వారం రోజుల్లో యథాప్రకారం కాపురం సంతోషంగా గడిచిపోతుందనీ అనుకోవచ్చు. నాన్న చెయ్యి దగ్గిరకి లాక్కుంటూ అమ్మ జాలిగా నన్ను సుఖపెట్టారు. ప్రేమ చూపారు; మీదయకు...మాట పూర్తికాలేదు.

సమాధినిశ్చలమైన యోగీంద్రుని ధ్యానంలాగ దీపం వెలుగుతున్నది. చాలా ఆయాసంతో వూపిరి పీలుస్తున్నది. నాన్న అమ్మబుగ్గలు ముద్దుపెట్టుకొన్నాడు. రెండు కన్నీటిచుక్కలు అమ్మముఖం మీద రాలినవి. అమ్మపరమపవిత్రురాలైంది. సంధ్య రాత్రిలో కలిసింది. రాత్రి అర్ధరాత్రిఅయింది. నాన్న తన దుఃఖం నమ్మలేక పోతున్నాడు. అలానే అమ్మముఖంచూస్తూ కూర్చున్నాడు. అమ్మ చనిపోయినట్లు గ్రహించనేలేదు. అప్పుడే వచ్చిన డాక్టరు కొయ్యబొమ్మవలె నిలబడ్డాడు.

* *

అమ్మదేహము బూడిదలో కలిసింది ఆ సౌందర్యం, లావణ్యం, మాయమైనవి. బంధువులంతా వచ్చి పన్నెండురోజులుండి వెళ్ళిపోయారు. ఆ శంకర స్పర్శ తలపుకు వచ్చినప్పుడల్లా నాన్న హృదయము స్నిగ్ధమవుతున్నది. నుదుటి కాగితంమీద విధిలిఖితము చెరిపివేయడానికి ఏరబ్బరు పనికివస్తుంది?

ప్రపంచం యథాప్రకారం యంత్రంవలె పని చేస్తున్నది. జీవన్మృతులు విశ్వయంత్రంలో పిండి. నాన్న అమ్మకు భౌతికంగా దూరమైరోజులు గడిచినై. వారాలు నెలలు గడిచినై.

అమ్మ బతికివుండగా నాన్న ఎంతో ప్రేమించినాడు. కాని తగినంతగా ఆమెప్రేమకు కృతజ్ఞత చెప్ప లేకపోయానేమోననీ, వైద్యుడురావడం ఆలస్యమైందే, చికిత్సలేకపోయిందనీ మనస్సులో బాధ పడ్డాడు. ఎనిమిదోనెల అమ్మకు వచ్చినప్పటినుంచీ ఎన్నోమందులు ఇప్పించాడు అయినా చికిత్సలోపం జరిగిందనే అనుకొని బాధపడ్డాడు.

ఈబాధకుతోడు కాలేజీలో ఉద్యోగం పోయింది. కాలేజీక్రైస్తవులకుతప్ప హిందువులకు ఉద్యోగాలు ఖాయపరచరు. సంస్కృతాంధ్రాలుఇంగ్లీషు బడిలో చదువుకొన్న క్రైస్తవుడు రావడంవల్ల నాన్నఉద్యోగం పోయింది.

మనశ్శాంతికోసం ఎన్నో తీర్థయాత్రలు చేశాడు నాన్న. అమ్మ చనిపోయిన శ్మశానవాటికదగ్గరకు వెళ్లవలెనని ఒకేసారి బయలుదేరినాడు.

సాయంత్రం చీకటిపడ్డది. శూన్యమైన ఆకాశములో నక్షత్రరాసులుమిణుగురుల్లాగ మెరుస్తున్నవి. ఆయనచిత్తాకాశముకారుమబ్బులతోనిండిపోయింది. శ్మశానము సమీపించినాడు. గడ్డిదట్టంగాపెరిగి వుండడంవల్ల నక్షత్రాల వెలుగులో మధ్య మధ్య మెరిసే మిణుగురుదీపాలసహాయంతో అమ్మ చనిపోయినస్థలం సమీపించాడు. ఆమెజ్ఞాపకార్థం కట్టించుకొన్న చిన్నస్తూపము చీకట్లో స్పష్టంగాకన పడ్డది. గడ్డిమొక్కలు సమాధిమీద జాలుగా వాలుతూ మంచుకన్నీటినివర్షిస్తున్నది. క్షణంసేపునాన్న శిలావిగ్రహంవలె నిలబడ్డాడు. స్తూపమును చూచినాడు. ఇది నిజమా అబద్ధమా? హృదయంలో దుఃఖతరంగములు పొంగి పరదలైనవి. సమాధిమీద వొరిగినాడు. చేతులెత్తి అస్తూపపురాతిని స్పృశించినాడు. మంచుతో తడిసినగడ్డి హృదయతాపమును చల్లార్పలేకపోయినది. జలజల కవోష్ణదుఃఖాశ్రువులు విరిసి, సమాధిని తడిపివేసినవి.

3

నాన్నను ఇప్పు డేకోరికలూ అంటవు. ప్రకృతిలో రకరకాలమార్పులు ఆయనలో మార్పుతెప్పించ లేవు. సుఖదుఃఖాలు ఆయనునంటవు. చీకటిచాయల మొత్తమువంటి దుఃఖము, విరిసిన మల్లెపువ్వులవంటి వెన్నెలసుఖాలూ ఆయనలో మార్పుతీసుకురావు. రాగద్వేషాలకు అతీతుడైనాడు. ఆమనిమత్తులో ఆనందపరవశులయ్యే మానవులను; దుఃఖానికి కుంగి పోయే బలహీనులను; చూసి వింతపడతాడు.

'జీవితం దుఃఖమయం కాదు. ఆనంద మయమే 'ఆనందాద్ధ్యేవఖల్విమాని భూతాని జాయన్తే; ఆనందేన జాతాని జీవన్తి; ఆనందంప్రయ న్త్యభిసంవిశంతి'' అనుకొంటున్నాడు.

స్వామివారివద్ద సూత్రభాష్యాదులు చక్కగా అభ్యసించినాడు. సంసారబంధము తెంపుకొని సన్యసించినాడు.

నాన్న సన్యసించినట్టు నాకు తెలియదు. తండ్రికదా నన్ను వదిలేస్తాడా అనుకొన్నాను. మామేనమామ నాకు ధైర్యంచెప్పి తనదగ్గరే వుంచుకొంటున్నాడు. సన్యసించినతర్వాత మళ్లీ నాన్న నాదగ్గరికి వస్తాడేమో ననుకున్నాను. ఒకసారివెళ్లి నాన్న ఎలావుంటాడో చూచివద్దామని బండికట్టించుకొని, నేనూ మేనమామా ఊరిచివర మఠందగ్గరకి వెళ్ళినాము. మేములోపలికి వెళ్ళేసరికినాన్న వ్యాసపీఠమీదవున్న భాష్యము చదువుతున్నాడు. ముఖాన బ్రహ్మతేజము వెలుగుతున్నది. కాషాయవల్కలాలు చూచి వింతపడ్డాను. ప్రణామం చేశాము ఇద్దరమూ. నారాయణస్మరణలో మావందనాలు అందుకొన్నారు స్వాములవారు.

“మానవుల అల్పత్వంలో చేరకోను. వాళ్లతో ఏకంకాను. సర్వబంధవినిర్ముక్తుణ్ణి. ప్రపంచంతో నిమిత్తం లేదు'' అని పలికినారు.

నేను స్వాములవారిని పదేపదే చూస్తూ 'నాన్న దూరమైపోయాడే'నని తలపోస్తున్నాను. నాహృదయం విచారంతో నిండిపోయింది. ఆయనదండకమండలాలు చూస్తున్నాను.

కొంతసేపటికి గంభీరంగా "ఇలారా వచ్చికూర్చో" అన్నారు స్వాములవారు.

"మిమ్మల్ని ముట్టుకోవచ్చునా?" అడిగాను.

"నన్నేదీ యథార్థంగా అంటదుకనుక నేనెప్పుడూ దూరంగావుంటాను. నీయిష్టమైతే ఇక్కడ కూర్చోవచ్చు!"

ఎంత కఠినంగా మాట్లాడారు? నాకు చాలా కష్టం వేసింది.

"నన్ను దగ్గిరికి తీసికొన్నతరువాత మళ్ళీ నన్ను వదిలెయ్యరుగాదూ?" అని అడిగాను కన్నీళ్లతో.

"బిడ్డా; కళ్ళుతుడుచుకో; నేను సన్యాసిని. నా హృదయంలో రాగద్వేషాలకు తావులేదు. పూర్వాశ్రమంలో మనకు సంబంధం వున్నది. ఇప్పుడు నీలి మబ్బులతో వున్న ఆకాశం ఎంతో; నువ్వు నాకంతే."

"నాకు దిక్కులేదు. మీదగ్గిరే వుంటా"

"ఈశావాస్యమిదం జగత్. దేవుడే దిక్కు. నా దగ్గిర వుండవచ్చు కాని నాదగ్గిరికి మరీ రాలేవు."

"ఆమాటలు అర్థంకాలేదు. నా మేనమామ నన్ను వదిలేసి వెళ్లిపోయాడు. ఆరాత్రి మఠంలో సన్యాసిఅయినతండ్రిదగ్గర మాట్లాడుతూ నిద్రపోయాను.

కుర్రవాడు పడుకుంటే సన్యాసి వెలుగుతున్న నిష్కంపమైన దీపంకాంతిలో చూచాడు. "అబ్బాయికి నిద్రపట్టింది. నాకు ఎందుకీమమకారం. ఇవన్నీ ప్రకృతి అల్లిన సాలిగూళ్ళు. ప్రమాదం మిడతలకుగాని నాకు గాదు" అనుకొని ఉంటాడు స్వాములవారు.

నాకు నిద్రమెలకువ వచ్చింది! నాతండ్రి నన్ను వదిలేసి వెళ్లిపోతున్నట్టు కలవచ్చింది.

"వదిలిపెడతారా?"

"వదలను"

"నామీద ప్రేమలేదా!"

"వెర్రివాడు! తనను ప్రేమిస్తున్నానని ఊహిస్తున్నాడు వీడు! అలాగే అనుకోనీ. ఈమానవులు మాయలోపుట్టి మాయలో పెరిగారు. మాయవీళ్లకు ఉపశమనం కలుగజేస్తుంది."

నాకు భరించరానివేదనకలిగింది. బొటబొటకన్నీరు కార్చాను. ఆయన కాషాయాంబరం తడిసింది. నాకన్నీరు ఆగలేదు. కట్టలు తెగినవదికలె పొర్లిపోతున్నది. కళ్లు జేవురించినవి.

సన్యాసిహృదయం తారుమారైంది. ప్రకృతి ఆయనచుట్టూ స్వప్నాలల్లుతూ ఆయనభావాలను మేఘావృతము చేసినది.

"అబ్బాయీ నామనస్సుకు ఏదో అనంతమైన దాన్ని తెస్తున్నావు. వెళ్లు నీమేనమామదగ్గిరవుండు. నీకంఠరవాలేదు." అన్నారుస్వామి. నేనుదుఃఖిస్తూ ఇంటికి వెళ్ళిపోయాను.

౪

ఊరిచివర మఠానికి దూరంగా జానపదుల కుటీరాలున్నవి. చెట్లచాలులో సంధెదీపాలు మెరుస్తున్నవి. ప్రకృతి పరిచినతివాచీమీద సన్యాసివిషణ్ణుడైనాడు. విభావరి నృత్యంచేస్తుంటే ఆకాశవక్షం మీద నక్షత్రహారాలు తళతళ మెరిసి చిక్కుపడుతున్నవి.

ప్రపంచం ఎన్నిరకాల స్వప్నాలు అల్లినా మళ్ళీ అల్పమానవుల్లో చేరిపోకూడదని నిశ్చయించుకొన్నాడు.

ఆయన కమండలం దండం ముక్కలుచేసి విసిరి పారవేశాడు. సూర్యకాంతి వదిలి మిణుగురులను ఆశ్రయించకూడదనుకున్నాడు.

# భారతీశతకము

## గిడుగు వెంకటసీతాపతి

పలువురినోట రంజిలుచు వైకృతచంద్రిక[62] యొప్పుగాంచి ము
న్నలపిన వీరభద్రకవి యాదర మొంది యతిస్థలానసే
యలరుశకుంతలాపరిణయంబున "అందఱి"కన్నరూప [63]మ
న్యులకృతులందు సైతముఁ బ్రియుక్తము లిట్టివి, కంటె! భారతీ.

తొలుత "రెండగు" మారె "రెండవు"గఁ; దద్రూపంబు మార్పొందఁగాఁ
గలిగె "రెండవ" యన్నరూప మది పల్కన్ బల్క "రెండో" యగున్;
బలుకుల్ మారుచునుండు; "భాగవతులే" భాగోతులైనారు; లో
కులమాటల్ కృతులందు దొడ్డకవులున్ గూర్తుర్ గదా భారతీ.

"వాఁడా నాలు" గటంచు రుద్రకవి చెప్పన్ గ్రాలు కందంబునన్
"మూఁడో జా"మని నాలుగో చరణమొప్పన్ దిద్దఁగానేల ? త
ప్పా ? 'డో' ప్రాసము మూఁట, నాల్గిటఁగదా! [64]పందొమ్మిదో ఛందమం
చాడెన్ లక్షణమందె యప్పకవి [65]తప్పా ? చెప్పుమో భారతీ.

"జానా" నంచు దశావతారమున వ్రాయన్ లేదె రామన్న "పో
పో నవ్వే రెవరైన విన్న" [66]యనుచున్? "మొక్కేము నీకాళ్లు" కం
టే నగ్రాహ్య మనేవు ను మ్మిదియు నిక్లే యా మహీపాలు కా
వ్యానన్ జూడుము పార్వతీపరిణయంబం దొప్పు[67]నో భారతీ.

"కరుణించన్" "గరుణించు", "దాఁచకు" మనన్ గ్రాహ్యంబులేకావె? ప
ల్వురికావ్యంబుల నిట్టిరూపములు లేవో, లోకమం దాడరో !
"పరసత్వంబని ప్రాజ్ఞులార ! నిరసించంబోకుఁడీ రాఘవే
శ్వరుచారిత్ర" మటంచుఁ బాపయ రచించన్ జూడవే[68] భారతీ.

62 "కళాదాబిడ్డా, అందఱు చేత, అందఱి చేత."—63 "దనుజుఁ బరిమార్చి యందఱి కిని దానవబాధ దీర్చి కృతకృత్యుండై" 64 విరంతు. II. 102. 65. IV. చక్రబంధ లక్షణసీసము. 66 ప. 218. 67. ప. 67 68. I. (కంకంటి పాపరాజు ఉత్తరరామాయణము.)

“అయితే” వంటి క్రియాపదంబులను ‘చేదర్థంబు’నన్ వాడుచోఁ
గ్రియకున్ నీ వను కర్తృవాచకము నిర్దిష్టంబుగా నొప్పెఁ; న
న్నయభట్టాదికవి ప్రయోగములఁ గానన్‌వచ్చు నీ యన్వయం
బయితె వాడుక మారిపోయినది కాదా? చెప్పుమో భారతీ.

“ఐతే” యెట్లు ప్రయుక్తమో కనవె కావ్యాలందు? “దుర్యోధనుం
డైతేనే” మని కాకమాని యనుఁ;[69] దప్పా? “ఇంచుకేఁ జేయఁగాఁ
బోతె దోష”[70] మటంచు ధూర్జటికవే “పోతే” ప్రయోగించితే
నా తప్పేమి? వచించితే యిటుల నన్ మన్నింపవే? భారతీ!

నేనంటే గ్రహియింపఁ జాలనని యుంటే కావ్యమే కాని కై
కోనంటే యివిగో ప్రయోగములు “లేకుంటే” కదా కావ్యమం
దానం చుత్తరనైషధం బనును; “ఇల్లాలంచు నే నమ్మియుం
టే నీ” వంచు[71] దశావతార మను నంటే విందువే? భారతీ!

పూవులఁగోతుఁ; జేతు హరిపూజలటంచు వచింపఁ జెల్లదే?
శైవపురాణమందు,[72] శుకసప్తతి,[73] నైషధ,[74] శేషధర్మ,[75] లం
కావిజయంబులందు,[76] కవికర్ణరసాయనమందు[77] నింక నే
లా వివరింపఁ బెక్కుకృతులందు ప్రయోగము లుండు భారతీ!

తన లంకావిజయంబునం దెవఁడు “మద్ వాక్యాల నాంధ్రోక్తికిన్
ఘనుఁ డా వాగనుశాసనాఖ్యుఁడయినన్ గానిమ్ము బద్ధుండె యా”
నని దార్ఢ్యంబునఁ బల్కె నాకవియె శబ్దాలంకృతుల్ చేర్చి “చే
తును” కందంబునఁ బ్రాసమందు నిలిపెన్[78] దోషంబటే భారతీ.

వస్తే గ్రామ్యమె? కూచిమంచి కవి చెప్పెన్ జంద్రరేఖావిలా
పస్తప్రాసపుకందపద్యము గ్రహింపన్ రానిదంటే సరే,
“వస్తా చూస్తిమి” యంచుఁ జాటువునఁ జెప్పన్ లేదె శ్రీనాథుఁ; డ
ర్థిస్తూ మల్లయ వ్రాసె “రావలసివస్తే”[79] యంచునో భారతీ.

69 పాంచా. 43. 70 శ్రీకాళ శతక. 69. 71. ప 195. 72 బసవపు. పు. 190;227. 73. ప. 9. 74. II. 88. 75. III. 42. 76. I. 7;I. 16. 77. III. 55. 78. I. 16. 79 రామస్త. ప. 20.

కొను పరమై తుమర్థమున కుజ్జని కోయగుఁ “బుచ్చుకోకపో
యెను” “ననునేలుకోవలయు” నిట్టిప్రయోగములెన్ని యేనియున్
గనఁబడు భీమఖండమున[80] జైమినిభారత[81] నైషధంబులన్[82]
గనఁబడుఁ బెక్కుకావ్యములఁ గావున గ్రాహ్యములయ్యె భారతీ.

శ్రీనాథుండు రచించు కావ్యములలోఁ “జేయించుకో”[83] “వ్యాఖ్య గై
కో”[84] నంచున్ మరి “పుచ్చుకోఁ దెగువ[85]” “పేర్కొ[86]” నిట్టిరూపంబు లె
న్నో నీవున్ గనియుంటిగాదె కవులెంతోమంది పల్కంగ; లో
కానన్ గన్పడురూపముల్ కవులకున్ గ్రాహ్యంబులౌ భారతీ.

అడమట మాంతముల్ గలవు వ్యాకరణంబునఁ గోశమందుఁ “గ
ట్టడములు”[87] నొప్పదే “యిఱుకటం[88]”బనఁ ? దిక్కన పల్కఁ; “దండివ్రా
యడ” మను, వీరభద్రుఁ[89]; డా రఘునాథుఁడు “కెంపుపొళ్ళచె
క్కడ”మను[90]; నిట్టి వింకఁ బలుకావ్యములన్ గనుపట్టు; భారతీ.

పలువురు వల్లరూపము ప్రబంధములన్ మనసార వాడినా
వలనకు వల్ల గ్రామ్యమగుపల్కుగ నెంచి త్యజింపఁ జెల్లునే ?
“చలిమలవల్ల నుల్లసిలుచల్లఁదనం”బని పెద్దనార్యుఁడే
పలికెను[91]; పోతనార్యుఁడును[92] వల్లపదంబును బల్కె; భారతీ.

“పొదవుట” “పూను”టన్నపదముల్ తొలిహల్లులడంగ నొప్పుగా
“నొదవుట” “ఊను” లౌటకుఁ బ్రయోగము లప్పకవీయ మిచ్చినా
“అది యవిచారమూలక” మటంచును జిన్నయసూరి పల్కె; ని
య్యదియె యసూరివాక్యమని యందురు పండితులిప్డు భారతీ.

‘పెట్టు’న నాదిహల్లడఁచిపెట్టఁగ భారతమందె యొప్పు ‘మో
పెట్టని[93]; ‚గంతులేయు’ కనిపించును అప్పకవీయమందు[94]; చూ

80 III. 93. 81 II. 104. 82. V. 182. 83 కాశీ. పు. 122. 84 నైష. V. 182. 85 భీమ V. 95. 86 నైష. I. 62. 87 కవిజన చ. చ. పు. 23. 88 విరాట. V. 211. 89 జైమిని VIII. 82. 90 పార్వ. V. పుట. 104. 91 మను. II. 10. 92 భాగ. V. I. 161. 93 చూ. శ. ర. 94 IV. 193.

పట్టును 'లంగరేసి' శ్రీలిపర్వమునన్ గవిరాజుపల్కె[95]; బొ
బ్బెట్టు' నిఘంటువందు; "మెఱుగెట్టు" నవీనుఁడొకండు[96] భారతీ.

"నీయడుగెంటనే నిలుతు నే" నని పల్కెనఁ గాకమానియున్[97]
"నీ యుసురోసుకొంచు జననీ" యనఁ గూర్మనాథుఁడున్[98]
"ఈయమ పెండ్లికొచ్చిరి గదే" యన వేంకటరంగఁడున్[99] సరే
వ్రాయఁగవచ్చు నిట్టు లనరా ? తమవ్రాఁతలఁ జూపి భారతీ.

అరయన్ వ్యంజనలోపముండుటను శబ్దార్థంబు మారొప్పందదే ?
గరితల్ నిత్యము నీళ్లుపోసుకొనుచున్ గర్భంబులన్ దాల్పఁ జె
ప్పరె "నీళ్లోసుకు నిన్నిమాసములు కావచ్చెన్ గదా" యంచు ? ఇ
ట్లు రసౌచిత్యముఁబట్టి పల్కఁ గవియున్ లోకోక్తులన్ భారతీ.

వ్రిణమున్ వ్రాయుటలందుఁ గ్రారవడులన్ వ్రాల్ పోయి రేఫంబులే
వినిపింపన్; రణమాను, రాయుట యగున్; వ్రేపల్లె రేపల్లెయా;
గనవే సంస్కృతభాషలో నిటుల పల్కన్ హ్రేషయున్ రేషయున్
దనరున్; వ్రైటని వ్రాసి రైటనుట లేదా యాంగ్లజుల్ ? భారతీ.

క్రాఁగును, క్రుళ్లు, గ్రద్దలును, క్రమ్మును, క్రుంగును, క్రొత్త, ప్రాతలున్
త్రాగును, త్రెళ్లు, క్రోఁతులును, త్రాళ్లును, త్రొక్కను, త్రెన్చు, ప్రేవులున్
వ్రేఁగును-ఇట్టిశబ్దములు రేఫము లేకయుఁ గన్పడున్ గదా
మ్రోఁగును మోగునట్టుల ద్విరూపములన్ గనవొప్పు భారతీ.

కరడము, తామెతుల్, చిలుక, గాడిద, పయ్యెద, యుయ్యెలల్, పువుల్
అరఁటులు, డాఁగు, డొంగ మొదలైనపదాలకు భిన్నరూపముల్
వఱలును బల్కభేదములు భాషలనొప్పుచు నుండుఁగాన; నె
వ్వరికెది యిష్టమో యదియె వారు గ్రహింతురుగాక ! భారతీ.

న్యాయము బ్రహ్మ బొమ్మయయినన్ మగఁడే మొగుడౌట; దీనినె
ట్లా యపశబ్దమందు ? పగడాల్ పొగడాలగుఁ గాదె యిట్లు; రా

95 శ్రీకృష్ణభారతము ఆది. IV. 75. 96 తెల్పాగు వెంకటకవి నిర్వచన విచిత్రరామాయణము.
97 పాంచాలి. I. 114. 98 మృత్యుం. ప. 23. 99 శశి. పు. 60.

మాయణచంపువందుఁ గనుమా "మొగఱా" యనుమాట[100]; దిద్దఁబో
తే యతిభంగమౌఁ గనుక దీని గ్రహించుట యొప్పు; భారతి.

ఒప్పుగ 'కోస' మంటకు ప్రయోగము లున్నవి; "ముక్తికోసమై"
అప్పకవీయమందుఁ గననయ్యెఁడు[101]; తమ్మయ[102] పాపరాజులుం[103]
జెప్పిరి; హంసవింశతిని జేరెను[104]; తిర్పతి వేంకటేశ్వరుల్
"కొప్పరపుంగవీశ్వరులకోసము" చెప్పిరిగాదె[105]? భారతీ.

జవ్వన మల్లె యవ్వనము సాధుపదంబగు నాంధ్రభాషలో
"అవ్వన" మన్న కందమున "యవ్వన"మంచును సింగనార్యుఁడున్[106]
యవ్వనలక్ష్మికంచును అనంతుఁడుఁ[107] బల్కిరి; పల్వురెల్లచో
నివ్విధి పల్కుచుంట వినవే? యిది తప్పననేల? భారతీ.

పట్టణమన్నఁ దప్పనుచు పత్తనమంచును దిద్దనేల? క
న్పట్టుఁ గవిప్రయోగములు భాగవతంబున రెండు కందముల్
పట్టణశబ్దమున్ సరిగఁ బ్రాసముపట్టున నిల్పెఁ జూడుమా[108];
పట్టము పట్నమం చిపుడు పల్కఁగ విందువుకాదె? భారతీ.

తనరును "వృద్ధు" "మూర్ఖు"ను పదంబులు సన్నయ పల్క[109]; నీచు తి
క్కన రచియింప[110]; శిష్టును, గృహస్థును అనంతుఁడు పల్క[111] నీగతిన్
దనరును దుష్టు, జంగము పదంబులు ప్రత్యయపుం డుకారముల్
కనఁబడనట్టి రూపములు కావ్యములన్ గనుపట్టు భారతీ.

కరణికుఁడన్న తత్సమము గ్రాంథికశబ్దమె, కాని; యెల్లచోఁ
గరణము గ్రామనాయఁడును గ్రామమునందలిపెద్దలౌటచేఁ
గరణము పల్కు గ్రాహ్యమగుఁ గావ్యములందును; దిద్దఁజూతువే
కరణమటంచు సింగకవికావ్యమునన్ గనుపట్టు[112]; భారతీ.

100 III. 71. 101 IV. 314. 102 వైజ IV. 5. 103 ఉ. రా. ప్ర. 313;317. 104 III. 36. 105 అత్రినరసాపురమండలి యష్టావధానపద్యము. 106 పద్మపు. I. 91. 107 భోజరా. VII. 108. 108 x. i. 164;1150. 109 అర. III. సభా. II. 11. 110 విరా. 111 భోజ. IV. 112 సకలనీతిసమ్మతములో.

చను నాంధ్రోక్తిగ నన్నపార్యుఁడన "ముష్టాముష్టియుద్ధంబు" త
ప్పని దిద్దన్ యతిభంగమా[113] నిటుల వ్రాయన్ లేదె శ్రీనాథ పో
తనలున్[114] ? దిద్దుదురేల ? అప్పకవి బాహాబాహినంచాడఁడే[115] ?
తెనుఁగుల్ పల్కెడురీతి కావ్యములలో దీపింపదే భారతీ.

వెలయున్ దత్సమ తద్భవాది పదముల్ వేర్వేరులింగంబులన్;
అలరున్ దర్భలు; పుట్టు నూహలు; చరిత్రాదుల్ ప్రయోగించరే ?
తెలియన్ జెప్పుము - 'స్వాములారు దయచేస్తే భిక్షచేస్తాము పే
దలువస్తే పెడతాము బిచ్చ'మనినన్ దప్పందువే ? భారతీ.

మంగళసూత్రమట్టుల సుమంగలి కొప్పిన కుత్తిగంటు[116] ప
ల్కం గొతు కేటికో ? హారవిలాసమునన్ గలమాట; కోశమం
దుం గనుపట్టకున్న యిది దుష్టపదం బనరాదుగాదె ? పం
చాంగము చెప్పకున్న గ్రహాచారము తప్పునటమ్మ భారతీ.

అరయఁగఁ గొన్నిశబ్దములయర్థము మారుచునుండు చీరలున్
శిరసుకుఁ జుట్టఁ జూచెదరె ? స్త్రీలు ధరింతురుగాక; తేపు నే
నరిగితినందునే ? పొడుతుఁ నాయమతో నన నిప్పు డొప్పునే ?
తరులకు నీరమొల్కెదుమె ? దండము చిక్కెనిదానె ? భారతీ.

ఒరయన్ మోపన వింటినారి సబళం బొండాయుధంబై చనున్
ఎరవర్థంబగు భేదమంచుఁ; జెడిపంటే అంకుటాలయ్యె; ని
క్కెరణిన్ వాడుకలేనిమాటలకు వ్యాఖ్యన్ వ్రాయుచో శ్లోకముల్
గుఱిగాఁ జూపుటగత్యమయ్యెఁ గనవే కోశంబులన్[117] భారతీ.

పదరూపార్థనిరుక్తనిర్ణయమొనర్పన్ శబ్దరత్నాకరం[118]
బిది చింత్యం; బిది మృగ్య; మర్థము విచారింపన్ దగున్ దీనికిన్;
ఇది యీ గ్రంథమునందె కానఁబడు; నంచేశబ్దముల్ చూపు నా
పదముల్ కూర్పఁ దలంత్రు నేఁటికవులున్ వ్యర్థంబుగా భారతీ.

**113 అర. III. 395. 114 కాశీ. V. 150; భాగ. x. ఉ. 66. 115 IV. హ్మాహారపద్యలక్షణము. 116 హారవి. II. 60. 117 చూ. శ. ర. 118 చూ. శ. ర. ఏతు; ఏదుడు; ఉక్కె; ఉదిరి; సేకము; ఉవ్వాయి; గారాబు; పొంపు; వంత; తటకాపడు మొ.**

నన్నయ నన్నిచోడ కవినాథుల కాలమునుండి నేఁటికిన్
సన్నుతి పొంది మాండలికశబ్దములెన్నియొ కావ్యరాజిలో
నున్నవి; ఆంధ్రదేశమున నొక్కొకచోట నొకొక్కరీతిగా
నున్నపదంబులన్నియుఁ దెనుంగుపదంబులె కావె ? భారతీ.

ఒకయెడ "బేడ"లన్న మరియొక్కెడ సర్థము రెండణా లగున్
ఒకయెడ "పప్పు"లన్న మరియొక్కెడ నర్థముకాదటంచు నిం
దొకటియుఁ గావ్యమందుఁ జననొల్లనివారు మఱొండుమాట గ్రాం
థికపదమంచుఁ బల్కవలదే ? యటు పల్కఁగలారె ? భారతీ.

తనసీమన్ గలభాష పల్కఁ గవియున్ దప్పేమి ? పల్నాటిదే
శమునం దొప్పఁగఁ బప్పునన్ హారవిలాసంబందు శ్రీనాథుఁ[119]; డం
దముగా రాయలసీమభాష వెలుఁగొందన్ విష్ణుచిత్తీయకా
వ్యములో బేడ లటంచు రాయలు రచింపన్ మానునే[120] ? భారతీ.

అరసున్నల్ గల శబ్దముల్ దెలిసికో నౌనంచుఁ బ్రాసస్థలిన్
అరయన్ జూతురుగాని యప్పకవి ఖండాఖండమా ప్రాసముల్
విరచింపన్ జనునంచు లక్ష్యములు చూపెట్టంగ దిక్కేది ? యె
వ్వరికైనన్ దెలియంగరానిది త్యజింపన్ గూడదే ? భారతీ.

పలుకుచు నున్నకాలమునఁ బ్రాసవిరామములందు రేఫసం
కలితముగాక నిల్చినఱకారము నేఁటికి రేఫతుల్యమై
పలుకును గాన రేఫమునె వ్రాయుచు దీనిఁ ద్యజింపఁ జెల్లదే ?
పలుకుకుఁ దగ్గ వర్ణములు వ్రాయుట యొప్పునుగాదె ? భారతీ.

*

అరయన్ అక్షతలన్నశబ్దమె కదా అక్షింతలంచున్ వచిం
తురు రుక్మాంగదకావ్యమం దలరు నిర్దుష్టప్రయోగంబు "సుం
దరి యక్షింతలబొట్టునుం బసుపు మోదం"బంచు[121] మల్లయ్య ప
ల్కురసౌచిత్య మెఱుంగు ప్రౌఢకవి మల్లుం డాతఁ డో భారతీ.

119 II. 31. 120 అను. II. 88. 121 IV. 89.

# సాంత్వనము

కొమర్రాజు వినాయకరావు

దిట్టకల్లరి వని నీకు తెరవ, యెట్లొ
కలిగె నపవాదు దుష్టలోకమ్మునందు.

ఐన నేమాయె నింతలో? అవని మునిగి
పోవునో, వార్ధిజలమింకిపోవునో! మ
రేమియగు! ఈ పిరికిలోక మేమిసేయ
గలుగునో ముగ్ధ! ఇంత విహ్వలత విడుము.

లోలనేత్రాలలోతులలో చెలంగు
నీవినిర్మలనైశిత్యభావమెరిగి;
మోవిలేచివురెందలో ముగ్ధతన మ
మాయికత్వమ్ము నృత్యమ్ము సేయుదెలిసి;
స్వచ్ఛశీతలకౌముది జాతిత్రాతు
మైమరవు తాండవము నేర్పుతో మెలంగు
పాయువాల్జడలోని త్రపావిముగ్ధ
స్వాదుసుస్నిగ్ధమోహనాహ్వానమరసి;
పొంగుప్రాయంపుటెదలో నదంగు రాగ
వాతఘూతక్షుభితసికతాతపప్ర
తప్తసీమానమాశ్రితదాహమెరిగి
నే కరగిపోదు! జాలిగా!
నీ వబద్ధ
మితరులకు, నాకు ప్రేమ కీవే నిబద్ధి!

# ప్రభాతగీతి

వేదుల సత్యనారాయణశాస్త్రి

విరహబాష్పతుషారమ్ముఁ గురిసి కురిసి
కను మొగిడ్చెను హేమంతకాలరాత్రి
జీవచైత్రప్రభాతవంశీరవమ్ము
మ్రోగుచుండె రోదసి మూలమూలలందు
సప్తరథ్యప్రయాణహేషారవమ్ము
సాగెఁ దూరుపు పైడిమోసాల మ్రోల
నరు లువేక్షించుతృణదళాంతరహిమాశ్రు
కణములపై లోకబాంధవుకరము సోకె
ఓ విషాదప్రపంచయాత్రావిరాగి!
ఓ నిరాశాపథైకపురాణపాంథ!
ఓ ప్రవాసదుఃఖాశ్రుపయోదమూర్తి
రేయికాటుకకనుల జారినవిషాద
బాష్పవారి నొకేసారి పారఁబోసి
ఈమధుప్రాతరాహ్వానసామగాన
మంచు మోయు జీవనపాత్ర నించుకొమ్ము;
పూవుపూవునఁ దావి గుబుల్కొనంగఁ
బూలవన మెల్ల నిలువునఁ బులకరించె
కొదమకెమ్మోరపిల్లనగ్రోవితోడఁ
బులుగుగొంతుక పాటరెక్కల విదల్చె
అణువణువుగాద శుభగీతు లాలపించు
వందనోత్సవమందిరాళిందసీమ
నీరవగళమ్ముతో నీవు నిలువరాదు
భూతకాలదినాంతానుభూతితోడ
భావియుగములకల్యాణపథముఁ బట్టి
వెలుఁగునీడల జీవనవేణు వూది
పాడుకొనుము యీనాఁటిప్రభాతగీతి!

“చాలనీ”

( పుస్తక సమీక్ష )

## శృంగారవీథి

కాల రూపాయి

రసతరంగిణీగ్రంథమాల. బందరు

చక్కని బొమ్మలతో మంచి తయారుతో వెలువడిం దీ నవ్యకావ్యం.

కర్త తెనుగునాటికీ, తెలుగు పలుక్కీ క్రొత్తవారు కారు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు Experimental poets లో, ఆంధ్రవాఙ్మయానికి వీరిదే అగ్రతాంబూలం: అంటే కథ, పద్యం, వ్యాసం, నాటకం, నవల-ఏదేనాసరే వీరి కలంలోనని చెప్పినట్టు నడవవలసిందే!

కావ్యమంతా ఒకేకాలంలో, ఒకే ఉద్రేకంలో వ్రాయలేదు. “అమృతం” “రాధిక 1, 2” వారి మరీ చిన్ననాటివి. “శృంగారవీథి” 1920 నాటిది. “పారిజాతస్తవం” “నిర్వేదం” “బ్రహ్మగీతం” తర్వాతవ్రాతలు.

కథావస్తువు పురానుగతం; అయినా నూత్నాలంకృతం; రాధామాధవుల శృంగారగాథ. ప్రణయంలో ప్రణవం ప్రతిధ్వనిస్తూ (All poetry is the problem of getting the infinite into the finite” అనే Browning కవితాసిద్ధాన్తానికి ప్రమాణం అవుతోంది.

“శ్రీకృష్ణదేవుని నిర్వేదం”లో నాయిక పంచభూతాత్మకమైన ప్రకృతి; (అంబరలక్ష్మి రుక్మిణి, జ్యోతిరంగన సత్యభామ, వాయుదేవతలు భార్యలారుగురు, జలములు రాధ, ధరాసాధ్వీమణి కుబ్జ;) మరి నాయకు డైన కృష్ణుడే పురుషుడు. కాని వారి శృంగారవిహారమంతా మాయ.

‘పాలతియు మాయలాడ యన
బోయినదో సగమన్న దండులో,
బలలమగు పంటికొక్కులకు
బాధను పొందిన దేమొ! అంతలో
దలిసెను దేవదేవుడును;
దిగ్గన లేచి, ‘మ రీవు మాయవా!
తెలిసిన దెంత చేసితివి?
దీపరివంచనకేళికాకృతీ!’

ఇందులో అద్వైతమతం సిద్ధాంతీకరింపబడింది కూడా.

‘యదువులయందు చుట్టము,
లతాంగులయందున భర్త, ద్వారకా
స్పదులగువారికిన్ ప్రభువు,
భక్తులపాలిటి కామధేను వా
యదుకులమౌళి; ఏది యగు?
అన్నియునౌ; మరి ఏది కాదు? ఎ
య్యదియును కాదు...’

కవిరాజామొక్క సహజరసపారవశ్యమే కాకుండా రచనాసౌందర్యంకూడా ఈ కావ్యంలో స్ఫురిస్తాయి. ఇది వారి అభిమానకృతి ఐనట్టుకూడా తోస్తుంది.

“బ్రహ్మగీతం” ఏనాటికీ నిండుగుండెలో మారుమ్రోగుతూ ఉండవలసిందే! ఇది ఎలాచూసినా చక్కనిగీతం. శ్రీసత్యనారాయణగారు సంబోధనలు కూర్చడంలో అసమానులని ప్రతీతి; ఇందులో ప్రత్యక్షం.

“రాధస్వప్నం”లో గొప్ప భావనాపటిమ ఉంది. ‘యశోద కన్నవాని మృదుశ్రీ చరణాలు’ చిత్రి

చిత్రాలుగా ఉపమింపబడ్డవి. ఇందులోకూడ మిథ్యావాదన ఉపపాదింపబడింది.

“ప్రాతస్స్వనం” లో ముఖ్యంగా ఎన్నతగినది కవిగారి ఆంధ్రత్వం. తెనుగుతల్లి బిడ్డని ఎన్ని రకాలుగా తేలుకొల్పడం మనము వినగలమో అన్ని రకాలూ ఇందులో ఉన్నవి. “యమునానది” గర్భవినిస్రుతాంబువులలో ఆనంద శీకారవ శీన్నృత్యస్వనమో? త్రియా నినదమో! చిల్లత్క్రమంజీర ఘంటానాదంబులో! వేణునిస్వనములో! న్యగ్రోధపాలాశ శయ్యా నిద్రాలయబాలునిశ్వసితమో! ఆరావముల్ తోచెడిన్.'

సత్యనారాయణగారి శైలి “కిన్నరసాని” నడకల్లాగ - ఒకసారి ఒదుదుడుగ్గా, ఒకసారి నెమ్మదిగా, ఒకసారి వంకరగా, ఒకసారి సూటిగా - రకరకాలు పోతుంది. అందుకు కారణం వారి రసధ్వని అన్వయగతం కావడమే. మచ్చుకి :

'మారధనుర్ద్వయంబువలె మండలబద్ధసహస్రపాద శాఖీరకు తైకవాయనవిభీతమృగీసమలోచనాద్భగం భోరుహచంచలా సహితమోహనతోయదమూర్తి వంశగర్జారవశీలికిన్ మనము జ్ఞాపకమా యదువంశ మాలికిన్.'

మొత్తం కావ్యమంతా ఒక రసతరంగిణి, ఆంధ్ర సరస్వతి నేత్రాంచలాన నటించిన సుస్వప్నం. ఇలాటి సత్కావ్యవరాలే ఆంధ్రలోకం ఆశిస్తోంది. ఒక్క సందేహం! కావ్యం పద్యమయం; కాని “రాధికకి” వచనం ఇరికించారేం?

ఆదీగాక కృష్ణలీలలకి అస్థానమైన శృంగారవీథిలో “స్నానసుందరి” “కుపితచాలనం” ఎందుకు చేర్చినట్టు? అవికూడా శృంగార సంబంధమైనవే కదా అనా! రూపాయితీసుకుంటూన్నాము, పోనీ కాసరుగా ఇంకొక పందొమ్మిది పద్యాలిద్దామనా!

7/37

# కామవిలాసము

విద్వాన్ సరిపల్లె విశ్వనాథశాస్త్రి, ఎం. ఏ.
హైదరాబాదు

8 + 24 + 74 పుటలు - వెల ఎనిమిదణాలు.

ఒకభాషలోని సుప్రసిద్ధకావ్యము రసభావములకు కొంచెమయినా కొరతకలగకుండా ఉండేటట్లు యథామాతృకముగా ఇంకొకభాషలోనికి అనువదించడము కష్టసాధ్యము. మూలగ్రంథము జాతిమతవిషయములలోనూ, ఆచారవ్యవహారములలోనూ జీవిత పరిస్థితులలోనూ భిన్నమయిన దేశములో ఉత్పన్నమయిన కావ్యమే అయి - అదీ సమకాలికముకాక ప్రాచీన కాలములోనిదయితే - అనువాదకునికి కలిగే కష్టపరంపర చెప్పనలవికాదు. సుప్రసిద్ధాంగ్ల మహాకవి మిల్టన్ 17 వ శతాబ్దారంభములో 'కోమస్' అనే కావ్యము రచించినాడు. ఇది 'మాస్క్' అనే దృశ్యకావ్యశాఖలోనిదని కవి పేర్కొన్నా దీనిస్వరూప స్వభావాదులను గురించి నాటి విద్వాంసులు పలువిధములయిన అభిప్రాయములు వెలిబుచ్చినారు. దీనిలోని ప్రాశస్త్యము పలువురికి పలువిధములుగా గోచరించినది. ప్రాచీన గ్రీకురోమక మత సారస్వతముల ప్రాబల్యము ఈ కవిరచనలన్నిటిలోనూ సర్వసామాన్యముగానూ, విశేషించి ఈ కావ్యములోనూ కనబడుతుంది. అడుగడుగుకీ పురాణగాథలే, ఆదినుంచి అంతము వరకూ అలంకారములే! ఈ కవి ప్రయోగించిన భాషకూడా మిక్కిలి విచిత్రమయినది- స్వీకరించిన పదజాలములోనూ, ఆ పదములకూర్పులోనూ, కొన్ని కొన్ని పదములకతడు నిర్దేశించిన అర్థములలోనూ ఎంతో విశిష్టత కనబడుతుంది. అందువల్ల భాషాంతరీకరణానికి - అందున్ను ముఖ్యముగా ప్రాచ్యభాషలలోనికి అనువదించడానికి - ఈ కావ్యము అననుకూలమయినది.

సుప్రసిద్ధకావ్యము అనువాదము చేయకూడదని మా అభిప్రాయముకాదు. ఇతరవాఙ్మయముల

లోని కవితారసము దేశీయులకు చవిచూపడానికీ మనవాఙ్మయమును పెంపొందించడానికీ పరభాషా కావ్యములను భాషాభిమానులు ఆంధ్రీకరించవలసినదే. అయితే అప్రయత్నము ఉచితమయిన మార్గములో పడవలెను. యూరపుఖండములో ఎక్కడ ఏ ప్రసిద్ధకావ్యము వెలువడ్డా ఇతరభాషలలో దాని అనువాదము కొలదికాలములోనే వెలువడుతుంది. భారతీయకావ్యములుకూడా పాశ్చాత్య భాషలలోని కెక్కినవి. రవీంద్రునిగీతముల కన్నో అనువాదములు ప్రకటితములయినవి. కాళిదాసాది కవుల కావ్యనాటకాదులు అయితే పా భాషలలోని కెక్కినవి. ఆయా అనువాదకులు అనుసరించిన మార్గములు చూచి సదాచారము పాటించడము శ్లాఘాపాత్రము.

విదేశ సారస్వతములో ఉండే ప్రాశస్త్యము ఆదేశ భాష అర్థముకాని మనవారికి తెలియజేయడమే అనువాదకుని ఉద్దేశమై ఉండవలెను. ఆదేశస్థుల కాయా కావ్యములు చదివినప్పుడు ఎటువంటి రసానుభూతి కలుగుతుందో అట్టి రసానుభవము కలిగేటట్టు అనువాదములుండవలెను. అంతేకాక అనువాదమునుబట్టి ఆయా కావ్యకర్తల ప్రజ్ఞావిశేషములన్నీ పొడకట్టేటంతగా మూలములలోఁడి సన్నిహితత్వము అనువాదములలో గోచరించవలెను. ఈవిధమయినరచన సాధ్యమే అయితే అదే సర్వోత్తమము. దానిని భాషానువాదమని పేరుపెట్టి ఈసడించడము అవివేకము. మూలగ్రంథము అట్టి రచనకు అనుకూలపడనప్పుడుగాని దానిని పెంచి, మెరుగుపెట్టి తన ప్రతిభను కవి ప్రకటించదలచుకొన్నప్పుడుగాని అందులోని కథాభాగమునో సారాంశమునో తీసుకొని తత్సదృశమయిన గ్రంథమునుగాని దానికంటె ఉత్కృష్టమయినదిగాని స్వతంత్రించి వ్రాయవచ్చును. షేక్స్పియరు నాటకములకూ మన ప్రబంధములకూ అట్టి మూలగ్రంథము లున్నవి. ఆనాటకములనూ ప్రబంధములనూ 'రసానువాదము (Adaptations)' అనడముకంటె స్వతంత్రగ్రంథము అనడమే సముచితముగా ఉంటుంది. ప్రసిద్ధమయిన ఈ రెండు మార్గములకూ భిన్నమయిన రచనచేసి దానికి (Adaptation) రసానువాదమని పేరుపెట్టి కొనియాడడము అసంగతము.

'కోమస్'లోని పాత్రలకు మారుపేర్లుపెట్టి పాశ్చాత్య పౌరాణికగాథలకు బదులు భారతీయ పురాణగాథలుచొనిపి, కొన్నివర్ణనలు స్వదేశపరిస్థితుల కనుగుణముగా ఉండేటట్టు తారుమారుచేసి, అలంకారములు మార్చి, మూలములోని విషయములలో కొన్నిటిని విడిచిపెట్టి, కొన్నిటిని పెంచి, కొన్నిటిని కుదించి, కొన్నిటిని యథాస్థితముగా ఉంచి, కొన్ని కొత్తవిషయములు వాటికి చేర్చి ఈ గ్రంథకర్త కామవిలాసము రచించినాడు.

కామవిలాసములో మొదటి 32 పంక్తులు కవి కొత్తగా చేర్చినవి. ఈఘట్టము 'స్థాపన'వంటిది. 'కోమస్'లో మొదటి 17 పంక్తులూ (Prologue) స్థాపనవంటివై ఉండగా ఈ ఘట్టము కొత్తగా చేర్చవలసిన అవసరమేమీ కానరాదు. మూలములోని మొదటి 17 పంక్తులకూ బదులు కామవిలాసములో 33 మొదలు 93 వరకూ 60 చరణముల గ్రంథమున్నది. ఈ భాగము అనువాదమూకాదు, స్వతంత్రరచనాకాదు. మూలములోని 18 వ పంక్తి మొదలు 36 వ పంక్తివరకూ ఉన్నగ్రంథమునకు బదులు కామవిలాసములో 93 మొదలు 98 వరకూ 5 చరణములున్నవి. అనగా ఇక్కడ మూలములోని చాలాభాగము విడిచిపెట్టబడ్డదని తెలుస్తూనే ఉన్నది.

> "Love Virtue; she alone is free.
> She can teach ye how to climb
> Higher than the sphery chime;
> Or, if virtue feeble were,
> Heaven itself would stoop to her."

'కోమస్' లోని ఈ చివరిపంక్తులు కామవిలాసములో ఈ క్రిందివిధముగా రూపొందినవి :

"శీలమే ప్రాణమని చిత్తమున నిడుఁడు !
శీలమే యిలపొందు స్వేచ్ఛావిహారి !
బ్రహ్మాండములు మీఱి పరముఁదిలకింప
స్వర్గమందఁగ నేర్పు వరశీలమిచ్చు
దుర్బలతశీలంబుఁ దూలిపోకున్న
విభుఁడొక్కఁడుండెనను విశ్వాసమున్న
గోవువెంటను దగులు కోడెవలె విభుఁడు
వెన్నంటి సర్వథాప్రియముఁ గల్పించు
బలమిచ్చు శీలసంపదల నిలఁబెట్టు
ధర్మమే దైవంబు తథ్యమిదినుండి.

ఇది భాషానువాదమా, రసానువాదమా స్వతంత్ర రచనమా ?

అనువాదపద్ధతిలో ఈకవి మితిమీరిన స్వేచ్ఛాచారానికి పాల్పడ్డాడని చెప్పక తప్పదు. ఈ రీతిగా రచించిన కావ్యమును పట్టుకొని దీనిలో మిల్టన్ కావ్యమునకు మెరుగువచ్చిన దని పీఠికాకారులు పేర్కొనడము మిల్టన్ కవిసార్వభౌముని తూలనాడడ మనిపించుకొంటుందేమో అని మా సందేహము.

'తోమస్' కావ్యము ఎరగనివారికి ఈ కావ్యవిలాసము అక్కడక్కడ ఉన్న విదేశీపోకడలవల్ల భాషాంతరీకరణమని తెలుస్తూ ఉన్నా - మొత్తము మీద చదవడానికి రమ్యముగా ఉంటుంది. కథావస్తువు, దానికూర్పు, అందులోని వర్ణనలు, పాత్రపోషణము, ఉత్తమాశయములు, ఉదాత్తభావములు, కవితాసంపద మొదలయిన వన్నీ హృద్యముగా ఉంటవి. రచన సరళముగా, సాఫుగా ఉండడము మూలాన చదువరికి విసుగు కలగనే కలగదు. ద్విపదలో వ్రాయబూనుకొనడమూ, అందులోనూ కట్టుబాట్లకు లోనుగాక కొంతస్వేచ్ఛ అవలంబించడమూ వీటివల్ల ఛందస్సూ భాషాభావాన్ని అప్రాధాన్యములోనికి అణచివేయకుండా ఉండడము, గొప్ప సుగుణము. సంస్కృతాంధ్రములలో కవి కున్న పాండిత్యమూ రెండుభాషలనూ మేళవించి రచించడములో ఆయనకు ఉన్న నేర్పూ గ్రంథమందంతటా కనబడతవి. మూలగ్రంథ ప్రసక్తి తల పెట్టకుండా ఈ కావ్యమునుగూర్చి అభిప్రాయము చెప్పవలసివచ్చినప్పుడు ఇది సరసముగా, సరళముగా ఉదాత్తముగా, మనోరంజకముగా తెలుగువారి ఆదరమునకు పాత్రముగా ఉన్నదని పేర్కొనవచ్చును.

గ్రాంథిక భాషారచనములో ఈ కవి పరిశ్రమ చేసినవాడే కాని ఈ భాష ఎత్తుకొన్నవారు ఎంత జాగ్రత్తవహించినా బోల్తాలు పడడములో వింత ఏమీ లేదు.

"దేవకన్యక లిసుకతిన్నెలంగూడి
.........................
............వింతగానాడె" 194 వ పంక్తి.

కర్త 'దేవకన్యకలు' క్రియ 'ఆడె' అని ఏకవచనమున్నూ; ఇట్లే

"ఖలులు గూడినచోటఁగాలూనరాదు
మానభంగము సేసి మర్యాదయనును
సాధులఁబీడించి సరసమది యనును" 267-69.
"కాంతలు పదివేలు కనిపెట్టియుండ్రు" 610.

'పదివేలమంగ' అనుదానికి బదులు, కృతభాషవ్రాసే వారికి ఇటువంటి తప్పులు కూడా అనివార్యము లవుతవి.



## భిక్షావతి

వజ్ఝల కాళిదాసు. వెల : అర్ధరూపాయి.

కాపీలకు విశాఖపట్టణంలోని కవికిగాని, మట్టా గురుమూర్తిగారు, సరస్వతీ ప్రింటింగ్ వర్క్సు, అనిగాని రాయాలి.

ఈ కావ్యం ఎనిమిది ఖండాలుగావి భజింపబడ్డది. ఇది బిచ్చగత్తెగాథ.

ఆకలిమంటలకు తాళుకోలేక, అభిమానం చచ్చి ముష్టెత్తినా కానీ దొరక్క, పై పెచ్చు వృత్తికే దొంగతనం ఆరోపింపబడి, శోక తాగుబోతుచే శీలానికి భంగం రానుంటే తప్పించుకుని తాను పస్తులుండినప్పటికీ తనబిడ్డను సాకుకోలేక నానా యమయాతనలూ ఈ భూమిమీదే అనుభవించి తుదకు వోకాయన కానీ దయతలచి పారేస్తే దాన్ని తెచ్చుకోబోయి 'కారు' కిందబడిచచ్చిన దీనురాలికృపణగాథ యితివృత్తం!

ఆమె చచ్చినపైన కథకూడా అతకటంచాత కథా కల్పనలో కొంచెం పటుత్వం తగ్గింది.

ఈకావ్యంలో ధారాశుద్ధి వున్నది. పద్యాలు సాఫీగా నడుస్తవి. సమాసాలు చక్కగా అర్థమౌతవి. కావ్యం అయోమయంగా వుండదు. హాయిగా అర్థం ఔతుంది.

ఈ కవికి మాచాయగా శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీరంగం శ్రీనివాసరావుగార్ల ప్రభావం వున్నట్లు అక్కడక్కడ తెలుస్తూంది.

కొన్నిచోట్ల సత్యనారాయణగారి పద్యం నడిపించే విధం, కృష్ణశాస్త్రిగారిభావం, శ్రీ. శ్రీ సమాసాలూ తగులుతూంటై. వ్యంగ్యమర్యాదకంటె నలుగురికీ చక్కగా తెలిసే వాచ్యమర్యాదే ఈ కావ్యంలో ఎక్కువగా పాటింపబడ్డది.

ఉదాత్తంగా పుడమికీ స్వర్గమున కొక్కముడి రచించే భావపటిష్ఠత కొంచెం తక్కువ ఈకావ్యంలో. ఒక్కొక్కప్పుడు తేలిగ్గా చిన్నమాటలతో మాటుగా చెప్పతగ్గదాన్ని పెద్దపెద్ద సమాసాలతో చెప్తారు. అయినా ఆచెప్పటం మృదువుగా వుంటుంది.

కథను నడపటంలో—అంతా కవిచెప్పటమే కాని బిచ్చగత్తె ఏమీ మాట్లాడదు. కనుక కొంత రసోల్బణత తగ్గినది. అలాకాకుండా బిచ్చగత్తె సొంత సోది చెప్పుకున్నట్లయితే - ఆకొర్కెలు మాడి - అన్నింటికీ ఎండిన గొంతుకలోంచి ఎల్లాంటి రవ్వలు రాలేవో...-? ఆమె అంతా చెప్తే...చక్కని జాతీయోక్తులతో - తేలిక తేలిక పదాలతో అమాయికమైన ఆ అగ్నిహృదయాన్నుండి వొచ్చినవాణి నూటిగా హృదయాన్ని ఆతుక్కుని చదువరిమీద పని చేసేది.

కవే అంతాచెప్పటంచేత కొంత రామణీయకం తగ్గింది. శివరాత్రి వర్ణన ఆమే చేస్తే... ఎంత గొప్పగా వుండేది! కావ్యం రత్నంలా ప్రకాశించేది. అయినా కావ్యం సంసారపక్షంగా చక్కగానే వున్నది.

ఈ కావ్యంలో 'మెసేజి' వున్నది. బాగానేవుంది. కాని కవి యివ్వతలచి యిచ్చినట్లుగావున్నది. వుత్తమ కావ్యాల్లో మాదిరి లేదు.

ఈ కావ్యంలో 'కారు' సైకిళ్లు, మొదలైన ఆంగ్లసమశబ్దాలుకూడా కాలానుగుణ్యంగా ప్రయోగింపబడ్డవి. ఈ 'కావ్యం' ఎట్టిచదువరికైనా 'పాపం' అనిపిస్తుంది.



## గేయగుచ్ఛము

సబ్నవీసు గురునాధరావు

పెరుమాళ్లపల్లి. వినుకొండ పోస్టు

60 పుటలు: అర్ధరూపాయి

మనదేశములో జాతీయోద్యమము బయలుదేరిన తరువాత జనసామాన్యములో ఎంతోప్రబోధము కలిగినది. స్వాతంత్ర్యేచ్ఛ విరివిగా వ్యాపించినది. ప్రతి పట్టణములోనూ పల్లెలోనూ కవులు బయలుదేరి స్వాతంత్ర్యగీతములూ స్వేచ్ఛాగానములూ అల్లి పాడినారు. మొన్నటి శాసన సభల ఎన్నికల సందర్భములో ఎన్నెన్నో క్రొత్తపాటలూ పదములూ

ప్రతిదినమూ కల్పితములయి ఎంత తీవ్రముయిన ప్రచారము చేసినదో అందరూ ఎరిగిన విషయమే. జాతీయ ప్రబోధానికి గేయవాఙ్మయమువలె తోడ్పడే ఇతర సాధనమేదీ ఉండదు. జాతీయగీతములు పాడుకొంటూ అబాలగోపాలము నూతనోత్తేజము పొందుతూ ఉంటారు. భావోద్రేకమూ దానికి అనుగుణముగా ఉండే సుపరిచిత పదజాలమూ, వాటికి తోడుగా ఒకవిధమైన ఆవేశమును కలిగించే సంగీతమూ ఉంటే ఈ వాఙ్మయశాఖ ప్రజలను అనితరసాధ్యమైన అభ్యున్నతికి తీసుకురాగలదు.

ఈ 'గేయగుచ్ఛము' 25 గేయముల సంపుటము. గ్రంథాదిని శ్రీ కొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి గారి 'తొలిపలుకు' ఉన్నది. ఔచిత్యమునకు భంగము కలుగకుండదనిఅయినా భావించక కృతకభాషా భూయిష్ఠమయిన అగడబిడశైలిలో అరపుటల తొలిపలుకు రచించినారు. తొలిపలుకు తరువాత గ్రంథకర్త 'మనవి' దానితరువాత పలువురు పండితులు వ్రాసిన అభిప్రాయములున్ను శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు ఆంగ్లములోనూ మిగతావారు తేటతెలుగులోనూ వ్రాసినవి ప్రకటించినారు.

ఈ సంపుటములోని గేయములలో కవి ప్రధానముగా ఎత్తుకొన్న విషయములు. జాతీయోద్యమమూ, దేశనాయకుల సంకీర్తనమూ, అస్పృశ్యతా నివారణమూ, ఆంధ్రాభిమానమూ మొదలగునవి. ఇవికాక ప్రార్థనగీతములూ, ప్రకృతిప్రబోధమూ, రాజభక్తి (అష్టమ ఎడ్వర్డుసార్వభౌమునిగూర్చి వ్రాసినది) మొదలయిన విషయములగురించి వ్రాసిన గీతములు కొద్దిగా ఉన్నవి.

దేశభక్తి, జాతీయత, ప్రకృతిపరిశీలనము, భావనాశక్తి, లోకజ్ఞానము మొదలయిన సాధన సామగ్రి సమకూర్చుకొన్న ఈ కవి తన హృదయములో సహజముగా ఉత్పన్నమయిన ఉత్కృష్టభావాలను మామూలయిన తేటమాటలలో గేయరూపముగా వెలువరించినారు. ఈ పాటలు పాడడానికి యోగ్యముగా ఉన్నవి. ప్రతిపాటలోనూ హృదయములు కరిగించి హాయిపుట్టించే చరణములూ తెలుగులోని తీపికళలను వెలువరించే తీయని జాతీయోక్తులూ కనబడతవి. భాషగ్రంథమందంతటా ఒకతీరుగాలేదు. కొన్నిచోట్లనడక కుంటుపడి ఉన్నది. కొద్దిసవరణలు చేస్తే గ్రంథము ప్రశస్తముగా ఉంటుంది. గేయవాఙ్మయము తిరిగీ తలఎత్తి ప్రతిష్ఠ సంపాదించడానికి ఈ గ్రంథము కారకమయితే ఈ కవిపడ్డశ్రమ కోటిగుణముగా సఫలమవుతుంది.



## ముక్తావళి

తాడిమళ్ల బసవరాజు, బి. ఏ.
రామారావుపేట. కాకినాడ

డెమ్మీ 80 పుటలు : వెల 6 అణాలు.

ఈ గ్రంథములో పది కథలున్నవని ముఖపత్రముపైని ప్రకటించినారు. ఇందులోని రచనలన్నీ కథలే అని పేర్కొనడానికి అవకాశం ఉన్నట్లు కనబడదు. 'స్వర్గలోకము', 'కర్మఫలము', 'ప్రేమహృదయము', 'అట్లతద్ది', అనే శీర్షికలతో ఉన్న నాలుగు రచనలలోనూ కథాసంవిధానము మొదలయిన లక్షణాలు కనబడవు. వీటిని సామాన్యముగా "స్కెచెస్" అంటారు. కాబోలు. 'స్వర్గలోకం'లో ఉన్న విషయమిది:— 'అతడు' ప్రేమించి పెళ్లిచేసుకొన్న 'ఆమె' అకాల మృత్యువువల్ల తన్ను శాశ్వతంగా వదలివేయడమువల్ల బ్రతుకు దుర్భరమయి, 'ఆమె'ను స్వర్గలోకంలో కలుసుకోవలెనని 'అతడు' ఆత్మహత్య చేసుకోడానికి ఉద్యమిస్తాడు. అంతలో ఒకభూతము ప్రత్యక్షమయి స్వర్గం, నరకం వేరే ప్రత్యేక లోకాలుగా ఎక్కడా లేవనీ కర్మానుభవంకోసం అనేక జీవులు కలుస్తూ ఉంటాయనీ, 'ఆమె'ను తిరిగీ కలుసుకోవడం అసంభవమనీ బోధించి ఆ ఉద్య

మనసునుంచి విరమించేటట్టు చేస్తుంది. అతనికీ భూతానికీ జరిగిన సంభాషణే ఈ రచనలో ఉన్నది. ‘కర్మఫలం’లో ఒక ఇల్లాలికీ ఆమె భర్తకూ ఒకే రోజున ఒకదానివెంట ఒకటి వచ్చిపడ్డ పలువిధములయిన ఇబ్బందులు పొరుగింటి ఆవిడ ప్రశ్నించడమూ ఆయిల్లాలు జవాబుచెప్పడమూ మూలాన తెలుపబడ్డవి. ‘అట్లతద్ది’లో చిన్నపిల్లలానాడు చేసే కొంటెచేష్టలూ, ‘ప్రేమహృదయము’లో జాతిభేదములూ సంఘములోని ఎక్కువతక్కువలూ ఎరుగని కృష్ణుడనే బాలుడు నిరుపేద అయిన ఒక పంచముని దీనావస్థకు జాలిపడి తనయింట వానిని ఆదరించదలచుకోడమూ నిరూపింపబడ్డవి. ఈ రచనలలో మానవస్వభావ పరిశీలనమూ నిరూపణమూ కనబడతవి. ఇవి చదవడానికి ఉల్లాసకరముగా ఉంటవి.

కథాసంవిధానమూ, పాత్రపోషణమూ, రచనా చమత్కారమూ మొదలయిన లక్షణాలతో చక్కగా తీర్చిదిద్దిన ఉత్తమశ్రేణికథలు ఈ సంపుటములో కొన్ని ఉన్నవి. ‘ప్రతిక్రియ’ ఈ రకములోనిది. చిరకాలముగా తనపోషణలోఉండి నమ్మకముగా పనిచేస్తూఉన్న అమీర్ ఖాననే సేవకుడు ప్రాణతుల్యంగా చూచుకొంటూఉన్న తన తుపాకిని దొంగిలించాడనే అపోహతో మేజర్ గార్డన్ వానిని నౌకరీలోనించితొలగిస్తాడు. అమీర్ అవమానం సహించలేక మేమ్‌సాహెబాని వధించడమే గార్డన్‌కు తగినశిక్ష అని ఎంచి ప్రతీకారోద్యమంలో ఉంటాడు. సమయంకోసంవేచి తీరా వెళ్లేసరికి ముగ్గురు కొండదొంగలు గార్డన్ ఇల్లు దోచుకొని వాని భార్యను చంపి పిల్లను ఎత్తుకొని పోతూఉంటారు. ప్రతీకారేచ్ఛకుబదులు తన్నంతవరకూ పోషించినకుటుంబముమీద విశ్వాసంఒక్కసారిగా రేకత్తి దొంగలవెంటపడతాడు ఇద్దరిని సంహరిస్తాడు, మూడోవాడు పారిపోతాడు, పిల్లని సంరక్షిస్తాడు. ఇంతలో గార్డన్ తనకు కలిగినవిపత్తు తెలుసుకొని ఖానే ఆపని చేసిఉంటాడని ఊహించి వస్తూఉండగా పిల్లను చంకబెట్టుకొని ఖాన్ ఎదురుపడతాడు. గార్డన్ పేల్చిన తుపాకీ పిల్లకుకాకుండా ఉండాలని ఆమెను ప్రక్కకు విసరివేసి గుండుదెబ్బకు ఆహుతి అవుతాడు అమీర్ ఖాన్ కొంతకాలమయినతరువాత తప్పిపోయిన మూడో కొండదొంగవల్ల వాస్తవవిషయము తెలుసుకొని గార్డన్ తనఆస్తిఅంతా ఖర్చుపెట్టి ఖానుకు దివ్యమయిన సమాధి నిర్మిస్తాడు. ఈకథకల్పించడములో కథకుడు ఎంతనేర్పు కనబరచినాడో రచనలో కూడా అంత నేర్పుచూపినాడని చెప్పక తప్పదు. ఇది స్వతంత్రరచనే అయితే కథకుడిని ఎంతో కొనియాడవలసి ఉంటుంది. పర్యవసానము; కాలచక్రము; సుడిగుండాలు అనే కథలు పైకథతో సరి రాకపోయినా రసవంతముగానే ఉన్నవి. ‘ఇంటరు చదువు’, ‘ప్రేమబలి’ అనే కథలలో కూర్పులోని నేర్పూ, జిగీ తక్కువగా ఉన్నవి.

కథలలో ఏదో ఒకే విషయము (Problem) ఎత్తుకొని దాని సమర్థనమే ప్రయోజనముగా ఇతర విషయాలను - అవసరమయినంతవరకు మాత్రమే - చేర్చి కథ అల్లవలెను. వస్త్వైక్యము (Unity of plot) ప్రధానముగా గమనించవలెను. అనవసరముగా పాత్రలు ప్రవేశపెట్టడమూ, ప్రక్కపుంతలలోనికి పోయి లోకాభిరామాయణములోనికి దిగడమూ మొదలయినవి విసర్జించవలెను. ప్రస్ఫుటముగా చెప్పవలసిన విషయము చెప్పకపోవడము ఎంత అవలక్షణమో అనవసరప్రసంగముకూడా అంత అవలక్షణమే. ఒక వాక్యముచేర్చడానికి ఎడమీయకుండా ఒకవాక్యము తొలగిస్తే పొందికచెడిపోయేటట్టుగా రచన కట్టుదిట్టముగా ఉండవలెను.

‘పర్యవసానము’ అనే కథ చూడండి. దీనిలో చివర ఒకటిన్నర పుటలూ అనవసరమని తోస్తుంది. ఈ కథలో ‘శంకరం’ పాత్రను హఠాత్తుగా ప్రవేశపెట్టినాడు. కథానాయిక అయిన సుధ శంకరం గురించి దాసీవల్ల వింటుందేకాని వానిని ఆదివర

కెప్పుడూ చూడనయినా లేదు. చిన్న విషయాలను బట్టి అతడు తనభర్తకు నమ్మకమైన స్నేహితుడనీ సత్ప్రవర్తనకలవాడనీ మాత్రమే తెలియడానికి అవకాశం ఉన్నది. అట్టివాడు తనవాంఛను తృప్తి పరచడానికి అంగీకరిస్తాడో లేదో అనే శంక కూడా లేకుండా ఆమె ప్రవర్తించడము సహజమా? శంకరాన్ని నిద్రనుండి లేవగొట్టి మారుమాట చెప్ప డానికి అవకాశం ఇవ్వకుండా వానిని వశంచేసు కొన్నది. అప్పటికి గత్యంతరము లేక లోబడ్డా ఆరాత్రి గడచినతరువాత అయినా శంకరం పశ్చా త్తాప పడ్డట్టుగాని వానిమనసులో ఏదో ఆందోళన ఉన్నట్టుగాని చూపలేదు; అతడు మిత్రద్రోహము చేయుడానికి స్థిరసంకల్పము చేసుకొన్నట్టుగా నిరూ పించడము వాని పూర్వవర్తనానికి అనుగుణముగా ఉన్నదా? శంకరం తన్ను మోసగించినందుకు కథా నాయకుడయిన వేణు ఏమనుకొన్నాడు? సుధ ఎక్కడికి లేచిపోయినదో ఎంత ప్రయత్నించినా వేణుకు తెలియలేదట. ఆగ్రాలేచిపోయిన లక్ష్మిని కోనసీమభ్రాంతసుడు వెదకగలిగి ఉండగా (చూ. కాలచక్రము) సుధను వేణు వెదకలేక పోవడ మేమి? వీటికన్నిటికి తగిన సమర్థనలూ సమాధాన ములూ కథలోనే కూర్చవలెను. ఇటువంటిలోపాలు సవరిస్తే కథలు మరీ హృద్యముగా ఉంటవి.

ఈ కథలలో పాత్రలు నీతికి భిన్నముగా ప్రవర్తిం చినట్టు అక్కడకూడా ప్రదర్శించినా కథకుడు దుర్నీతి సమర్థించినట్టు కనబడదు. కర్మానుభవము వెనువెంటనే కలిగినట్టుగానో పశ్చాత్తాపము కలిగి నట్టుగానో వర్ణించినాడు.

కష్టించి ఆర్జించడమువల్లకాక లాటరీలలో గెలు పొంది ధనవంతులు కావడము ఈ గ్రంథకర్తకు నచ్చినట్టు కనబడుతుంది. కాలచక్రమనే కథలో 'చిట్టి' పేర వేసిన లాటరీటిక్కట్టువల్ల వెంకట రత్నానికి 50 వేల రూపాయలు లభిస్తవి. రిట్రెంచిమెంటువల్ల ఉద్యోగమునూ దారిద్ర్యంవల్ల భార్య 'లక్ష్మి'నీ కోలుపోయిన వాడికి కాలచక్రం తిరిగి లాటరీలో ధనం దొరుకుతుంది. 'లక్ష్మి' తిరిగి ఇల్లు చేరుకొంటుంది. 'సుడిగుండాల' లో కూడా లాటరీగెలుపు ప్రయుక్తమయినది.



## కారుణ్యం

కొడవటిగంటి కుటుంబరావు

యువకార్యాలయము. పాతపేట. తెనాలి

నాలుగణాలు

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు పాఠకలోకానికి చిరపరిచితుడు. ఆయన తనకథలు అన్నిరకముల పత్రికలలోనూ ప్రచురించినాడు. నాగౌరవమునకు ఈ పత్రికలో ప్రచురించడము పనికిరాదు, అని వృథాభిమానము పెట్టుకోలేదు. ఇకముందు తన కథలు పుస్తకరూపంగానే అచ్చు వేయించదలచు కొన్న ఆయననిశ్చయము అభినందించదగినది.

కుటుంబరావురచనలు స్వతంత్రమైనవి. ఆయన తనకథావస్తువులు ఇతరకావ్య ప్రపంచములోనుంచి తీసుకోక లోకమనేమహాకావ్యంలోనుంచిన్నీ తన ఊహలోనుంచిన్నీ తీసుకుంటాడు. గ్రంథచౌర్యము లేకపోవడము కూడా ఒక పెద్దగుణమేనా అని ఎవరైనా అడగవచ్చును. కాని ప్రస్తుతము మనదేశ ములో ప్రకటన అవుతున్న కథల స్థితినిబట్టి చూస్తే అది గొప్పగుణముగానే చెప్పవలెను.

ఈ స్వతంత్రత ఉన్నందువల్ల ఈకథకుడు లోకపరి స్థితులు స్వయముగా పరిశీలించి పాఠకులకు ఆలో చనలు రేపునట్లుగా కథలు వ్రాయగలిగినాడు. ఈ సంపుటిలో ఉన్న ఎనిమిదికథలలోనూ ఏకథ చదివినా తాత్కాలికముగా అయినా కొంత మనస్సులో చలనము కలగకమానదు. ఈయన తన రచనలవల్ల మనోవికాసం కలిగించవలెనని తనఆశయ మైనట్లు వ్రాసినాడు. దానిని కథలలో సార్థకము చేసుకున్నాడు. ఈ సంపుటిలో ఎనిమిదికథలున్నవి.

అందులో మొదటిది 'కారుణ్యం' అనే పేరుకలది. దానినిబట్టి సంపుటికి నామకరణము చేసినాడు. ఈ కథకునికూడా సామాన్యప్రాపంచిక విషయాలే కాక అతిలోక విషయాలుకూడా అందుకోగల దనడానికి ఇందులో 'జైలుఖానా', 'అనంతం' అనే రెండుకథలే ప్రబల సాక్ష్యముగా ఉండగలవు. "నేను కథలు రాసినంత తొందరగా అచ్చువేసే పత్రికలుకూడాలేవు" అని ముందుగా ఈ కథకుడు చెప్పుకున్నాడు. అది చదివినందువల్ల మాకు అన్యాయముగా దురభిప్రాయము కలిగిన దేమో చెప్పలేముకాని ఈకథల సంపుటిలో అతొందరఫలితము కనబడుతున్నది. కథావస్తువు మనస్సులో స్థిరముగా నిలిచి ఆలోడనఅయితేనేఅది ఉత్తమమార్గంలో రూపము పొందుతుంది. అటు కానినాడు అదిఅసంపూర్ణముగానూ, పేలవముగానూ ఉంటుంది. ఈ కథల రచనలో జాగ్రత్తకనబడదు. కొన్నిచోట్ల అనవసరమైనవిషయములు పెరిగిఉంటవి; మరికొన్నిచోట్ల పెంచవలసినది తరచుగా ఉంటుంది; గాఢముగా నాటుకొనేట్లు వ్రాయవలసినచోట్ల తేలిపోతవి. కథారచనలోనేకాక భాషలోకూడాఅజాగ్రత్త కనబడుతుంది. ఇతరభాషలలోఉండే వాక్యములవంటి వాక్యములు తెలుగులో వ్రాయరాదని మామతము కాదు. ముసలమ్మలు మాట్లాడే తెలుగు ఎంతో మంచిదే.అయినాముసలమ్మలఆలోచనలను మించిన విషయములు వ్రాసేప్పుడు తప్పక భాషమారుతుంది. అందువల్లనే మన పూర్వకవులు సంస్కృతము, ప్రాకృతము, కన్నడము మొదలయిన భాషలలో నుంచి వాక్యరచనలతీరులు తెలుగులోనికి చొప్పించినారు. ఇప్పుడు బెంగాలీ హిందీభాషలలో నుంచి ఎన్నోవస్తున్నవి. అన్నిటికంటే ఇంగ్లీషురచన మరీ ఎక్కువగా తెలుగులోకి వస్తున్నది. అది తప్పదు. అందువల్ల భాషకి బలమేకాని లోపము లేదు. కాని అట్టి ఇంగ్లీషురచనలు కొంత స్వాయత్తము చేసుకొని తెలుగులోకిమార్చి తెలుగుగా కనబడేటట్టు చేయవలె. లేకపోతే రచన కలవదు. తెల్లవాళ్లవలె సూటువేసి పైనిపిలకా తిరుక్షవరమూ పెట్టుకొని తలకు ఆచ్ఛాదనలేకుంటే ఆ మనిషి వితీరుగా ఉంటాడో అట్లాగే ఉంటుంది. అటువంటి రచన. రచయితలు ఈవిషయములో కొద్దిగా శ్రద్ధ తీసుకొంటె మంచిది. ఈ కాలపు రచయితలకు వారి సంస్కారములో ఎక్కువభాగము ఇంగ్లీషు ద్వారా కలుగుతున్నందువల్ల వారు ఇంగ్లీషులో ఆలోచించక తప్పదు. కాని తెలుగు రచనచేసేప్పుడు చేతనైనంతవరకు తెలుగు భాషలో ఆలోచించినా, తప్పనిసరిగా ఇంగ్లీషులో ఆలోచనలు పడ్డప్పుడు వాటిని చేతనయినంత మంచి తెలుగులోకి మార్చినా వ్రాయడము యుక్తము. ఇందులో కొంచెము శ్రద్ధా, ఓపికా కావలెను. అవి ఉంటే ఈగ్రంథములోకి అచ్చయిన ఇంగ్లీషు వాక్యరచన ఇంతగా వచ్చి పడేదికాదు. రచయిత కథాసందర్భమంతా ముందుగా ఆలోచించుకొని వ్రాసేప్పుడు ప్రతివాక్యమూ పదమూ ప్రయోజనానుగుణ్యముగా జాగ్రత్తగా ప్రయోగించవలె. సరిగా లేనిది తిరిగి తిరిగి చూచుకొని సవరించుకోవలె. అందులో తప్పులేదు. చిత్రకారుడు తన కుంచెతో బొమ్మమీద ఎప్పుడు రంగు చిలికినా ఆలోచనతోనే చిలకవలె. కథకుడు కూడా అంతే. ఒకవిధముగా మన అదృష్టమువల్లనే మనదేశములో మనకు కథారచనవల్ల ధనప్రాప్తి కలగడములేదు. కాబట్టి ధనలాభమనే ప్రయోజనమైనా లేదని తెలిసికూడా ఈతొందర ఎందుకు ! నేను స్వభావసిద్ధముగా తొందరగా వ్రాస్తానంటే ఆమాటలో అర్థంలేదు. నాకు స్వభావసిద్ధముగా అజాగ్రత్త ఉన్నదంటే లోకము సహిస్తుందా ? అశ్రద్ధకనబడని తొందర శ్లాఘ్యమే. కాని అది దుర్లభము. కథలలో మాత్రము ఆశుకవిత్వమెందుకు ?

ఈ సంపుటిలోని కథలన్నీ ఆలోచనను రేపుతున్నవన్నాము. అది వాస్తవమేకాని ఇంతకంటే ఎక్కువ తీవ్రముగానూ గాఢముగానూ ఆలోచనలు రేపితే ఇంకా బాగుంటవి, ఈ కథలలో ఎందువల్లనోకాని మాధుర్యము తక్కువగా కనబడుతుంది.

కథలన్నీ మధురంగా ఉండవలెననము కాని ఏకథకయినా మాధుర్యముకూడఉంటే దానికొక విశేష శోభ కలుగుతుంది.

కృతికర్త ఈ గ్రంథము వెయ్యికాపీలు అచ్చు వేయించినాడు. వెయ్యి కాపీలు ఖర్చు అయినా సంతోషిస్తానన్నాడు. పుస్తకాలు స్వయముగా కొనుక్కొనే దురభ్యాసము మన దేశములో లేదు. అయితే కొన్న, తెలివితక్కువ వారివద్ద ముష్టి తెచ్చుకొని చదివేవాళ్లయినా ప్రస్తుతము మనలో ఎక్కువవున్నారు. అందువల్ల ౧౦౦౦ పుస్తకాలే అమ్మకమయినా రెండువేలమంది ఆపుస్తకాలుచదివిఉంటారని మనము అంచనా వేయవచ్చును. మూడుపేజీలున్న ఈపుస్తకము ఖరీదు పావలామాత్రమే పెట్టినారు. ఇట్లా పుస్తకాలవెల చౌకచేసిఅయినా మన ఆంధ్రలోకము చేత పుస్తకాలు స్వయముగా కొనే దురభ్యాసము చేయిస్తే బాగుంటుంది. అందువల్ల గ్రంథకర్తలకు తమవృత్తివల్ల జీవనోపాధి ఏర్పడుతుంది. గ్రంథకర్తలు వ్రాసిన గ్రంథాలుచదవకుండా దూషించేవారే ఎక్కువమంది మనదేశంలో. పోనీ అట్లా తిట్టేందుకైనా పుస్తకాలు కొంటూ ఉంటే ఎంతబాగుంటుంది?



## పాపం!!!

(వెల 0–4–0)

గుడిపాటి వెంకటచలం

యువకార్యాలయం. తెనాలి

కథ కావ్యభేదాలలో ముఖ్యమైనదిగా అధునికయుగంలో గణనకెక్కింది. పూర్వకాలంలోకూడా, కథకు చాల ఉన్నతస్థానం సాహిత్యంలో లేకపోలేదు.

సంస్కృత సాహిత్యంలో, పంచతంత్రము, హితోపదేశము, విక్రమార్కచరిత్ర, కథాసరిత్సాగరం మొదలగు గ్రంథములు కథారత్నములకు గనులై ఉన్నాయి. కాని అవి అనేకకథలు కూర్చిన మాలలు. విడికథలుగావు. (Short story) చిన్నకథ అని యిప్పుడు ప్రాచ్య పాశ్చాత్య సాహిత్యములలో వ్యాప్తికి వచ్చినట్టి కావ్యము పూర్వంలేదు. ఉపజ్ఞగలకవులు అనేకు లీవిధమైన కథాకావ్యములను ఇప్పుడు రచిస్తూ ఉన్నారు.

తెలుగుదేశంలో కథకులలో గుడిపాటి వెంకటచలంగారు ప్రసిద్ధులు. వీరికథలు నాటకములు ఆంధ్రదేశంలో, చాలామంది పాఠకులు - కొత్త సిద్ధాంతాలవారు, పాతసిద్ధాంతాలవారు, అతురతతో చదువుతారు.

ఈ సంపుటికి పాపం!!! అని ఎందుకుపేరు పెట్టారో తెలుసుకుంటే ఈ కథలలోని విషయం తెలుస్తుంది. ఈకథలలోని కథానాయికానాయకుల అవస్థలు చాలా జాలిగలుగ చేస్తున్నవని బహుశా గ్రంథకర్తగారి అభిప్రాయమై ఉండవచ్చును. ఈ కథలన్నిటిలోను కథావస్తువు ఏమిన్నీ లేదు. సాధారణంగా కథకు ప్రాణమైనటువంటి వస్తుచలనము, విచిత్రసంఘటనము, వివిధరసపోషణము, కథలలో కనపడదు. వీటిలో కథేలేదు. వెంకటచలంగారికి పాత్రలసంభాషణ వ్రాయుటయందు మంచి నేర్పుకలదు. అదిమాత్రము ఈ కథలలో ప్రాచుర్యంగా కనిపిస్తోంది. ఈ కథలన్నిటిలోను సామాన్యమైన హంశమొకటి ఉన్నది. అదే ఈవివిధకథలను గుదిగుచ్చుసూత్రము. అది స్త్రీ పురుషుల స్వేచ్ఛాకామప్రశంస. కథచెప్పడానికి ఏదైనా ఉద్దేశము కవికి వుందా అంటే అది బహుశా యీరచయిత విషయంలో స్వేచ్ఛాకామ ఉత్కృష్టత అని చెప్పవలసిఉంటుంది. రచయిత తన స్వేచ్ఛాకామసిద్ధాంతములను ఉదాహరించుటకుగాను, ప్రపంచములోనుండి కొన్ని అంశములను సంగ్రహించి యీకథలు వ్రాయబడినవి. ...అక్కడక్కడ ప్రపంచములో యిట్టి విశేషములు ఉండినను ఉండవచ్చును. అట్టి జీవిత

ముల మనస్సులో వుంచుకొని యీకథలు వ్రాయబడియుండినను యుండవచ్చును. కాని యీకథలలోని పాత్రములవంటి పాత్రములు, వారి ఆలోచలవంటి ఆలోచనలు సామాన్యప్రజలలో సామాన్యంగా కనపడవు. విపరీత కామేచ్ఛకలిగిన మనుష్యులజీవితాలు ఆధారంచేసుకొని వ్రాసిన యీకథలు సామాన్య మానవునికి ఆదర్శంకాజాలవు - ఆకర్షింపనూలేవు. ఈ కామసిద్ధాంతాలూ, వీటి నిజానిజములూమంచిచెడ్డలూప్రాచ్యపాశ్చాత్య పురాతన అధునాతన విద్వాంసుల అభిప్రాయాలతో విమర్శచేయుట కిది తావుకాదు. ఈకథలు వయసు వస్తూన్న స్త్రీపురుషులు చదువతగినవికావు వీటిని చదువుటవల్ల స్వచ్ఛమై సరళమై పవిత్రమైన ప్రేమాంకురములు పుట్టి విజృంభించి పెరుగవలసిన మనసులలో తుచ్ఛమై హేయమై, నీచాతినీచమైన విషవృక్షాంకురములు ఉదయించి ప్రబలును. గంజాయి, మాదుమ భంగువలె మనస్సుకు సుఖాభాసములను చూపించి కలతపెట్టి ప్రమత్తత కలుగచేయును.

ఇందులో మొదటికథ "మోసంచేసిందా" అన్నది. మగలిమొగుడితోనూ, కష్టపెట్టే తలిదండ్రులతోనూ బాధపడే "లలిత" తన స్నేహితుడు హనుమంతరావుతో లేచిపోవడానికి నిశ్చయించుకొన్న ఆమెకు - ధర్మసందేహమొకటి కలిగింది. ఆవిడమాటలలోనే అదేమిటంటే "చూడండీ; పాపంకదండీ! పెళ్ళికానివాళ్ళతో సహవాసం. అసలుభార్యగా వుండడం పాపంకదూ! ఈకాస్త సుఖానికే వెళ్యోళ్లు నరకంలో అగ్నికుండంలో కాలడం పోనీ యిట్లా మాట్లాడుకుంటే తప్పేముందికాని" ఈమాటలు అనేటప్పటికి ఆవిడ హనుమంతరావను స్నేహితుడొకడితో శృంగార చర్యలు నడుపుతూవుంది చాలా. గ్రంథకర్త అయిన హనుమంతరావుస్నేహితు డామెసందేహాలు తీరుస్తాడు. "స్త్రీపురుషవాంఛ సంహజం. మృగాల్లో పుణ్యపాపాలున్నాయా? మనుష్యుల్లో పాపమని యెవరన్నారు! దేవుడొచ్చి చెప్పాడా! పుస్తకాల్లో రాశారు. ఎవరు! కొందరు మహానుభావులు...మూర్ఖుల్ని దడిపించారు! ఈ సిద్ధాంతాలతో లలితకు సందేహాలు తీరిపోయి యీ స్నేహితుణ్ణి వదిలి హనుమంతరావుతో లేచిపోతుంది ఇదీకథ.

రెండోకథలో, పోలీసు డిప్టీసూపరెంటు వెంకట బ్రహ్మంగారి జీవితచరిత్ర ఉంది. ఆయనకు చాలాకాలంవరకూ, తన పెళ్లానికి తన రైటరుకూ సంబంధం వుందని తెలియదు. తెలిసిన తర్వాత భార్యను దిద్దడానికి ప్రయత్నిస్తాడు. ఆ ప్రయత్నాలేవీ సాగవు. వెంకట బ్రహ్మంగారికి చిత్రంగా కనపడినదేమిటంటే ఆవిడ కులాసాగా తనతోను అనుభవిస్తుంది వాడితోనూ అనుభవిస్తుంది. అతణ్ణి వదలలేదు. తనమీద అసహ్యంలేదు. కారణం తెలియదు. తాను భార్యనివదలి పిల్లల్ని తీసుకువెళ్లిపోతాడు. పిల్లలు తన దగ్గరవుండరు. తల్లికోసం ఏడుస్తారు. తిరిగి తీసుకువచ్చి పిల్లల్ని దిగబెటతాడు. భార్య బహిరంగంగా ఆరైటరుతో కాపరం చేస్తూ వుంటుంది. వెంకటబ్రహ్మంగారు పిల్లలకోసం బెంగపెట్టుకొంటాడు. ఒంటరిగా వుండలేక తిరిగి వచ్చి వాళ్ళ సుఖజీవనం చూస్తాడు. కాని ఆ యింటిలో వుండలేనకుని వెళ్ళిపోతాడు. తరువాత కొంతకాలానికి ఆరైటరు చచ్చిపోతాడు. అప్పుడు తిరిగి భార్యనూ పిల్లలనూ చేరుకుంటాడు. ఈ కథ పేరు 'ఒంటరితనం'

మూడోకథలో ఓ హెడ్మాష్టరుగారిభార్య నలభై ఏళ్ళు దాటిన ఆవిడ - కురూపులలో ఫస్టు ప్రైజు రాతగ్గ ఇంకో మేష్టరును ప్రక్కింట్లో కాపరంవున్న వాణ్ణి ప్రేమించి, పొందుతుంది. ఆ మాష్టరు పెళ్ళాం ఇది కనిపెట్టి వాళ్ళ వ్యవహారాలు కొంతకాలం సాగనివ్వదు. తరువాత ఓరోజురాత్రి ఆవిడకోసం వెడితే ఆవిడ మోహం తెంపుకుని - భర్త మొహం తిరిగి ఏలాచూడను అనే పరితాపంతో వీణ్ణి తిరస్కరించి ఆత్మహత్య చేసుకుంటుంది.

నాలుగోకథ తానువృద్ధుడుకాబట్టి భార్యని యింటికి వచ్చినవాడికల్లా తార్చి డిప్టీసూపరెంటు గోపాలయ్యరు భార్యకథ. ఇంటికివచ్చే "గెస్టు" ఎవడూ లేకపోతే రాత్రి పదిగంటలకు తన జవాన్ భవానీ సింగ్‌ని, పిల్చి "భవానిసింగ్" అమ్మగారి అవసరం చూడు" అంటాడుట. అందుచేత ఈకథకు "అమ్మగారి అవసరం" అని పేరు. ఈకథ చదివేసరికి అసహ్యంచేత సహృదయుల కెవరికైనా డోకురాక మానదు. ఈ కథరసస్రష్టి డెవ్వడును వ్రాయలేడు. చదివి ఆనందించనూలేడు. ఈ కథవ్రాయుటకు ఒక్క వెంకటచలంగారికే తగును.

ఐదోకథ "అవసరంలేని ఆపరేషను" బిడ్డలు లేక ఆపరేషన్ చేయించుకొనుటకు లేడీ డాక్టరు దగ్గరకు భయపడుతో వచ్చిన ఒక స్త్రీతో ఆలేడీడాక్టరు భర్త రహస్యంగా ఆపరేషన్ అవసరంలేదనిన్నీ, బిడ్డలు కలుగకుండా ఉండుటకు లోపం ఆమె భర్తదనిన్నీ- "ఒక యెద్దుదగ్గర యీదకాకపోతే అవును మరో యెద్దుదగ్గర ఎలాతోల్తారో మనుష్యులలోను అలాగేనన్నిన్నీ "తమకుటుంబం సంతానానికి ప్రసిద్ధి" అనిన్నీ నచ్చచెప్పి - సంతానం ఆమెకు ప్రసాదిస్తాడు.

ఆరోకథలో కృత్రిమసన్యాసులు బాలవితంతువులను ఎలా మోసము చేస్తారో అసంగతివుంది.

ఏడోకథ పేరు "ఎదగనేలేదు ఈ కథానాయకుడికి "ఆడ వాళ్ళవొంటి అందమంటే చాలాతృష్ణ" చాలా అందమైన తనప్రియసిని కొంతకాలం అనుభవిస్తాడుకాని క్రమేపీ ఆప్రియసి ఆరోగ్యంచెడుతుంది. కవిగారి మాటల్లో ఆవిడ అవస్థ ఏలావున్నదంటే - "అదినాచేతుల్లో నలిగి వేళ్ళాడిపోవడం నాకళ్లు గుర్తుపట్టాయి. నేను గట్టిగావాడుకునే స్తలము ప్రతిదీ కృశించింది. వాడిపోయి ముడతలు పడ్డది." అసభ్యవర్ణనకు ఇంతకంటె పరమావధి వుండదు. ఇకతాను - పూర్వంలాగే ఉన్నాడు. ఇంక అందంగాకూడా తయారయాడు. ఇంతలో ఆమెకు గర్భం కలిగింది. మరింతజబ్బుపడింది. ఆమెయందు నాయకుడికి క్రమంగా విరాగం గలుగుతుంది. ఒకరోజున ఆమెకు జబ్బుగా ఉండగా పరిచర్యకు ఆమె తల్లీ చెల్లెలూ వస్తారు. అంతా ఒకగదిలో పడుకున్నారు. అర్ధరాత్రివేళ నాయకుడికి దాహంవేసి మంచినీళ్ల చెంబుకోసం వెతకబోయి అత్తగారి రొమ్ముమీద చెయివేస్తాడు. అతని చెయ్యిపట్టుకుని అట్టేపెట్టుకుంది. మర్నాడురాత్రి అతనిని లేపి తన పక్కమీదకి తీసుకు వెళ్ళింది. అక్కడ నుంచి అత్తతో చాలాసౌఖ్యపడుతాడు. ఈ సౌఖ్యమంతా చాలా వివరించారు గ్రంథకర్తగారు. నాయకుడికి భార్యమీద ప్రేమపోయింది. అత్త తన కూతుర్ని 'అమ్మాయీ' 'బుల్లెమ్మా' అంటూంటే నాయకుడికన్నీ అలాగే అనిపించింది. ఈ కథలోవున్న వేదాంతంయిది. చివరకు భార్య ఆత్మహత్యచేసుకుంటుంది.

తరువాతకథ మరీ చిత్రమైనది. రైలులో పోతూవున్న హిందూస్థానీవాళ్ళపిల్ల ఒకర్తెని ఆంధ్రుడొకడు లేవదీస్తాడు. దానికీ వీడికి పరిచయం కొవ్వూరు మొదలు కడియందాకా- ఐతేనేమి ప్రేమ ఎంతలోకలిగి వృద్ధిపొందదు! ఆమెకు తెలుగు రాదు. వీడికి హిందూస్థానీరాదు. పడవలరేవులోకి వెళ్లిగది మాట్లాడి ఆమెను లోపలికి ఎక్కించాడు. సరసాలకి దిగాడు కాని ఆమెమాత్రం యిష్టంపడలేదు. ఆమెను వదిలిపెట్టి లేచిపోతాడు.

ఆఖరుది ఒక (Sexual Pervert) ఒక వీడి సంభోగశృంగారం భార్యను కొరకడం - రక్తం వచ్చేదాకా. ఎక్కడ పడితే అక్కడ. ఓరోజున

బుజంమీద – ఓకోజాన రొమ్ముమీద – ఓకోజాన చేతిమీద. ఆమెకు వళ్లంతా గాయాలే ఆమెకు ప్రియ అన్నా లాలన అన్నా కొరకడం అనే అభిప్రాయం ఆమె యీ గాయాలతో సమస్త బాధా పడి చివరకు చనిపోతుంది. ఈ కథలన్నీ వ్యవహారి భాషలో వ్రాయబడ్డవి; వెంకటచలంగారి భాష (Standard Telugu) కి చాలా సమీపంగా ఉంటుంది అక్కడక్కడ కొన్ని పదాలు మాండలీయక రూపాలు "కావలించు" "చెక్కలు" వంటివి ఉన్నాయి. ఈ కథలనిండా అశ్లీలం ధ్వనించే వర్ణనలు ఉండుట శోచనీయము. 36 వ పేజీలో "గ్రీస్‌లో, పదోశకముల్లో తెలుగు స్త్రీలు అరవస్త్రీలతో ఏమాత్రమూ యీడు రారు." ఈలాటి వాక్యాలు గ్రంథములో చేర్చుట సంఘదూషణమని మా అభిప్రాయము.

# సంపాదకులు

## స్వవిషయము

‘ప్రతిభ’కు తొలిసంవత్సరముగడచి రెండో యేడు వచ్చింది. కేవలము సదాచారము పాటించడముకోసమే కాక ఆత్మాభివృద్ధి కాంక్షతో కూడా ఒక్కసారి సింహావలోకనము చేసి పత్రిక మొదట సంకల్పించుకొన్న రీతిగా నడుస్తూ ఉన్నదో లేదో పరీక్ష చేసుకోవలసి ఉన్నది.

ఈసందర్భములో మామిత్రులు అక్కడక్కడ అంటూవచ్చిన మాటలు జ్ఞప్తికి వస్తున్నవి. అచ్చు బాగులేదని కొందరూ, ‘గెటప్’ తృప్తికరముగా లేదని కొందరూ, ‘సాహితి, సఖి, ఉదయిని పాటిగా అయినా ఉండవద్దా’ అని కొందరూ, వ్యాసాలకు చాలా పేజీలు విడిచిపెట్టుతున్నారని కొందరూ, మంచి వ్యాసాలు రావడము లేదని కొందరూ, పద్యాలు తగ్గించాలని కొందరూ కొందరిపద్యాలకు వెలివేస్తే బాగుండునని కొందరూ, కథలు చాలవని కొందరూ, విమర్శలు మరీ ఘాటుగా ఉన్నవని కొందరూ ఈవిధముగా ఎవరికి తోచినమాటలు వారు అన్నారు. ఇంతమందీ సదభిప్రాయముతోనూ ‘ప్రతిభ’ మీద అభిమానముతోనూ అన్నమాటలు మేముతప్పక గమనించి ఉన్నలోటుపాట్లు సవరించుకోవలసినదే. ముద్రణము ఆంధ్రగ్రంథాలయ ముద్రాశాలకు మార్చినాము.

సాహితి, సఖి, జయంతి, ఉదయిని మొదలయిన సుప్రసిద్ధ సారస్వత పత్రికలకు వ్యాసములు వ్రాసినవారే ప్రతిభకుకూడా వ్యాసములు అభిమానపూర్వకముగా పంపుతున్నారు. వారి ఇప్పటిరచనలు మునుపటిరచనలకంటె ఎక్కువ ప్రశస్తముగా ఉన్నవనే మా అభిప్రాయము. అయితే ఇవి ఇంకా ఉన్నత శ్రేణిలోనికి రావలెనని పాఠకులు భావించడమువల్ల రచయితలు మరింత శ్రద్ధవహించి పాఠకలోకానికి తృప్తి కలిగించడానికి పూనుకొంటారనీ వాఙ్మయాభివృద్ధికి అవకాశము కలుగుతుందనీ ఆశపడుతున్నాము. అల్లరిచిల్లర రచనలతో సామాన్యముగా తృప్తిపడుతూ ఉండే ఈరోజులలో ఉన్నతాశయములు పెట్టుకొని ఈపత్రిక ఇంకా ఉచ్చదశకు రావలెనని కోరే సహృదయులు ఉండడము మా కెంతో ముదావహము. వారి ఆశయాలకు అందేటట్టుగా పత్రిక నడపడమే మా అభీష్టము. పద్యాలు తగ్గించడము మాకు సమ్మతము కాదు. కావ్యరచనలో మనవారు చేస్తూఉన్న నూతన యత్నములకు - కొత్తఛందస్సులు వాడుకలోకి తీసుకురావడమూ, వ్యావహారికభాష

లో పద్యములు వ్రాయడమూ మొదలయిన వాటికి ఈపత్రికలో తావు కల్పించవలెనని మొదటనే సంకల్పించుకొన్నాము. సమీక్షార్థము వచ్చే గ్రంథాలను తగినవారిచేత విమర్శ చేయించవలెననీ, గ్రంథాల బాగోగులు మొగమాట పడకుండా వ్యక్తము చేసి పాఠకలోకానికి ఆయా గ్రంథాలను గూర్చి సరిఅయిన అభిప్రాయము కలిగేటట్టు చేయవలెననీ మా ఆశయము. వ్యక్తి దూషణానికి దిగడమూ అనుచితమయిన పొగడ్తలకు పోవడమూ గ్రంథము చదవకుండా లేనిపోని పొల్లుమాటలల్లడమూ మా ఉద్దేశము కాదు. మా ఆశయము గ్రహించి గ్రంథకర్తలూ గ్రంథప్రకాశకులూ విమర్శార్థము గ్రంథాలు పంపడానికి వెనుదీయరని భావిస్తాము.

మొదటి సంపుటములో పరిషత్తు నాలుగవ అయిదవ వార్షిక సభలలో అధ్యక్షత వహించిన ఆదినారాయణ శాస్త్రిగారూ రామమూర్తి పంతులుగారూ నవ్యసాహిత్యోద్యమముగురించిచేసిన ఉపన్యాసాలూ భాషాచరిత్రకు సంబంధించిన వ్యాసాలూ ప్రకటించినాము. సారస్వత శాఖకు సంబంధించినవి పదివ్యాసములు ప్రకటించినాము. రెండు పద్యనాటికలూ రెండు గద్యరూపికలూ ఖండకావ్యములూ గేయములూ కథలూ గ్రంథవిమర్శనములూ ఈసంపుటములో ప్రకటితము లయినవి. ఈ పత్రిక ఇంకా ఉన్నతికి రావడానికి నవ్యసాహిత్యప్రియు లందరి తోడ్పాటూ అపేక్షిస్తున్నాము.

## కైలాసవాసి జనార్దనరావు

ఉదయినీ పత్రికాధిపతులూ మా కత్యంతాప్త మిత్రులూ నవ్యసాహిత్య పరిషత్కార్య నిర్వాహకవర్గ సభ్యులూ అయిన కొంపెల్ల జనార్దనరావుగారి అకాలమృత్యువార్తవిని ఎంతో విషాదము పొందినాము. భారతిలోనూ ఆంధ్రవిజ్ఞాన సర్వస్వములోనూ వీరు ప్రకటించిన వ్యాసములు పండితామోదము పొందినవి. గ్రంథములు విమర్శించడములోనూ గద్యపద్య రచనలలోనూ వీ రవలంబించినది విశిష్టమయిన నూతనపథము ఉదయినీ పత్రిక నెలకొల్పి దానిని లక్ష్యప్రాయముగా చేయడానికి తన సర్వశక్తులూ ధారపోసిన సారస్వతప్రియు డీయన. నిరాడంబరజీవీ, స్నేహపాత్రుడూ, ఇంకా ఎంతో ముందుకు రాదగ్గవాడూ! ఈయనకు ఊర్ధ్వలోక ప్రాప్తి అగునుగాక !

ఉదయిని ఆగిపోకుండా నడపడానికి మిత్రులు శ్రీ గోవర్ధనరావుగారు ఆలోచిస్తున్నట్టు తెలుస్తుంది.

## "ప్రతిభ" ఆదాయవ్యయములు

### ≡ ఆ దా య ము ≡

| | | |
|---|---|---|
| విరాళములవల్ల | రూ. | 210.0.0 |
| సభ్యుల చందాలవల్ల | రూ. | 174.0.0 |
| విడిసంచికల అమ్మకము | రూ. | 3.0.0 |
| ప్రదర్శనాలవల్ల | రూ. | 96.0.0 |
| | రూ. | 483.0.0 |

### ≡ వ్య య ము ≡

| | | |
|---|---|---|
| కాకితము | రూ. | 196.15.0 |
| అచ్చు | రూ. | 294. 5.0 |
| తపాలా | రూ. | 99· 4.3 |
| పార్సెల్సు | రూ. | 14.11.0 |
| బ్లాకులు | రూ. | 2. 0.0 |
| ప్రయాణాలు | రూ. | 5. 0.0 |
| చిల్లరలు | రూ. | 7.10.9 |
| | రూ. | 619.14.0 |

1937 సంవత్సరము జూన్ అఖరుకు
కార్యదర్శికి ఇవ్వదేలినబాకీ రూ. 136.14.0

### ≡ ఆ దా య ము ≡

### ≡ వి రా ళ ము లు ≡

| | | |
|---|---|---|
| శ్రీముక్త్యాల కుమారరాజాగారు | రూ. | 35 |
| శ్రీచిరుమామిళ్ళ విజయపార్థసారధిగారు | | 25 |
| జయంతి శ్రీరామమూర్తిపంతులుగారు | | 25 |
| కాళ్లకూరి సూర్యనారాయణగారు | | 20 |
| నోరి నరసింహశాస్త్రిగారు | | 10 |
| తెలికిచర్ల వెంకటరత్నంగారు | | 10 |
| చింతా దీక్షితులుగారు | | 10 |
| గోగులపాటి వెంకయ్యగారు | | 10 |
| వింజమూరి పార్థసారధిగారు | | 10 |
| పెద్దిభొట్ల వెంకటాచలపతిగారు | | 10 |
| అమంచర్ల శేషాచలపతిరావుగారు | | 10 |
| పొంనంది జగన్నాథస్వామిగారు | | 10 |
| డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు | | 10 |
| మంత్రిప్రగడ సాంబశివరావుగారు | | 5 |
| కాకి ప్రభాకరరావుగారు | | 5 |
| తెలికిచర్ల కృష్ణమూర్తిగారు | | 5 |
| | | 210 |

### చందాలు : ఒక్కొక్కరు రూ 2

మల్లవరపు విశ్వేశ్వరరావుగారు
పురిపండా అప్పలస్వామిగారు
బుద్ధిరాజు హనుమంతరావుగారు
ఎస్. వెంకటేశ్వర శాస్త్రిగారు
బెజవాడ గోపాలరెడ్డిగారు
జనమంచి కామేశ్వరరావుగారు
ఆచంట జానకీరామ్‌గారు
దేవరాజు వెంకటకృష్ణారావుగారు
ముద్దా విశ్వనాధంగారు
నల్లగొండ మంగయ్యగారు
గురుభాగవతుల సుబ్బారావుగారు
తల్లాప్రగడ రామారావుగారు
కొడాలి ఆంజనేయులుగారు
కందుకూరు అనంతంగారు
వింజమూరి రంగాచారిగారు
బొడ్డు బాపిరాజుగారు
కొమాండూరి శఠకోపాచార్యులుగారు
మల్లంపల్లి నాగభూషణంగారు
త్రిపురారిభట్ల వీరరాఘవస్వామిగారు
చిరుమామిళ్ల విజయపార్థసారధిగారు
నోరి నరసింహశాస్త్రిగారు
తెలికిచర్ల వెంకటరత్నంగారు
చింతా దీక్షితులుగారు
అడవి బాపిరాజుగారు

కాశీపట్నపు కొండయ్యగారు
కావూరి కోదండరామయ్యగారు
బాలూరు వెంకట కామేశ్వరరావుగారు
మొక్కపాటి సుబ్బారావుగారు
అత్తిలి సూర్యనారాయణమూర్తిగారు
అవంత్స వెంకటరంగారావుగారు
గుళ్లపల్లి నారాయణమూర్తిగారు
బి. ఎస్. చెట్టిగారు
వేమూరి వెంకటేశ్వర్లుగారు
పుచ్చా వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
వేదుల సత్యనారాయణశాస్త్రిగారు
మాధవరామశర్మగారు
కొడవటిగంటి కుటుంబరావుగారు
కొడవటిగంటి కృష్ణమూర్తిగారు
పిల్లలమర్రి బాలకృష్ణశాస్త్రిగారు
నండూరి శేషాచార్యులుగారు
వంగల వెంకటరామశాస్త్రిగారు
పెద్దిభొట్ల రామచంద్రరావుగారు
మల్లెల శ్రీరామమూర్తిగారు
పుటుంబాక శ్రీరాములుగారు
మొక్కపాటి నరసింహశాస్త్రిగారు
శ్రీశివశంకరశాస్త్రిగారు
తల్లావజ్ఝల కృత్తివాసతీర్థులుగారు
కాటూరి వెంకటేశ్వరరావుగారు
పాటిబండ మాధవశర్మగారు
సి. ఎస్. రాఘవాచార్యులుగారు
పెనుమర్తి కామేశ్వరరావుగారు
చావలి బాలసుందరంగారు
కొమరవోలు నాగభూషణరావుగారు
అన్నె అంజయ్యగారు
గోవిందరాజు దత్తాత్రేయశర్మగారు
మంతెన వెంకటరాజుగారు

ఎస్. వెంకటరామయ్యగారు
జి. శ్రీరాములుచౌదరిగారు
భారతుల పున్నయ్యశాస్త్రిగారు
వింజమూరి ఈ. దత్తుగారు
కర్లపాలెం నరసింహారావుగారు
గొడవర్తి సూర్యనారాయణగారు
వాసిరెడ్డి వెంకటసుబ్బయ్యగారు
కోకా శంకరరావుగారు
వి. యల్. శాస్త్రిగారు
కొమరాజు వినాయకరావుగారు
చాగంటి సూర్యనారాయణమూర్తిగారు
సుసర్ల రామమూర్తిగారు
మునుపల్లి సీతారామయ్యగారు
అమృతలూరు భాషాసంజీవనీసంఘం
పి. రామస్వామిగారు
కె. వి. రావుచౌదరిగారు
పులిపాటి రామారావుగారు
పాటిబండ్ల వెంకటపతిరాయుడుగారు
చావలి చినపేరయ్యశాస్త్రిగారు
ఎమ్. సీతారామయ్యగారు
తాడేపల్లి చిదానందంగారు
దేశిరాజు సుబ్రహ్మణ్యంగారు
జంధ్యాల పురుషోత్తమశాస్త్రిగారు
ఎస్. తులసీదాసునాయుడుగారు
వేదాంతం లక్ష్మీపతిగారు
గోగినేని రామనాథంగారు
చిట్టి వెంకటేశ్వర్లుగారు
మాదేటి వెంకటకోటయ్యగారు
ఏకా లక్ష్మీనరసింహంగారు
వీరరాజుగారు
విజయనగరం మహారాజావారి
సంస్కృత కళాశాలాధ్యక్షులు.






ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల . బెజవాడ